ఓమ్

# శీలవతి

(చారిత్ర నాటకము)

కృతికర్త:

వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు.

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,

మెక్లారెన్ హైస్కూలు,

కాకినాడ.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

నిమో స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

కాకినాడ, 1939.



వెల రు 1-8-0

# కృతిసమర్పణము.

శ్రీ వేంకటగిరి మ♦హావసుధాధిప,
తతవంశజాత ము♦క్తాఫలంబు
శ్రీ వీరనగరధా♦త్రీశ్వరీ స్వీకృతా,
మూల్యానందన రత్న♦భూషణంబు
అశ్వఖేలన కళా ♦ విశ్వ విఖ్యాతయు,
శశ్చంద్ర దీపితా ♦ శాంచలుంషు
బహు దివ్యనవ్యకా♦వ్య రమణీ పాణిగ్ర,
హణ మహాత్మ్యాహాస♦మంచితుండు.
రావుకుల కలశాబ్ధి చం♦ద్రమసుఁ డనఁగ
నెసఁగు ప్రద్యుమ్న కృష్ణ♦మహీపతి సూర్య
రాయ భూపాలవరుఁ డస్మ♦దీయ కృతి కు
మారి, సుకుమారి నేలుత ♦ గౌరవాన.



కృతిభర్త

శ్రీ రాజా రావు ప్రద్యుమ్న కృష్ణ మహీపతి సూర్యారావు

బహద్దూరువారు, కోలంక జమీందారులు.

# ఇందలి పాత్రలు

—: పురుషులు :—

నరసన్నభట్టు—ఒక వృద్ధ బ్రాహ్మణుఁడు.

కృష్ణసూరి-<br>సోమేశము- } నరసన్నభట్టు కొడుకులు.

కృష్ణయ్య—నరసన్నగారి మఱఁది.

అనువోతుఁడు—కథానాయకుఁడు.

సింగమనీఁడు-<br>యాచమనీఁడు-<br>వెన్నమనీఁడు- } రావువంశ నాయకులు.

మాధవవర్మ—ఒక క్షత్రియప్రభువు.

జగన్నాథరాజు-<br>నరసింహరాజు- } మాధవవర్మ యొద్దియోధులు.

నారాయణశాస్త్రి-<br>పుల్లయ్యశాస్త్రి- } నరసన్న శిష్యులు.

వేదాంతము వెంకన్న-<br>దీక్షితులు-<br>అన్నప్ప సోమయాజి-<br>పొట్టి రామన్న-<br>సూరయ్య-<br>వెంక వెంకప్పగారు-<br>రామకవి- } బహిష్కరణ సభాసభ్యులు.

చాకలి పుల్లిగాఁడు——నరసన్నగారి చాకలి.

కేచిగాఁడు——పొలము పాలికాఁపు.

ఇతర సభ్యులు, భటులు మున్నగువారు.

—: స్త్రీ లు :—

శీలవతి——కథానాయిక.

సీతాదేవి——అనువ్రోతుని రాణి.

లచ్చమ్మ——నరసన్న భార్య.



# మహాకవీశ్వ రాభిప్రాయము.

శ్రీమత్పర దేవతా యైనమః

శీలవతి యనెడి యీ చరిత్రబోధకమగు నాటకము బ్ర॥ శ్రీ॥ వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావుగారిచే రచింపఁబడినది. ఇందు సాధ్యమైనంతవఱకు యథార్థమైన విషయములనే కైకొని, అక్కడక్కడ—

" అన్యథావా ప్రకల్పయేత్ "

అను లాక్షణికుల యభ్యనుజ్ఞ ననుసరించి యబాధకమైన కొన్ని మార్పులు చేయఁబడినవి. అవి ప్రస్తుతకాలమున కుపకరించునవిగా నున్నవి. అందొకటి " సరసన్నభట్టుగారిని బహిష్కరించుట " తక్కిన కవితాదులయెడల నే విధమైన లోపమును లేక పండితకవుల యాదరమునకుఁ బాత్రముగా నున్న యది. గ్రంథకర్తగారు కేవల మాంధ్రభాషయందు మాత్రమే కాక, ఆంగ్లభాషయందుఁ గూడ యఫ్. యే. చదివియుంటచే అందలి యౌచిత్యాదులను గూడ నిందుఁ దిలకింపనయ్యెడిని. వేయేల ? సర్వవిధముల నిది సమ్మానింపఁ దగినదని నా ముఖ్యాభిప్రాయము.

కళాపరిపూర్ణ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.
శ తా వ ధా ని.

ఓమ్.

# పీఠిక.

---

పాఠక మహాశయులారా!

శ్రీ పీఠికాపుర మహారాజులగు శ్రీ గంగాధర రామా రాయ ప్రభుచంద్రుల (ప్రస్తుతపు మహారాజావారి జనకుల) యొద్దఁ గార్యదర్శియై వన్నెగాంచిన నా తండ్రిగారగు శ్రీ లక్ష్మణమూర్తిగా రంగ్లభాషలో రచించిన "The History of the Rao Family and Vinjamuri Family" యను గ్రంథమునుండియు, నా మామగారును బూర్వ ప్రస్తుత మహారాజుల యాస్థానకవీంద్రులై కీర్తిశేషులైన శ్రీ దేవులపల్లి తమ్మన్నశాస్త్రిగారు రచించిన యాంధ్ర ప్రబంధరాజమగు "రావువంశ ముక్తావళి" యను పుస్తకమునుండియు, నిన్నాట కేతివృత్తము గ్రహింపఁబడినది. ఈ నాటకములోఁ బేర్కొనఁబడిన స్థలములు, పాత్రలును, జాలవఱకుఁ జారిత్ర ప్రసిద్ధములు. నాట్యరంగానుకూల్యమునకై కొన్నికొన్ని కల్పిత నామములును జేర్పఁబడినవి. ఇందలి కథానాయకుఁడు "శ్రీ యనుమోత భూపతి" పిఠాపురము, వేంకటగిరి, బొబ్బిలి, జటప్రోలు, మైలవరము మున్నగు సంస్థానాధీశ్వరులకు మూల పురుషుఁడని కథవలనఁ జదువరులు గ్రహించియుందురు.

మఱియు నిందలి కథాంశములు, రాజపుత్రస్థానము, మహా రాష్ట్రము, దక్షిణ హిందూస్థానము, మున్నగు ప్రదేశములఁ బ్రసిద్ధికెక్కిన రాజకుటుంబములలో విఖ్యాతిగాంచిన వీర పురుషుల, వీరవనితల చరిత్రముల వంటివే యనియుఁ దెలిసి కొని యుందురు.

తననాథుఁడును, ప్రభువునగు సింగమభూపాలు నాజ్ఞపైఁ గథానాయికయగు "శీలవతి", తోడి యంతఃపురకాంతలతో "జోహారు" సల్పి చిచ్చుఱుకక, మహాధీరచిత్తముతోఁ బగఁ దీర్చుకొనుదాఁకఁ బ్రాణములు నిలుపుకొనియుంట రసపుత్ర వీరవనితలఁ దలఁపునకుఁ దేకమానదు. రావుకుల నాయకు లెల్లరును దాము చచ్చుటయో యరులం జంపుటయో గాని వెఱతలంపులేక తమ ప్రాణములఁ దృణీకరించి యుద్ధరంగమున కుఱికి శత్రుఘాటికాహుతు లగుటయు రాజపుత్రవీరులను జ్ఞప్తికిఁ దేకపోదు. వేదవేదాంగవేత్తయై, మహావిద్వాంసుఁడై, హిందూమత సంత్సంప్రదాయపరుఁ డగు వింజమూరి నరసన్న భట్టారకుఁ డితర శ్రోత్రియ పండితోత్తములవలె సంకుచిత భావపరుఁడు గాక, మూఢ మతాచారములకుఁ గట్టువడక, మానవస్వభావ జనితమగు దయాశౌచాదుల వహించి, శీల వతిని దన కూఁతుకన్నను మిన్నగఁ జూచుట యాదికవియగు వాల్మీకిని దలఁపునకుఁ దేకమానఁడు. హిందూమత గ్రంథముల

సారమంతయు గ్రహించిన వాఁడు గావుననే నరసన్నభట్టంతటి సంఘసంస్కర్తయైనాఁడు. జాతిభేదమును రూపుమాపవలెనని నేఁడు ఘనులుచేయు ప్రయత్నమునకు నాఁడు కృష్ణయ్యా నరసన్నల వంటివారి పునీతభావములే యాధారములు.

ఈ నాటకములోఁ జారిత్రిక సాంఘికాంశములు నాకు సాధ్యమైనంతవఱకు జాగ్రత్తగాఁ గూర్చి రచియించితిని. కృష్ణయ్యా మాలపిల్లలచేతఁ బాడించినపాటలు మా మఱఁది చిరంజీవి దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి రచియించినవి. శ్రీ పిఠాపురము మహారాజావారి సమక్షమున నే నీనాటకముం జదివి వెలమవారి సంప్రదాయములలోఁ గల లోపములను సవరించికొంటిని. కథ వింజమూరి వారికిని రావువారికిని జిర కాలమునుండి యున్న సంబంధమును దెలుపునది.

కృతికర్తనగు నేను వింజమూరి వంశజును. నా కృతికి భర్తగా రావుకుల శ్రేష్ఠుఁడు దొరకునా యని పరితపించు చుండ నా యదృష్టముచే శ్రీ కోలంక సంస్థానాధిపతులును, శ్రీ వేంకటగిరి మహారాజుల సోదరులు నగు శ్రీ రాజా రావు యాచేంద్రకృష్ణ మహిపతి సూర్యరాయప్రభు ప్రకాండులు, నాకు లభించిరి. వారి కీకృతికన్య నర్పించి ధన్యుఁడ నగు చున్నాను. ఈకృతి మా యుభయవంశములకుఁ దారకమని యెంచుచున్నాను. నా కృతియుఁ గృతిభర్తయు దీర్ఘాయు

రైశ్వర్య ముఖ్యభాగ్యములచే నొప్పఁ గాక యని పరమేశ్వ రునిఁ బ్రార్థించుచుందును. అజ్ఞానముచేఁ గాని, ప్రమాదముచే నిందుఁ బడిన దోషములను సైరింపఁ బాఠకమహాశయులను గోరుచున్నాను. ఆ దోషములను నాకుఁ దెలుపుదురేని రాఁ గల ముద్రణములో సవరించుకొందును.

కాకినాడ,
1-1-39.

కృతికర్త.
విం. వేం. ల. నరసింహరావు.



# నాంది.



శా. ఓంకారాక్షర దివ్యరూపుఁడు, కళా♦వ్యూహాధినాథుండు, పు
ణ్యాంకూరప్రతతిప్రవృద్ధిరచనా ♦ ప్రావృడ్ఘనుం, డుగ్రదై
త్యాంకారిందముఁ, డాశ్రితావనలస♦ద్వ్యాపారదక్షుండు, శ్రీ
శాంకర్యాత్మజుఁ డాగణేశుఁడు సద♦స్యశ్రేణిఁ గాపాడుతన్.

శా. శ్రీలీలాప్రతిభాక్షమాప్రణయ గ♦ర్వీభూతచేతస్కలా
శ్రీలాసీలలమువ్వురన్ వగలుగాఁ ♦ జేపట్టి, వక్షోభుజాం
కాలంకారపదమ్మొసంగి శ్రితర♦క్షావాప్తి నూహించు గో
పాలుం డాశ్రిత కల్పభూరుహము స♦భ్యశ్రేణిఁ గాపాడుతన్.

శా. రేరే ! చర్వితచర్వణం బగు ధరి♦త్రీజన్ములై, సద్యశ
శ్శ్రీరాజ్యాధిపులై, నృసింహులయి, ల♦క్ష్మీపుత్రులై, సత్కళా
సూరిప్రస్తుతులై, సుశీలవతులౌ♦ శుద్ధాంగనల్ గొల్వ ధా
త్రీరంగస్థితపాత్రలౌ జనుల గౌ♦రీశంకరుం డోముతన్.

(నాంద్యంతంబున సూత్రధారుఁడు ప్రవేశించి
సుమనసాంజలి నర్పించి)

సూత్ర—మారిషా !

మారి—ఏమి, బావా ?

సూత్రి—ఏమోయి, నీకెప్పుడును బనిలేదు, తీఱిక లేదన్నట్టు లుందువు ?

మారి—నాకా పనిలేదు ? పనిలేని జీవులెందేని నుందురా ? అకర్మలోఁ గర్మగలదను గీతావాక్యమును భావింపుము.

సూత్రి—బాగు, బాగు ! పనిలేకపోవుట యొకపనియే యన్న మాట, నీవు చెప్పకయే నేను నీవలన మున్నుగ్రహించితిని. కాని నీగీతనుబట్టి కర్మలోఁ గూడ నకర్మయున్న దేమో బాగుగాఁ బరిశోధించితివా ?

మారి—బావా ! గీతలలోఁ బాండిత్యము నీ కఖండముగఁ గుదిరినట్లున్నదే! గీతారహస్యము లేవేని నాకెఱింగింప నెంచి నన్నురావించితివా ?

సూత్రి—కేవలము గీతారహస్యమే గాదు. సాహిత్యసమ్మేళ సంగీతరహస్యమును నీకెఱింగించి యొకరూపక మాడింపఁ దలఁచితిని.

మారి—నే నాడువాఁడనుగానే.

సూత్రి—అవసరమై మనసుకుదురుచో, నాడువాఁడవేగాదు, పాడువాఁడవు గూడ నీవగుదువను ధైర్యము నాకులేక పోలేదు.

మారి—నీభణోక్తుల కేమిగాని, బావా, ప్రకృతవిషయము నెఱిఁగింపుము.

సూత్ర—ఒకనాటకప్రదర్శనమునకై తగునేర్పాటులను గావించుచు శ్రాంతిగొంటచే విశ్రాంతినాసించి మఱిదివగు నీతోఁ గొంతతడవు ఛలోక్తు లాడితిని.

మారి—సరే. కాని, నాటకమంటివి. ఏనాటకము ?

సూత్ర—శీలవతి యనురూపకము.

మారి—కల్పితకథారూపకమా ?

సూత్ర—కాదు, కాదు, చారిత్రాత్మకము.

మారి—ఈచరిత్రాంశ మెందున్నది ?

సూత్ర—ఎందా? వినుము.

సీ. భారతీపాదపూ♦జారత్నపీఠికా
రాజసంకాశ స♦ద్ద్విజకులము
చింతామణీ దివ్య♦సంతానసురభిసం
తానదానగుణ ప్ర♦ధానకులము
పరమభాగవత స♦త్పురుషపుంగవజాత
పూతచిరంతన ♦ ఖ్యాతకులము
గాంగేయ విజయ వి♦క్రమకళాసముపేత
శూరాలవాల వి♦శుద్ధకులము

గీ. మల్లికాచంద్రహీరోప ♦ మాన కీర్తి
చంద్రికాసాంద్ర లలితావ♦నీంద్రకులము
ఆంధ్రమాతృరచిత సుకృ♦తైకఫలము
ప్రథితరాట్సూరి రాజిత ♦ రావుకులము.

ఏతత్కులచరిత్రలోనిది యీశీలవతికథ. రావువంశచరిత్ర రావు వంశముక్తావళియనుపేరిట సంస్కృతమున బ్రహ్మశ్రీ దేవుల పల్లి సుబ్బరాయశాస్త్రులవారును, నాంధ్రమున వారిసోదరు లగు వేంకటకృష్ణశాస్త్రులవారును, నిదివఱకే ప్రబంధరూప మున రచియించియుండిరి. ఆ కృతులనందుకొను నప్పుడేగదా, శ్రీరావు గంగాధరరామరాయప్రభువు దిగ్గజములవంటి పండిత ప్రకాండులచే నలంకరింపఁబడియున్న పేరోలగంబున శ్రీసుబ్బ రాయశాస్త్రులవారిని స్వీయసింహాసనాధిష్ఠులంగావించి వింజా మరలతోఁ గవిరాజునకు విసరిరి ! ఆసుబ్బరాయశాస్త్రులవారు కూడ దీనిని నాటకరూపమునఁ గొంతవఱకు రచించిరఁట.

మారి—ప్రకృతమునఁ బీఠికాపుర మేలు మహారాజుల కులమా, యీశీలవతిది ?

సూత్ర—ఒక్కపీఠికాపుర మేలువారి కులమేగాదు. బొబ్బిలి, వేంకటగిరి, మైలవరము, జటప్రోలు మున్నగు మహిత పద్మ నాయక సంస్థానాధీశ్వరుల కులమును నగును.

మారి—అట్లగుచో శీలవతిచరిత్ర తత్సంస్థానాధీశ్వరుల చరిత్ర ములకు మూలాధారమైనదా ?

సూత్ర—అవును. బాగుగా గ్రహించితివి. మందదొరకుచో, మనుజునేమిగ్రింగు కొండచిలువవంటి యఖండబుద్ధిమంతుం డవు. ఇంక నీకుఁ జెప్పవలసినది లేదు.

మారి—సరే. చరిత్రాంశమేదియు నీవింకఁ జెప్పవలసిన యవసరములేదు గాని, యేతన్నాటకకర్త యెవ్వఁడో కొంచెము నొడివెదవా ?

సూత్ర—నీకు నాటకవిషయము ప్రధానమా ? తద్రచయితృ ప్రసంగము ప్రధానమా ?

మారి—రెండును బ్రధానములే. ఏలయన, నేఁడు వానకాలపుఁ గుక్కగొడుగులవలెఁ గవులు లెక్కకు మిక్కిలిగా నున్నారు. నటకులంతకన్నను మిక్కుటముగా నున్నారు. ప్రసిద్ధకవిరచనము కానిచోఁ బ్రేక్షకులకు వృథాప్రయాసము గల్గించినవారమే యగుదుము. కావున, నాటకకర్తం గూర్చి యించుక మున్నెఱుంగుట ముఖ్యము.

సూత్ర—నిజమే. ప్రస్తుతకవి ప్రస్తుతకవియే. సందియము లేదు.

మారి—ఆయనపేరేమి ?

సూత్ర—నరసింహారాయకవి.

మారి—ఓహో ! పానుగంటి నరసింహారాయకవిగారా ?

సూత్ర—పానుగంటివారని నీకెట్లు తోఁచినది ?

మారి—ఎట్లనా ? వారు పీఠికాపురీశ్వరుల యాస్థానకవులగుటచేతను, సుప్రసిద్ధకవులగుటచేతను, నితివృత్తము రావుకులచరిత్రలోనిదగుటచేతను, వారేయనుకొంటిని. నా యూహతప్పా ?

సూత్రి—కొంచెములోఁ దప్పినది. నీయంచన చాలవఱకు సరి పడినది. కాని యాతఁడుగాఁ డీకృతికర్త. ఎవరందువా ?

సీ. ఏకేశ్వరోపాస ♦ నైకాగ్రచిత్తప్ర
వృత్తజీవాకవి ♦ ద్వితతినొకఁడు
యువక హృద్వ్యాకృత ♦ వ్యవసాయ ఫలగుణో
త్కరరచనా దేశి ♦ కతతినొకఁడు
వినుతాశుబంధక♦విత్వసముద్యోగ
చాతురీధౌరేయ ♦ సమితినొకఁడు
ప్రకటాంధ్రనాటక ♦ రంగాంబరస్థిత
నటకనక్షత్ర గ♦ణమున నొకఁడు

గీ. సర్వమానవ సౌభ్రాత్ర ♦ సద్గుణుండు
మృదుతర శిరీషసుమసమ ♦ హృదయయుతుఁడు
వింజమూరి కులాంభోధి ♦ విమల విధుఁడు
వేంకటనృసింహరాయక ♦ విప్రభుండు.

మారి—ఓహో! ఆంధ్రవిశ్వవిద్యాలయమువారున్నత పట్టభద్ర పరీక్షలకుఁ బఠనీయగ్రంథముగా నియమించి గౌరవించిన యల్లయనార్కలీనాటకము రచించిన కవితల్లజుఁ డీతఁడు. నే నెఱుఁగుదును.

సూత్ర—నీవేకాదు. సకలాంధ్రులలో నీతని నెఱుఁగని వా రుండరు. ఈతఁడు బహుగ్రంథరచయిత. వానింగూర్చి ముచ్చటింప సమకట్టినఁ బ్రకృతకార్యారంభమునకు విలం బన మగును.

మారి—అట్లయినచో నేతద్రూపక ప్రథమరంగప్రదర్శనము నకు భూమికల నాయిత్తపఱుచుటకుఁ బోవుమందువా ?

(పోఁబోవును.)

సూత్ర—ఆఁగుమాఁగుము. ప్రదర్శనప్రారంభమునకుఁ బూర్వము నాటకరసానుగుణముగ ఋతువర్ణనము సేయుట ప్రాచీనాచారము.

మారి—బావా ! ఋతుప్రసక్తి మనకేల ? ఆపనినటిది కాదా?

సూత్ర—అవును. అవసరమగుచో నాడువాఁడవు, పాడువాఁడవు, నీవే యగుదునంటివిఁగదా ? నటి యిందులేదుగావున, నీవే ఋతువర్ణనముగావించి నటియింపుము. ఆలసింపకుము.

మారి—పోనిమ్ము. నీవు మాయక్కతోఁ బాటు నాభారము కూడ భరించు బావవు గావున, నీకోర్కెఁదీర్తును వినుమ్ము.

సీ. తళుకుఁ జందురుమోము ♦ కలువకన్నుంగవ
మవ్వంపువెన్నెల ♦ నవ్వుతోడ
చిలుక గోర్వంక వె♦న్నెల పుల్గుపల్కుతోఁ
దెలినీటి సెలయేటి ♦ కులుకుతోడ
రాయంచనడలతో ♦ రాణించు మించుల
మించు టెక్కసరాల♦సంచుతోడ
తేజారు తెలితెల్లు ♦ పూఁజీరతో వెల్ల
మొయిలు వలువమేలి ♦ ముసుఁగుతోడ

గీ. పంకవిరహిత జీవన భాసగీతి
కలను గవులనఁ దచ్ఛరత్కాలవిజయ
లక్ష్మి నవనవశోభావిలాసగతుల
నలర వర్ణింపనలవియే నలువకైన ?

సూత్రి — బలే ! ముద్దుమఱఁదీ ! నీవాటచేఁ బాటచే నటిలేని లోటు దీర్చితివి. కన్నులకఱవు దీఱినది. చెవులపండువైనది,

( తెరలో మాధవవర్మ జగన్నాథునితో, " శ్రీగిరిజామనోహార " అనుపద్యముం జదువును.)

సూత్రి — (శ్రుతినభినయించి)

మ. అదిగో ! మాధవవర్మ దిగ్విజయగర్వాయత్తచిత్తైకసం
పదచే మిన్నునుమన్ను గానక మహాప్రాగల్భ్యముంజూపి తా
వదరం జొచ్చెడు వింటివే? తలఁపదావ్యగ్రతైన రాఁబోవునా
పదలన్ గర్వము పాతహేతువనున వ్వాక్యంబుసార్థంబుగాన్

ఇఁక నిష్క్రమింతము రమ్మి.

ఇది ప్రస్తావన.

(నిష్క్రమింతురు )

శ్రీ అనంతపంతుల రామలింగస్వామి విరచితము.



# శీలవతి.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

రంగము:—స్కంధావారములోని శిబిరము.

ప్రవేశము:—పూసపాటి మాధవవర్మ యుచితాసనాసీనుఁడై చెంత జగన్నాథరాజను వీరుఁడు నిలిచియుండును.

మాధ—జగన్నాథా!

ఉ. శ్రీగిరిజామనోహర వి♦శేషకృపాగరిమంబుచేతనే
యీఁగె సమస్తవైరి జన♦బృందము, డెందమునం దమంద మో
దాగమమయ్యె, జన్మము కృ♦తార్థతఁ గాంచెను, దిక్కటాహముల్
మ్రోఁగె మదీయ దిగ్విజయ♦పూరిత శంఖముఖస్వనంబులన్.

శ్రీకాలభైరవస్వామికరుణచే, నిన్నాళ్లకుఁగదా నామది కించుక యూరట గల్గుచున్నది?

జగ—మహాప్రభూ! నిజమే. రేపటిసాయంకాలమున కేలికలకు మఱియు మనశ్శాంతిగలుగును. రేపు రావువారు

బాపుటాలెత్తిపోవుటయో, లేక ప్రాణవాయువు లర్పించుటయో, జరిగింతురు.

మాధ—బాపుటా లెత్తిపోవుటకు వారిలో నొక్కనినైనను మనము మిగులనిచ్చినప్పుడుగదా? ఇంకను బ్రధాన పూరుషులు మిగిలియున్నారు. రేపు వారింగూడ భైరవస్వామికి బలియిత్తును. అన్నట్లు మఱచితిని. భైరవపూజకు వలయు పూజాద్రవ్యముల సమకూర్పుమని నాయాజ్ఞగా సేవకునితోఁ జెప్పుము.

జగ—చిత్తము (నిష్క్రమించును)

మాధ—(తనలో) భైరవస్వామి! ఇన్నాళ్లకుఁగదా నాచిరకాలశత్రువుపై నాకుఁ బరిపూర్ణజయముం గల్గించితివి! ఇప్పటికైన నీభక్తుని మొరాలకించినందున కానందమయ్యె.

(జగన్నాథుఁడు మరలఁ బ్రవేశించును.)

జగ—మహారాజా! ఒక్కబుడుబుడుక్కలవాఁడు దేవరదర్శనముకొఱకు హాజారమున వేచియున్నాఁడు. వానికిఁ దమదర్శన మగత్యమఁట. తెల్లవాఱినఁగాని తమదర్శనము లభింపదనిచెప్పి భటులెంతగా వారించినను, వాఁడు పోవక నిలిచియున్నాఁడు. ఏమియాజ్ఞ?

మాధ—బుడుబుడుక్కలవాఁడా! (ఇంచుక యోజించి, చిఱునవ్వుతో) వాఁడెవ్వఁడో యనుకొంటిమే! మనవేగుల

వాఁడగు నరసింహరాజై యుండును. వాఁడే పలువేసముల ధరించి ప్రజలను మోసపుచ్చుచుండును.

జగ—ప్రభూ! వేషమేకాదు. మాటయు, నడకయు నరసింహునివి కావు. అచ్చముగా బుడుబుడుక్కలవాఁడే.

మాధ—(నవ్వుచు) వాఁడటులే యెల్లరను భ్రమగొల్పుచుండును. ఒకసారి పాములవాని వేషముతో నతఁడు భార్యనే కన్గొనఁగినాఁడు. సందియములేదతఁడే. లోనికిఁబంపుము.

జగ—చిత్తము. (పోవును. బుడుబుడుక్కలవాని వేషమున నరసింహరాజు ప్రవేశించును.)

నర—(డుబుడక్క వాయించుచు) అంబా! పలుకవే! జగదంబా! పలుకవే! కంచికామాక్షీ, మధురమీనాక్షీ, కాశీవిశాలాక్షీ! అంబా! పలుకవే! మాధవవర్మ మహారాజులకు జయము, జయము! ఏలినవారి కంబతోడై యున్నది. తమపట్టు బంగారమై తమమాట మాణిక్యమై వెలయు దినములు వచ్చినవి.

మాధ—నరసింహా! నీ వేషభాషలు మమ్మే మోసపుచ్చునప్పుడు శత్రువులను మోసపుచ్చలేకుండునా? ఇఁక నీకపటచర్య మాని మనవిరోధిసేనలో నీవు తెలిసికొనిన వింతలం దెలుపుము.

నర—శత్రుసైన్యప్రవాహ మెుకిపోయినది. ఇప్పు డొక్క వేయికి మించియుండదు. రావువంశనాయకులు మిగుల

నిరుత్సాహపడియున్నారు, వారి మొగములు వెలవెలపోయి ప్రేతకళ వెలిగ్రక్కుచున్నవి. అట్లున్నను, వారోటమి నంగీకరించి మనల శరణుజొచ్చువారు మాత్రముకారు. కుట్టుసురులున్నను బోరుచునే వారుండ నిశ్చయించుకొన్నారు.

మాధ—సరియే. వా రాకుట్టుసురులం గూడఁ గోల్పోవుదురు గాక. నరసింహా!

ఉ. ఎన్నఁడు పద్మనాయకకు♦లేందిరభర్తృవిహీనయౌను, నిం
కెన్నఁడు రావువంశనది♦యింకి యెడారిగ మాఱిపోవు, నే
నెన్నఁడు కన్నులార నిదు♦రింతు, నిఁకెన్నఁడిఁకెన్నఁడంచునా
పన్నుఁడనై యుమేశుఁగొలు♦వన్ గృతకృత్యుఁడనైతి నేఁటికిన్

మ. కరిసేనాగిరివర్గ పక్షతతులన్ ♦ ఖండించియున్నాము, భీ
కరకాంభోజచమూసమూహవనమున్♦గాల్చాగ్నిపాల్సేసినా
మరిసైన్యాంబుధు లింకఁజేసితిమి, దు♦ర్దాంతప్రతాపుల్ సహా
వరమూర్తిత్రితయంబిఁకన్నిఁగులుటన్♦దాపంబు శేపించెడున్.

నర—ప్రభూ! లేపదియు నిశ్శేషమగును. కాని యామూర్తిత్రయమును జంపుట యలఁతిపనిగాదు. ధర్మయుద్ధంబున వారిం దెగటార్పఁ జూతురేని, తమకోర్కె యెన్నఁటికిని నెఱవేఱదు. కపటప్రక్రియ యేదో యొకటి యాలోచింప వలయును.

మాధ—విరోధినిరాసనం బొనరించుపట్ల ఋజుమార్గము దొరకకున్న, వక్రమార్గమే పట్టవలయునని నీతిశాస్త్రము చెప్పుచున్నది. ప్రధానసేనానితో యోజించి వారింజంపు నుపాయ మన్వేషింతముగాక.

నర—ఎటులో వారింగడతేర్తురన్నను, వారియాండ్రు బిడ్డలతో మిగిలియుందురుగదా? వారియునికియు మనకుఁ బ్రతికూలమే యగును.

మాధ—వారిని గూడ మనకరవాలాగ్ని కాహుతి గావింతమా, లేక, పట్టి బంధింతమా?

నర—బిడ్డలలో మగవాండ్ర నుంపరాదు. స్త్రీలనందఱను బంధించినఁ జాలునని నాయూహ. నేఁడు మనకుఁ దోడ్పడుటకై క్రొత్తగావచ్చిన కమ్మరెడ్డిదళములను మనవాహినులకుఁ దోడిచ్చి భువనగిరి కీరేయినే పంపుటమేలని నాకుఁ దోఁచుచున్నది.

మాధ—బాగు. అటులనే యొనరింతము. నీవే యిప్పుడు సర్వసేనాపతికడకుఁ బోయి, యెట్టి యలజడియుఁ దెలియకుండ, మనసేనలోఁ గొంతభాగమును నీవుచెప్పిన కమ్మరెడ్డిసేనలకుఁ దోడిచ్చి భువనగిరికిఁ బంపుమనియు, వారు దుర్గస్త్రీలనెల్లఁ బాతివ్రత్యభంగముకాకుండ బంధించికొనిరావలసిన దనియు, మగబిడ్డలను దొట్టెలలో నున్నవారలనైన నదయత ఖండింపవలసినదనియు, నాయాజ్ఞగాఁ దెల్పుము. ఆకార్యము

కూడ ముగిసినంతనే నేను గుండియపైఁ జెయివైచుకొని నిద్రింతు ననుము.

(ప్రవేశము:—దౌవారికుఁడు)

దేవా.—రావువంశసముద్భవ శుష్కకానన దావదహన! మాధవవర్మ మహారాజా! జయము, జయము. ఏలినవారి పూజకు సర్వసంభారములు సంసిద్ధపఱుపఁబడినవి. విజయం చేయఁ బ్రార్థించుచున్నాను.

మాధ—సరే. వచ్చుచున్నాము. పొమ్ము. (నరసింహరాజ దౌవారికులేఁగుదురు.) (తనలో) దుష్టా! సింగమనాయకా! సాటి హిందువుననియైన శంకింపక, యలనాఁడు తురకలతోఁ జేరి నన్నోడించి నాకుఁ దీఱరాని నష్టముం గూర్చితివిగా? ఆఫల మిప్పు డనుభవింపక పోవుదువా?

చ. కొడుకుల వంశవర్ధనులఁ ♦ గోల్పడి నాఁడు మదీయపత్ని లే
వడువున నేడ్చిరో మదిని♦భావనఁ జేసితె? కండ్లముందటన్
బుడుతలఁ బూఁపపిందెలటు ♦ ముక్కలుముక్కలుగా నొన
ర్పఁగా
నుడుకుచు నీదుకాంతలును♦నొత్తిలియేడ్వక మిన్నకుందురే?

(నిష్క్రమించును.)



## ద్వితీయరంగము.

రంగము—పెదవీడు సమీపమున స్కంధావారము నందలి శిబిరము.

ప్రవేశము:—సింగమనీఁడు, యాచమనీఁడు, వెన్నమనీఁడు, తివాసులపైఁ గూర్చుండి.

సింగ—తమ్ములారా! మన స్థితి నానాఁటికిఁ గృశించుచున్నది. నిన్నటిబలము నేఁడులేదు. నేఁటిబలము రేపుండదు. అన్యాయముగా మనపైఁ జలపట్టి కమ్మదొరలును, రెడ్డినాయకులును మనవిరోధికిఁ దోడ్పడుటచే మనవాహిని శుష్కించుచున్నది. ఇంకఁ గర్తవ్యమేదో నాకు స్ఫురింపకున్నది.

యాచ—అన్నా! కర్తవ్యమున కేమున్నది? కంఠమున జీవములుండు నందనుకఁ బోరుసల్పెదము. అంత వీరస్వర్గముం జూఱకొందము. అంతియే కాని, ప్రాణములకాసవడి కాంది శీకులము కాకుందుము గాక.

వెన్న—ఉసురుల కాసించి డాఁగుకొనుబుద్ధి మనయింటి కుక్కకైన లేనప్పుడు మనకాప్రసక్తియేల? శత్రువును నిర్జించు నుపాయమేదేని గలదేమో యింకను యోజింపుఁడు.

సింగ—యోజించుచునే యుంటిని. ఏమార్గముం గానరాకున్నది. తమ్ముఁడా! యాచ్రయ్యా! హతశేషులగు మన సైనికు లింక నెందఱుగలరు?

యాచ—సుమారొక వేయిమంది మాత్రమున్నారు.

సింగ—వారిలోఁ గడపటివఱకు సమరరంగమున నిలువనిశ్చయించుకొన్నవార లెందఱో తెలిసికొంటివా ?

యాచ—తెలిసికొన్నాను. అంద ఱొక్కదీక్షతో నున్నారు. అరిం జంపుటయో, తాముచచ్చుటయో: తుచ్ఛప్రాణములయం దాశగల్గువాఁ డొక్కఁడును వారిలోలేఁడు.

వెన్న—దైవమే మనపక్షముననున్న. మనకీ వేయిమంది వీరులును జాలరా ? వీరితోనే మనము సంపూర్ణజయము గాంచవచ్చును గదా ?

సింగ—నాయనా ! అదినిజమే. కాని దైవము మనపక్షమునఁ లేఁడాయె. మన మేయపచారముచేసితిమో, యతఁడు మనకుఁ బ్రతికూలుఁడై యున్నాఁడు. శత్రుసేన లెక్కకు మీఱియున్నది. ఉన్నసేనలకుఁ దోడుగాఁ గ్రొత్తసేనలు దినదినము వచ్చిపడుచున్నవి. మనకన్ననో, యట్టిభాగ్యము లేదాయె. మనమిత్రులగు యవనవీరులు నేఁటికిని రాకైరి. వారేచిక్కులలో నుండిరో ! "వివాహశ్చ, వివాదశ్చ, సమయోరేవశోభతే" యని పెద్దలు వచింతురు. మనకిప్పు డసమకక్ష తటస్థించినది. దానికిఁ దోడీశ్వరానుకూల్యమును లేకయుండెను. ఇట్టి విషమపరిస్థితులలో మనకు జయమెట్లు చేకూఱును ? రేపు కేవలసంకులసమరమున కే

మనము దిగవలసియుండును. అప్పు డెవ్వరము మిగులు దుమో, మఱి యెవ్వరము పగులుదుమో తెలియదు.

యాచ—అందఱమును బగులుదుమనియే తలఁపవలయు. సంఘ మరణము తప్పదనియే నిశ్చయించుకొని, మీఁది కార్యముం గూర్చి యాలోచింపవలయును.

(ప్రవేశ మాత్రముతో నొక వెలమవీరుఁడు)

వీరు—ప్రభువులారా! త్వరపడుఁడు. వైరిసేనలు గుంపులు గుంపులుగా నడవిదారులం బట్టి భువనగిరివైపు పోవు చున్నవి. వారిపోకడంగాంచి నేననుమానపడి, వారికిఁ దెలియ కుండ వారివెంబడిఁజని వారివృత్తింగనిపట్టి వచ్చితిని. వారు భువనగిరిదుర్గములో మనరాణివాసపు స్త్రీలున్నారని తెలిసి కొని, వారింబట్టి బంధించుట కేఁగుచున్నారు. వెంటనే మీరును సేనలతోఁ బయనముకండు. మానినీమానసంర క్షణము గావింపుఁడు. ఆలసింపకుఁడు.

సింగ—తమ్ములారా! వింటిరిగదా, విరోధికుయూహావిధంబు? ఇప్పుడేమి సేయుదుము?

యాచ—వీరాగ్రణీ! అరిసేనలసంఖ్య యెంతయుండును?

వీరు—మన యిప్పటిసేనకుఁ బదిపండ్రెండు రెట్లుండవచ్చును.

యాచ—అన్నయ్యా! అటులైన మనము వారితో సమరము నకు డీఁకొనుట వ్యర్థప్రయత్న మగును.

సింగ—వ్యర్థప్రయత్నమే కాక, మన యంతఃపురాంగనల నెల్ల వారికిం జేసేత నప్పగించినవారము నగుదుము.

వెన్న—మనయాండ్రు పరమపతివ్రతలు, అసూర్యంపశ్యలు. వారి కాదుష్టులచే నవమతి గలుగనీయఁ జనదు.

యాచ—ఏవ్రతముచేఁ దొల్లింటి సాధ్వులు తమపతులకన్న మున్న తామే స్వర్గధామముం జేరి వీరశయనమలంకరించి వచ్చిన వారి కెదురుగా నడతెంచిరో, యేవ్రతముచేఁ బశుబలముచేఁ దమ్ముఁ బరిభవింపసమకట్టిన నీచ విరోధివర్గములను విఫలీకృతమనోరథులను గావింపఁగలిగిరో, యేవ్రతముచేఁ దాము వినశ్వర దేహాలయ్యు శాశ్వతయశస్వినులై నెగడఁగల్గిరో, యట్టి 'జహర' వ్రతమె మనకాంతాజనము లెల్ల నవలంబింతురుగాక. రేపు మనము సలుపఁబోవు దీర్ఘప్రయాణమునకు వారే మనకు దారి చూపుదురుగాక.

తే. గీ. చైత్రయాత్రలో నలసి వి♦శ్రాంతి గొనఁగ
నేఁగుదెంచు ప్రాణపతుల ♦ కెదురువచ్చి
నిరతసౌఖ్యధామము, స్వర్గ♦పురముఁ జేర్చి
శాశ్వతానంద మిచ్చు స♦ప్రశస్తమతులు.

అట్టివారలు గావున, వారింగాపాడ నేనే పోయెదఁగాక. అన్నా! నాకు సెలవు దయచేయుము.

వెన్న—కటకటా! పూవులు, పిందెలు, కాయలు, పండ్లునుం గలిగి విరాజిల్లు మధుర ఫలవృక్షరాజంబుం బోలియుండు

మన రావుకులమున కెట్టి చేటువాటిల్లె! అన్నా! సర్వజ్ఞ సింగమభూపాలా! ఏ మాశ్చర్యము!

సీ. మొన్న మొన్న నె కదా ♦ భూరిదానములచే
నర్థికోటులఁ దన్పి ♦ యంపినావు.
మొన్న మొన్న నె కదా ♦ భూదేవవరులకు
నగ్రహారము లిచ్చి ♦ యశముఁ గంటి
మొన్న మొన్న నె కదా ♦ భూతేశలక్ష్మీశ
నిలయ ప్రతిష్ఠలఁ ♦ జలిపినావు
మొన్న మొన్న నె కదా ♦ పూజ్యులైన కవుల
నెందఱనో బహూక♦రించినావు

గీ. నీసపర్య లందిన యవ♦నీసురాళు
లిచ్చిన మహితాశీస్సులే ♦ యేటఁగలిసె
ఈసుచే సాధుజనులఁ గా♦రించువారి
పాపకృత్యంబులే మహో♦షలముఁగాంచె.

సింగ—తమ్ముఁడా! మనమేనాఁడో యన్యాయముగా నొక పూతవంశమును భ్రంశమొనరించియుందుము. దాన నిట్టి దుష్ఫలము మనకుఁ గలిగె. ఇప్పుడు మనకు దుఃఖించుట కైన నవకాశములేదు. యాచయ్యా! నీవే యచలభావము వహించి కొలఁదిపరివారముం దీసికొని, జవనాశ్వముల నెక్కి, యొకానొకని భువనగిరికిఁ బోయి, ధాత్రీసురులకు దానమొనరించుటకై మనము తెప్పించియున్న మంచి

గంధపుమ్రాఁకులనెల్ల మన యంతఃపురాగారములలో నొక దానం జేర్పించి, మేనల్లుని వివాహమునకై విలిచియుంచిన సుగంధద్రవ్యములెల్ల నందువైవఁజేసి. సర్వభక్షకుఁడుఁ బావకుఁడు నగు వీతిహోత్రునందుఁ బ్రతిష్ఠించి, మన కాంతాజనములనెల్ల మంగళాలంకారములం గైసేసికొని రండని నాయాజ్ఞగాఁ దెలిపి, వారిచే యథావిధి "జహార" వ్రతముం జేయింపుము. నీవు కంటఁ దడిపెట్టవలదుసుమా! ఇదియొక మహాయజ్ఞమని భావింపుము. ఒక్కవనితనైన మిగులనీయకుము.

మ. కలుగున్ రావుకులాబ్ధికుబ్బునతమున్ ♦ గల్గించుపుత్త్రుండుఁడ
గ్గల నానందమునొందు శీలవతికిన్ ♦ ధైర్యంబు వోనాడఁ గా
వలదంచున్, నిజనామసార్థకతయే ♦ పాటింపుమంచున్, మదా
జ్ఞలుగాఁ జెప్పి వ్రతంబు పూర్తిగఁ గొనల్ ♦ సాగింపయత్నింపుమా!

(వార్త దెచ్చిన వీరునివంకఁ దిరిగి) వీరాగ్రణీ! నీవును నా తమ్మునికిఁ దోడై పొమ్ము.

వీరు—చిత్తము. ఏలికల యాజ్ఞనెఱవేర్తును.

యాచ—అన్నయ్యా! నాకొక్క వరముఁ గృపసేయ మిమ్ముఁ బ్రార్థింతును.

సింగ—ఏదావరము? అడుగుము. నీవుకోరిన వర మేనాఁడేని నేను నిరాకరించితినా?

యాచ——ఇంతకు మున్ను నిరాకరింపలేదు. ఇప్పుడు నిరాకరింతు రేమో యన్న భయమున నిట్లర్థించుచుంటిని.

సింగ——ఇప్పుడును నిరాకరింపను. చెప్పు మదియేదో! నీయాశయము లెప్పుడును బరమపవిత్రములై సర్వజనసమ్మతములై యుండునుగదా?

యాచ——మావదినె, శీలవతీదేవి, యిప్పుడు నిండుచూలాలు గదా? ఆదేవిగర్భమున జనింపఁబోవు నర్భకుఁడు దీర్ఘాయుష్మంతుఁడై, చిరయశస్సముపేతుఁడై, నూత్నశకపురుషుఁడై మనఁగలఁడని యానాఁడు మనయింటి కతిథిగా వచ్చిన యోగిపుంగవుఁడు వచించెఁ గదా?

సింగ——'జహార' వ్రతమునుండి యామెను విడిచిపెట్టుమందువా యేమి?

యాచ——అవు నదియే నా కోరువరము.

సింగ——తమ్ముఁడా! ముఖప్రీతివాక్యములాడు దైవజ్ఞుల మాటలు నమ్మియా, మనము కార్యాచరణ మొనరించుట?

తే. గీ. అల పులోమజాకాంత గేహంబునందుఁ
బేరఁటం బందఁ బోయెదు ♦ విదితరావు
కుల జలజముఖులం దగ్రకువలయాక్షి
శీలవతియే యరుగకున్న ♦ సిగ్గుగాదె?

యాచ——అన్నా! గర్భిణులం జంపుట మహాపాపకార్యమని మీరెఱుంగుదురు గదా? అదిగాక, యామె జీవించి

యున్న మనవంశము నిలుచుననియు, నెప్పటికేని శత్రునిర్మూలన మగుననియు నాకు దృఢవిశ్వాసముగలదు. కావున వదినెను మిగుల్చుటకు నా కనుమతీయ వేఁడెదను. తెల్లవాఱకమునుపే యామెను గోట దాటించి యొకసురక్షిత స్థలమునకుఁ గొనిపోయి విడిచివచ్చుటకుఁ దగిన యేర్పాటు చేయుదుము.

వెన్న—అన్నా! ఆనాఁటి మునీంద్రుమాటలు తక్కుంగల జ్యోతిషులవచనముల వంటివిగావు. అవి యథార్థములు. చిన్నన్నయ్య కోరినకోర్కి సమంజసము మీసెలవైన యెడల, వదినెను నేనే యొకభద్రస్థలమునకుం గొంపోయి విడిచివచ్చెద. నా కనుజ్ఞయిండు. మన యంతఃపుర కాంతలు గూడ నామె జీవించియుండుట కనుమతింతురు. వంశాంకూరము నిలుపవలయుననియే వారికిని గోర్కియుండును గదా?

సింగ—తమ్ములారా! మీమాటలకు వ్యతిరేకముగా నేనే మియు వచింపఁజాలకున్నాను. కాని, శీలవతి నన్ను విడిచి మనఁగలదా?

యాచ—మనుట కష్టకార్యముల లోనిదే. కాని యామెకు మేము నచ్చఁజెప్పఁగలము. అరిసూదనకార్య మామెకును గర్తవ్యమే గదా? పుత్రునిం గనువఱకైన, నామె జీవించునట్టు లొప్పించెదము. ఆజ్ఞయిండు.

సింగ__సరే అటులనే కానిండు. శీలవతితో నెవ్వరిం బంపు దము ?

యాచ—ఆపనికి మన వెన్నమయే తగినవాఁడు. తమ్ముఁడా !

శా. సీతాకాంతకు సాటియావదినెకున్♦సేవల్ వొనర్పంగ నే
పూతస్థానమునందొ చేర్చి కరుణా♦పూర్ణుంఁడు, వల్మీకసం
జాతుండే యననొప్పు నొక్క-ద్విజభూ♦జాని ప్రసాదంబునం
దాతన్విన్నిలుపన్,సుమిత్రసుతుఁడీ♦వాదన్న!కొంపోవుమా!

నాయనా ! వెన్నమా ! నీవు వెన్నవంటి మనస్సుగలవాఁడవు. బేలవడియెదవు సుమీ !

వెన్న—(తలవంచి పొటపొట కన్నీరురాల్చుచు నిలుచును.)

సింగ—తమ్ముఁడా ! వెన్నమా ! నీవేసొమ్ము. ధైర్యకంచుకముఁ దాల్పుము. పోయి శీలవతితో నామాటలుగా నిట్లు పలుకుము.

సీ. ఎట్టివేళల నిన్ను ♦ నెడఁబాయ ననుపల్కు
దైవ నిర్మితిఁ జేసి ♦ తప్పవలసె.
భూమిపై వంశంపు ♦ మొలకను నిలిపినం
తనె తృప్తిపడి రాఘు♦ధవునికడకు.
మొలక వృక్షంబుగా ♦ వలయు, శాఖోపశా
ఖలయి యది ప్రవృద్ధిఁ ♦ గాంచవలయు.
పగవారి నెత్తురుల్ ♦ తగఁ దిలోదకములై
పరితుష్టి గలిగింప♦వలయు మాకు.

గీ. ఆశయములెల్లఁ దీఱెడు ♦ నంత దనుక
ధైర్యమును బూని తగినయ♦త్నములు సలుపుం.
అపుడుగాని యాత్మకు శాంతి ♦ యమరదనుచు
నెఱిఁగి వర్తింపుమీా, ప్రియా! ♦ యెల్లవేళ.

ఈ రాత్రితో మనకును మనయాండ్రకును ఋణము చెల్లినది. మనము సకుటుంబ బంధుపరివారముగా నమరావతీపురమునకు యాత్రసలుపువారమగుటచే నెందును గుందఁబనియ లేదు. కొంత కాలముదాఁక నాకుమాత్రము నాయర్ధాంగలక్ష్మిదర్శనము లభింపదు గావున, నా యాత్మ కించుక క్లేశముగలుగక పోదు. అది యెటులో నాధైర్యకవచములో మాటు పఱచికొనియెద. మీా రిరువురును గతిపయపరివారముతో నతిత్వరితగతిని భువనగిరికిఁబోయి మీా మీా ధర్మముల నెఱపి సూర్యోదయము కాకుండ మన శిబిరముం జేరుఁడు. అక్కడకు శత్రుసేనలు చేరునప్పటికిఁ గోట పీనుఁగుఁబెంటలై యుండునట్లు చేయుఁడు. నీచత్వమువహించి విరోధులు రాబందులై శవములను భక్షింపఁ దలఁచినను, నసువుపడకుండునట్లు చేయుఁడు. పొండు.

(యాచమ వెన్నమనీలు సోదరునకు నమస్కరించి దుఃఖముతో నిలిచియుందురు.)

సింగ—తమ్ములారా! ఇది వగపునకుఁ దావుకాదు. ధీరత్వము వహించి పొండు.

(వారు నిష్క్రమింతురు.)

(తనలో) కటకటా! ఇఁక నొకటి రెండుజాములలో రావుకుల లక్ష్మి యంతరింపనై యున్నది కదా! సిగులకాటపట్టగు భువనగిరిదుర్గము ప్రేతములకు నివాసభూమి యగును గాఁబోలు. ఆహా! లక్ష్మి! నీవెంతటి మోసకత్తియవు!

చ కలకలలాడు నెమ్మొగము ♦ కాంతులు చిమ్మగఁ నొక్క యిక్కలో
వెలసెదు, నుత్తరక్షణము♦వీడెదు దాని శ్మశానవాటికన్
జలుపుచు, నంతనొక్కొక నృ♦శంసు గృహంబుఁ జొరం గడంగుదే!
నిలుకడలేక యాచిటి గ♦ణింపక పోయెద వెట్టి నీతియో!

చ. నినుభజియించు వారికడ♦నిల్వవు, నీతలపేని లేక యెం
దును దురితంబులే సలుపు ♦ దుష్టులయిండ్లకు నిష్టబుద్ధితోఁ
జనెదవు, భక్తవత్సలుఁడు ♦ సాధుజనావన తత్పరుండు నౌ
దనుజవిరోధి భార్యవయి ♦ తత్పథగామిని కాకయుంటివే!

తే. గీ. చదువు లెన్నియో నేర్చిన ♦ చతురురాలు
విమల సంగీతవిద్యా వి♦వేకురాలు
అల సరస్వతీస్నుష కేని ♦ గలుగదయ్యె
నీదు ప్రాపు, మాబోంట్లకా ♦ నెక్కొనంగ?

(ఇంచుక యోజించి) నేనూరక సిరిందూఱినఁ బ్రయోజన మేమి? కర్మఫల బనుభవింపక తప్పదుగదా? మాధవవర్మ

కృష్ణపథుఁ డాత్మాజీర్ణరోగముం బోఁగొట్టుకొనుటకుఁగాఁబోలుఁ బరమపవిత్రరావువంశ ఖాండవాటవిని దగ్ధముగా నొనరించుచున్నాఁడు. కానిమ్ము. ఏనాఁటికేని దద్వనతరుషండములో నొక్కటేని మరల మొలకెత్తదా? అదియే విజృంభించి భయద గంభీర సింహఘోషము లొనరించు బహుళ చతురంగసేనా జీమూతవర్గములఁ దోడ్కొనివచ్చి తద్దాహము నార్పివైవదా? ఓరీ క్షత్రకులపాంసనా! మాధవవర్మహతకా! ఇల్లలుకఁగానే పండువు కాలేదురా!

తే. గీ. రావుకులజ కరీంద్రవ ♦ ర్గముల పాలి
సింహామనని యుప్పొంగకు; ♦ శీఘ్రముగ నె
భువనగిరి పరిసరభూమిఁ ♦ బుట్టు శరభ
పోతమే నిన్ను, నీవారిఁ ♦ బొలియఁజేయు

గీ. రావువంశ విజ్ఞాన స♦త్ప్రతిభ నపహ
రింపవచ్చిన సోమకుం ♦ డీవు, కూళ!
మత్స్యమూర్తియై పొడసూపి ♦ మత్సుతుండె
నిన్నుఁ గడతేర్చి తేజంబు ♦ నిలువఁబెట్టు.

(ప్రీతి నభినయించి) ఆ చక్రవాకపక్షుల కూజితంబులును సూర్యోదయకాల సామీప్యము నేకాక మా కపజయమ్మును సూచించుచున్నవి. ఇఁక జాగుచేయక కాల్యంబులఁదీర్చి కడపటిసారి పరమేశ్వరునకుఁ బ్రార్థనము లర్పింతుఁగాక. ఓరీ

సేవకా! నాకు స్నానాదులకు వలయు నీరాదికంబులను సిద్ధపఱుపుము. పెందలకడ సైనికుల మేల్కొల్పుటకు విషాణ మూఁదుము.

సేవ—చిత్తము. (కొమ్మూఁదును.)

(తెరపడును.)



## తృతీయరంగము.



రంగము:—వింజమూరను నగ్రహార ప్రాంతారణ్య సీమ.

ప్రవేశము:—శీలవతియు, వెన్నమనీఁడును.

వెన్న—అమ్మా! ఆ యెదుటఁ గనఁబడు నిండ్లగుం పొక గ్రామమైయుండును. (వినుట నభినయించి) దూరమునుండి యేవో వేదఘోషలుకూడ వినవచ్చుచున్నవి. అదియొక బ్రాహ్మణాగ్రహారమై కూడ నుండనోవు. నీ వక్కడకుఁ బోయి యెవరియుండనైనఁ జేరుకొనుము. తల్లీ! నిన్నిట్టి కష్టముల పాల్సేసి యొంటికత్తెనుగా విడిచిపోవు నీ కట్టేడికి సెలవిమ్ము. (డగ్గుత్తికతో) వదినే! మమ్మందఱను మఱచి పొమ్ము. పుట్టినప్పుడే దిక్కులేని దానవై యేకాకినివై యుంటివని తలంచికొనుము.

శీల—నాయనా! మఱిఁదీ! నాఁడు లక్ష్మణుఁడు సీతాదేవినిం బోలె, నేఁడు నీవు నన్నీసాంద్రారణ్యసీమల డించి పోయెదవా?

వెన్న—అవును తల్లీ! నిజముగా నీవు సీతామహాదేవితోఁ బోల్పఁ దగినదానవే!

శీల—ఇడుమలపట్ల నామెతోఁ సాటియగుదును గాని, మహిమాదులయందు నేనామె కాలిగోరికైనఁ బోల్పఁదగనిదాననే! నీవు సర్వవిధముల సౌమిత్రిసమానుండవు. నన్నీయటవీప్రదేశమున డించిరమ్మని నిన్నుఁబంచిన నీయన్నగారును రామచంద్రసన్నిభు లగుదురు. మీ రిరువురు శత్రునిర్మూలన మొనరించి దీర్ఘాయుష్మంతులరై మనెదరు గాక యని భగవంతునిఁ బ్రార్థించుచుందును.

వెన్న—తల్లీ! నీప్రార్థనాశీలము, నీపాతివ్రత్యమును, మమ్ముఁ గాపాడఁగలవని యింతదనుక నమ్మియుంటిమి. కాని యిప్పుడు దైవము మనకుఁ బ్రతికూలమై వర్తించుచుండ, మాకు విజయమెట్లు చేకూఱఁగలదు? ఇది మనవిరోధికి యోగకాలము, మనకు వినాశకాలము. అమ్మా! ఇఁకఁ బెక్కుమాటలకుఁ గూడ నాకుఁ గాలముచాలదు. నాకు మూదల నిమ్ము. పోయెద.

శీల—అటులైన, బాబూ, నీ వింక నరుగుము. నాప్రాణకాంతుని పాదపద్మముల కివే నాకడపటి నమస్కారములని మనవిచేయుము.

చ. దినకరు తోడ నెల్లెడ గ♦తించెడు ఛాయవలె న్నిరంతరం
బును హృదయేశ్వరు న్విడక ♦ మోదముతోడఁ జరించు
నేనె యీ
యనువున మొండికట్టెనయి♦యంతబలంగము వీడి ప్రాణధా
రణమున కిట్లువచ్చితి, మ♦అంది! మహోదురితాత్మనౌదుఁగా
(ఏడ్చును.)

వెన్న—అమ్మా! నీవిట్లు దుఃఖించుటవలన నేమిలాభము గలదు? నీవు జీవించి యుండవలయునని నీభర్త్రాజ్ఞయే కాక, నీతోడి కోడండ్రియు సమస్త బంధుబృందములయుఁ గోర్కిగదా? అదిగాక దైవజ్ఞులెందఱో నీగర్భజనితార్భకునివలన వంశకీర్తి విస్తరించునని చెప్పిరిగదా! ఇంచుఱకు, సమ్మతమగు కార్య మాచరింపక నీ వన్యథా యెట్లు చరింపఁగలవు? తల్లీ! వైళంబ చనుము. అదే తూర్పుతెల్లవాఱుచున్నది. నేనింక నాలస్యమొనర్పక రణరంగమున కేఁగవలయును. అన్నగా రేస్థితిలో నుందురో! (స్పంద మభినయించి) ఇదే నాయెడమకన్నదరుచున్నది. ఏదో కీడే జరుగనైయున్నది కాఁబోలు. కానీ, నా కిఁక సెలవిమ్ము.

శీల—హా! ప్రాణేశ్వరా! ఎంతటివాఁడ వెట్లయితివి!

ఉ. భీమపరాక్రమాఢ్యుఁడని ♦ పేరు గడించిన సత్త్వశాలి వీ
వే మగవాడి గోలుపడి♦హీన విరోధినృపాల బాలిశున్

దామసు నోర్వలేకునికి ♦ తార్క్ష్యుఁడు కాలముదప్పుటన్నిజ
స్థేమమువీడి యొక్కజల ♦ జిహ్మగఘాటికిఁ బాఱినట్లగున్
దుష్కాలము ప్రాప్తించినపుడు పులి పిల్లియగుట సాజమేకదా!
మఱఁదీ! నాప్రాణేశ్వరునితోఁ బ్రసంగించు భాగ్యమే నీకుఁ
గలుగునేని నావాక్కులుగా నిట్లనుము.

సీ. తమయాజ్ఞఁ దలఁదాల్చి ♦ తెమలక యీలీలఁ
బ్రాణముల్ ధరియించి ♦ బయటఁ బడితి
గర్భభారముకన్న ♦ దుర్భరంబగు మీ వి
యోగాగ్నికీలల ♦ నోర్చికొంటి
ఆఁడుబిడ్డలుఁ దోడి♦కోడండ్రుఁ జితినెక్కఁ
గనులారఁ జూచియుఁ ♦ గలఁగకుంటి
బోలెడు బలఁగంబు ♦ బుగ్గియైపోయినన్,
వంశాంకురాపేక్ష ♦ బ్రదికియుంటి
గీ. ఈశ్వరుఁడు మీపరమ పవి♦త్రేచ్ఛఁ దీర్చి
పుత్త్రు నిచ్చిన తోడనే ♦ పుడమి విడిచి
మేలికల పాదపూజకై ♦ యేఁగుదెంతు
శాశ్వత సుఖంబుఁ గాంతము ♦ స్వర్గమందు.

వెన్న—అమ్మా! అన్నగారిని జూచు నదృష్టమే నాకున్న
యెడలఁ దప్పక నీవు చెప్పిన మాటలన్నియు వచింతును.
నిన్ను మేము మరలఁ జూచు భాగ్యము తటస్థింపదు.
ఇవియే కడపటిచూపులు. తల్లీ! నీవు భర్తృవియోగ

భరంబునకుఁ గుర్రింగి దుఃఖమునకు లోనగుదువేని, మేము నీ స్నేసదుద్దేశముతో జీవింపఁగోరితిమో, యదియే చేడును జుమీ. నీవు సర్వకష్టములను గబళించి నీ కడుపులోనున్న నిసుంగుకొఱ కారోగ్యవంతురాలవై బ్రతుకకతీఱదు. నీవుకూడ లోటుగా నున్న, నాబిడ్డగతి యేమగునో యించుక యోచింపుము. నీకడుపునఁ గాచినకాయ ముదురు వఱకు నిన్ను జీవింపఁ జేయుఁగాకయనియు, నీసంతతివారు క్రిమ్మఱఁ బ్రాజ్యరాజ్యధురంధరులై యుండ నీవు గాంతువు గాక యనియు, నీశ్వరుని వేఁడుచు నేను సెలవుఁగైకొను చున్నాను. వదినే! నీవెట్టి సాహసమును జేయకుమా? భర్త్రాజ్ఞయు సోదరీమణుల యుపదేశమును బాటింపుమా! నీవు నిక్కముగా జానకీదేవివంటి దానవే. నిన్నుఁ బ్రాచే తన తుల్యుఁడగు నొక్కమహానుభావుఁడు తప్పక యాద రించును. నీవెట్టి వెఱపును బొందనక్కఱయే లేదు. నే నిఁకఁ బనివినియెద. (మరల రెం డడుగులు వైచును.)

శీల—అయ్యో! దైవమా! నే నిఁక సర్వవిధముల ననాథనే యగుదునా? (మూర్ఛిల్లును.)

వెన్న—(మరల డగ్గఱి) ఆహా! ఈమె మూర్ఛిల్లినదే! ఏమి సేయుదును? ఇఁకను నే నిచ్చట జాలముఁ జేయుదునేని, రణరంగమున నెట్టికీడు మూడునో! ఎప్పటికైనఁ దెంపు సేయక తీఱదుగదా? భగవంతుఁడా! నీవే యీయమను

గాపాడవేఁడుచున్నాను. పురాకృత కర్మఫలముచే మేమెల్ల రము సంఘమరణమొందు దుస్థితిం గనుచుంటిమి. ఈమె యైన సజీవయై యుండి వంశంపుమొలకం బ్రతిష్ఠింపఁ జేయుఁగాక యని నిన్నుఁ బ్రార్థించుచున్నాను. (వేద ఘోష వినఁబడ శ్రుతి నభినయించి) అదే, యెవ్వరో వేద పాఠకులీవంకకే వచ్చుచున్నారు. వారే యీమెకు సంర క్షకు లగుదురుగాక. (పడియున్న శీలవతి పాదములంటి మ్రొక్కి) అమ్మా! నేఁ బోయెద. నీకిఁకఁ బంచభూత ములే దిక్కు. వానికే నిన్నప్పగించి యేఁగుచున్నాను.

సీ. శమన గుణమున నీ♦సాటి దీసాధ్వి భూ
కాంత! కరుణ నీమెఁ ♦ గావు మమ్మ
అతి సుకుమార యీ♦యతివ ప్రభంజనా!
నీధాకఁ జూపక ♦ నెనరుఁ జూపు
వలిగాలి సోఁకిన ♦ నలయు లతాంగి వ
ర్షమ! కృప నీమె ర♦క్షణము సేయు
ఎండ కన్నెఱుఁగని ♦ యింతి భాస్వంతుఁడా!
దయఁబూని యీమె న♦రయఁ గదయ్య

గీ. భూతసంఘమ్మునకు ♦ ముత్యాల గొడుగ వౌ
నాకసంబ! యీమె ♦ నాదరించి
కష్టతతులనుండి ♦ కాపాడు చుండుమా!
ఏరు దిక్కులేరు, ♦ మీరె నుండి!

(నిష్క్రమించును)

(ప్రవేశము:— పింజమూరి నరసన్న భట్టు శిష్యులకు
ఉదయకాలమహిమలఁ జెప్పుచు)

నర—శిష్యులారా! తూర్పువంకఁ జూడుఁడు.

సీ. ప్రాగ్దిశాకాంత గ♦ర్భంబుఁ దాల్పఁగ మోము
కళ గాంచెననఁ దూర్పు ♦ తెలివి నొందు
గర్భభారక్లాంతి ♦ కలనఁ దద్భామిని
పలుపు నూర్పులనఁ దె♦మ్మెరలు వీఁచు
నిరతనిశ్వాస జ♦నిత బహు స్వేద బిం
దువులన మంచు బిం♦దువులు దోఁచు
ప్రసవ వేదన చేతఁ ♦ బడఁతి మూల్గెడు ననఁ
బక్షికూజితములు ♦ ప్రబలుచుండు

గీ. పద్మనాయక కులపరి♦పాలకుండు
చక్రరక్షణ దక్షుండు ♦ సకల లోక
బాంధవుం డింక నుదయించి ♦ భయదతమముఁ
బాపి, జ్ఞాన తేజమొసంగి ♦ ప్రజలఁ బ్రోచు.

శిష్య 1—ఆహా! గురువుగా రెంతచక్కఁగా సూర్యోదయ వర్ణనముఁ గావించిరి!

శిష్య 2—ఉపమలు, నుత్ప్రేక్షలు వారినుడులయం దప్రయత్నముగా వెడలుచుండు నీ వెఱుంగవా?

శిష్య 1—ఓయీ! అటు చూడుము. వారు వర్ణించిన తూర్పుదిక్కునసే యాచెట్టుక్రింద నెవ్వతెయో యొక కాంత పండియున్నది. గురువర్యా! విచారించుఁడు.

శిష్యు 2—అయ్యా! ఆమె విలువగల బట్టలను నగలును ధరించియున్నదే!

నర—(ఆశ్చర్యముతో) అవునుజూడీ! ఆమె యెవర్తయో, యేమి కారణమున నట్లు పడియున్నదో సమీపమునకుఁ బోయి యరయుదముగాక. (అందఱును దగ్గఱకేఁగుదురు)

నర—ఔరా! ఈమె యొక రాణివాసపుస్త్రీయట్లు తోఁచుచున్నదే! పాపము. మూర్ఛఁజెంది యున్నది! ఏమి వచ్చినదో?

శిష్యు 1—దొంగ లెవ్వరో యీమె నెత్తుకొనివచ్చి, మనలఁ జూచి యట దిగవిడిచి పాఱిపోయిరేమో?

శిష్యు 2—దొంగలే యెత్తుకొనివచ్చియున్న, నన్నివిలువగల నగలట్లులుంపఁబడి యుండునా? ఆమె తనంత తానే వచ్చి యుండునని తోఁచెడిని. ఏమి కారణమో గదా?

నర—మొగమున దుఃఖచిహ్నములు కనఁబడుచున్నవి. చెక్కుటద్దముల వెంబడి బొప్పబిందువులు జాలువాఱి యుంటచే, నవి మలినములై యున్నవి. ముఖలక్షణముఁ జూడ నొక మహారాజ్ఞి యని చెప్పక చెప్పుచున్నది. ఏదో కష్టమునకులోనై యీదారిని వచ్చియుండును. దుఃఖోద్రేకముచేఁ బనవిపనవి యిట్లు సొమ్మసిల్లియుండును.

శిష్యు 1—ఆర్యా! చూడుఁడు. ఆమె యొత్తగిలుచున్నది.

శిష్యు 2—అంతమాత్రమే గాదు. కన్నులు దెఱచినది. దప్పిక
కై కాఁబోలు నేదో సంజ్ఞ చేయుచున్నది.

నర—అవును. (ఒకటవ శిష్యునితో) ఓరీ! నీవు సత్వరము
నేఁగి యీపాత్రతో సవ్వలితటాకమునందలి నిర్మలోద
కముఁ గొనిరమ్ము. (శిష్యుఁడు పరుగెత్తును) అమ్మా! నీవు
భయపడనక్కఱలేదు. నీరు తెచ్చుచున్నాఁడు. నీకిం కేమి
కావలయు?

శీల—(హీనస్వరముతో) అయ్యా! నా - మ - ఱఁ - ది-
యేఁ - గె - నా?

నర—అమ్మా! నీమఱది యెవ్వరు? నీవేల యిట్లుంటివి?
చెప్పుము తల్లీ! నీకెట్టి కష్టములు వచ్చినను మేము వా
రింపంగలము. (శిష్యుఁడు నీరముఁ దెచ్చును.) అమ్మా!
ముందుగా నీ వీనీరు త్రావుము. అవల మెల్లఁగా నీయుదంత
మెల్ల నెఱింగింతువుగాక. (కొంచె కొంచెముగా నుదక
మామె నోటిలోఁ బోయును.)

శీల—(తేఱికొని)ఆర్యా! మీకివే నాకృతజ్ఞతానమస్కృతులు.
నేను రావువారి కోడలను. పూసపాటివారు మాకుటుం
బముపై మత్సరము వహించి నాల్గు దినములకిందట హఠం
బున మాపై దాడివచ్చిరి. వారి నాయకుఁడు మాధవ
వర్మ చిరకాలామర్షము లోనఁ బెట్టుకొని, కమ్మవారిని,
రెడ్లను, వోడుఁజేసికొని, మా సేనల నెల్ల నాశమొనర్చి

నాఁడు. తమ కిఁక నపజయము తప్పదని తలఁచి, నానాథుఁడు నన్నుఁ దప్పఁ దక్కఁగల రాణివాసంపు వనితల నెల్ల నగ్ని ప్రవేశ మొనరింప నాజ్ఞయిచ్చెను. నామఱఁది న న్నే దేని గ్రామముచేరువఁ జేర్పఁగోరి యిట డించి పోయియున్నాఁడు. నేఁటిపోరు ఘోరముగా జరుగనై యున్నది. తోడి కాంత లెల్ల 'జహార' వ్రత మాచరించి ధన్యలై తమ పతుల కన్న మున్న స్వర్గలోకమున కేఁగిరి. నిర్భాగ్యురాల నగు నేను మాత్రి మేకాకినినై యిట్లు వచ్చితిని. ఎవరియింట నైనను దాస్యముఁ జేయుచుఁ గొంతకాలము జీవింప వలతును.

నర—అమ్మా! నీవు సర్వజ్ఞ సింగమభూపాలు దేవివా? తల్లీ! నీ కెట్టి గతిగల్గెను!

శీల—అవును, తండ్రీ! నాయవస్థ యింతకు వచ్చినది.

(దుఃఖించును.)

నర—అమ్మా! నీవిఁక వగవకుము. నాకుఁ గూఁతులు లేరు. నీవే నాకూఁతువని యెంచి నీ కెట్టి లోపమును రానీయక కాపాడెదను. నాయింటికి రమ్ము.

శీల—నాయనా! అటులే వచ్చెదను. మీవంటి మహనీయుల ప్రాపుదొరకుటయు నొకయదృష్టమే గదా! నన్ను మీ యిచ్చవచ్చిన సేవలో—

నర—బిడ్డా! నీ విఁక విశేషముగా వచింపనక్కఱలేదు. నా శిష్యులవెంట మెల్లఁగా మన యింటికరుగుము. నేనును

స్నానసంధ్యావందనాదులు ముగించి కొలఁదిసేపటికే యిలు
చేరుకొందును. ఓరీ! శిష్యులారా! మీరీమెను మెల
పునఁ గొనిపోయి మాయింటియామె కప్పగించి సర్వసదు
పాయములును గావింప నాయాజ్ఞయైనదని చెప్పుఁడు.
అమ్మా! నీకెట్టి వెఱపునుండఁ బనియే లేదు. నీవు నాతన
యవే. సందియములేదు.

చ. కడుపునఁ గన్నపుత్త్రికల కన్నను మిన్నగ నిన్నుఁజూతు, నే
యిడుములు ప్రాప్తమైన వెడలింతు, విరోధిజనంబు నిన్ను నే
పడుపునఁగాంచఁజాలని శుభస్థలిఁ జేర్చెదఁ, గూర్తుమీరుగో
ల్పడిన సమస్తరాజ్య విభవంబులు మంచిదినాలు చేరఁగన్.

శీల—(నరసన్న పాదములనంటి మ్రొక్కి) తండ్రీ! ధన్యు
రాలను. (శిష్యుల వెంటఁబోవును.)

నర—ఆహా! దైవమా! నీకృత్యములు కడు విపరీతములు
గదా! బహుసహస్రదాసీజనసేవ్యురాలగు మహారాజ్ఞి
కెంత దురవస్థఁ గల్గించితివి! ఆమెను నాపాలఁ బడఁజేసి
తివి. ఎటుల నాసంకల్పము నెఱవేర్తువో! నీదేభారము.

(నిష్క్రమించును.)



# శీలవతి.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

రంగము:—నరసన్నభట్టు నింట నొకగది.

ప్రవేశము:—లచ్చమ్మయు, శీలవతియు.

లచ్చ—అమ్మా! ఊరకుండుము. దైవనిర్మాణ మెవ్వరు తప్పింపఁగలరు?

శీల—తల్లీ! ఊరకుండక నేఁ జేయున దేమిగలదు? అంతయుఁ దెలిసియు దుఃఖోద్రేక మాఁపుకొనఁ జాలక యిట్లు వాపోవు చుందును.

సీ. పట్టుపఱుపు గాని ♦ మెట్టితొఱుఁగని నే
నడవిదారులఁ బట్టి ♦ నడిచియుంటి
ఆత్మపూరుషుఁ గాని ♦ యరయకుండెడు నేను
బరపురుషుల మ్రోలఁ ♦ దిరుగుచుంటి
అడిగట్టులై చేటి ♦ కాళ్లకొలువ నొప్ప
నే నొంటికత్తెనై ♦ నిలిచియుంటి

అడిగిన దెదిర్మైన ♦ నర్థుల కీఁ గల్గు
నేఁ బరాపేక్షమై ♦ నెగడుచుంటి
గీ. మీఁద నీఁగవ్రాలిన నాదు♦మేనుగందు
నడుగు మేర నడువఁ గడు ♦ నలసిపోదు
నంచు నెంచి కంటికిఱెప్ప ♦ యట్లు ప్రోచు
ప్రాణకాంతు వెంటఁ జనక ♦ బ్రతికియుంటి.

ఈతలఁపులు మదికివచ్చి నప్పుడెల్లఁ దాపముదయింపక మానదు. అంతఁ గంటికొలుకులనుండి బాష్పజలముప్పొంగి ప్రవహింపక మానదు.

లచ్చ—అమ్మా! అంతయు నిజమే. కాని, తల్లీ! కాలము దప్పి వచ్చినప్పు డోర్చికొనకతీఱదు గదా? ఏ యెండకా గొడుగుఁ బట్టవలయును. మహారాజ్ఞికిఁ గల్గిన లోపములఁ బాపుటకు మావంటి సామాన్యసంసారులకు సాధ్యమా! పడినగోడలు పడినట్లేయుండవు గదా? కొంతకాల మోపిక పట్టుము. నీకు శుభదినములు వచ్చును. ప్రకృతమున నీకు రాజవైభవములు లేకపోవచ్చును. కాని యన్నవస్త్రము లకు మర్యాదాదరములకు నెట్టిలోటును గలుగదని యెంచుము. మా కాఁడుబిడ్డలు లేరుగదా? నీవే మా యింటి యాఁడుఁబడుచువని యెంచుకొనెదము.

శీల—అమ్మా! మీ రేలోపమును నాకుఁ గలుగఁజేయరని నేనెఱుఁగుదును. నేనెంత రాణివాసపుస్త్రీనైనను, మీ

వలెనే యన్నమే తిందునుగాని, వెండి బంగారములు, రత్నములు, తినననియు నాకుఁ దెలియును. కాని,

సీ. ఆకాశవాహినీ ♦ యానంబు నొనరించు
రాయంచ నేలపై ♦ వ్రాలినట్లు
అత్యున్నతస్థితి ♦ నమరు నీహారాద్రి
పాతాళకుహరానఁ ♦ బడినయట్లు
క్షీణపుణ్యంబున ♦ స్వీయలోకము వీడి
తారకామణి నేల ♦ జాఱినట్లు
ఆనందనౌకా వి♦హారంబు సమయాన
బుడుఁగున నుడుపంబు ♦ మునిఁగినట్లు
గీ. ప్రాజ్యరాజ్యాది వైభవ ♦ పదవిఁబాసి
యతినికృష్ట నీచస్థితి ♦ నందియుంటఁ
దల్లి! దుఃఖప్రవాహంబు ♦ వెల్లివిరిసి
వరదలై యొక్కతఱి నిట్లు ♦ పాఱుచుండు.

లచ్చ—అమ్మా! నీ వన్నమాట నిజమే. ఒకొక్కప్పుడాఁపుకొనరాని దుఃఖమువచ్చును. భయంకర కష్టములకు లోనై, సమస్త బంధుజనమునుబాసి యుండవలసినప్పుడు దుఃఖప్రవాహ మాఁగునా? కాని, తల్లీ! నీవు సర్వకష్టముల మఱచిపొమ్ము. నీవొక రాచపడుచు వన్నమాటయే విస్మరింపుము. ఒక్క పేదబాపనుని యింటఁబుట్టి, కాల వశమున మగనిఁగోల్పోయి, తద్దుఃఖ మనుభవించుచుండు

నొకసామాన్య స్త్రీవ్యక్తివని యెంచుకొనుము. నీకడుపులోఁ బెరుఁగుచున్న బిడ్డకొఱకు నీవు నీదుఃఖమును దిగమ్రింగక తప్పదు. బిడ్డా! నీబాబయ్యగారివాక్యములు వేదవాక్యములని యెంచుము. వారు వచించినట్లు, నీవు కొలఁదిదినములలో సుఖప్రసూతవయ్యెదవు. నీకుఁ జక్కని మగబిడ్డఁడే జనించును. అతఁడే రావువంశాంకూరమై చిరాయుర్జీవియై మనును. గర్భధారణదినములలో వనితలు వంతలుమాని, సంతసముం దెచ్చుకొని, మెలంగవలయు ననుట నీవెఱిఁగినదే కదా?

శీల—పిన్నిగారూ! అన్నియు నెఱుఁగుదును. అయిననేమి?

తే. గీ. దుర్భర విప జ్జలధర సం♦దోహ మొలసి
నాహృదయగగనంబుఁ బూ♦ర్ణముగఁ గప్ప
మఱి నిరాశాప్రశీతల ♦ మారుతంబు
పైని వీవ, బాష్పసలిల ♦ వర్షమరుదె?

లచ్చ—అట్లే కావచ్చును. అయినను,

తే. గీ. చదల నెంతగా జలదముల్ ♦ పొదలుకొన్న,
నది యమావాస్య రాత్రియే ♦ యైనఁగాని,
యొక్క నక్షత్రకాంతియే ♦ నొదవకున్నె?
పాంథు నిస్పృహాత్వ మదియ ♦ పాపకున్నె?

అమ్మా! నీహృదయాకాశంబున నెంతటి సాంద్రమేఘసంఘము లలమికొన్నను, వానివలనఁ గలుగు చీఁకటులు

వాపుటకు నచిరకాలములో నందొక్క టిక్కయుదయింపనై యున్నదిగదా ? నీవేల చింతింతువు ? ధైర్య మవలంబించి యూరటం గాంచుము, తల్లీ !

శీల—తల్లీ ! అటులేయుందును, లెండు.

తే. గీ. చండదుఃఖాతపాహతి ♦ నెండిపోయి
యొకయెడారిగా మార్పొంది ♦ యున్న మద్హృ
దయవసుధ, తల్లి, నీదు సు♦ధాపరిపూర్ణ
భాషణాంబు సేచనమునఁ ♦ బదనుగాంచె

దాన నా కాశాంకూరములు మొలకలెత్తుచున్నవి. ఇంక నీసపరిసంగమునకేమి గాని, పిన్నిగారూ, మీరులోనికేఁగుఁడు. బావయ్యగారు పొలమునుండి వచ్చువేళయైన ట్లున్నది. ఆయన కేవేవి సమకూర్ప వలయునో చూడుఁ డమ్మా! నిరంతరము నాతోనేయున్న, మీపనులకెల్ల నడ్డంకిగా నుంతునేమో !

లచ్చ—అమ్మా ! నీవు మాకెంతను నడ్డంకిగాలేవు. అత్త వారి యింటికేఁగిన యాఁడుబిడ్డ మరలఁ దమ గృహమున కు రాఁగా, జననీజనకుల కెట్టి యానందమొదవునో యట్టి యానందమే మాకు నీ రాకవలన జనించినది. మా పేద గృహమునకు నీవు నిజముగా సామ్రాజ్యలక్ష్మివలె వచ్చి తివి సుమీ.

శీల—అమ్మా ! విష్ణువునుండి యెడఁబాసియున్న లక్ష్మికేమి శోభయుండును? తల్లీ! నాలక్ష్మీత్వము నాతోడి కోడండ్ర

తోఁబాటు మంటఁ గలియక యింకను నిలిచియున్నదా ? ఆనాఁడే యది పోయినది. బొందిమాత్రము విధిలేక నిలుపు కొనక తప్పదయ్యెను. (వాపోవును.)

లచ్చ—శీలవతీ ! ఇప్పుడే కదా ధైర్య మవలంబింతు నంటివి. ఇంతలోనే మరల నీరీతినుండు వేల ? మితిమీరిన బేల తనమా ! మీపురుషు లెంతటి ధైర్యము వహించి శత్రు వుతోఁ బోరిరో, నీవును నీయంతశ్శత్రు వగు దుఃఖము తో నంతటి ధైర్యమువహించి పోరవలయును. ఈశత్రువు ధీరతగల్గువారి కెల్ల సులభసాధ్యుఁడు సుమీ !

శీల—(కన్నులఁ దుడిచికొనుచు) అటులేయుందు నమ్మా ! (పావకోళ్లచప్పుడు వినఁబడ) అదిగో ! బాబయ్యగారు వచ్చి నట్లున్నది. మీరు లోపలికేఁగి వారి యాజ్ఞల నిర్వ ర్తింపుఁడు.

లచ్చ—తల్లీ ! వా రిచ్చుటికేవత్తురు. నాకిచ్చు నాజ్ఞలు నీయెదుటనే యిత్తురు. కూఁతునెదుటఁ దండ్రికి మర్మము లుండవుగదా ?

(నరసన్నభట్టు ప్రవేశించును.)

నర—అమ్మా ! శీలవతీ ! సులువుగాఁ దిరుగుచుంటివా ?

శీల—తిరుగుచున్నాను, బాబయ్యగారూ !

నర—నీభోజనమునకు వేళమించు ననుభయమున నేను బొదల కడ వచ్చితిని. పొద్దు కుంకినతర్వాతఁ గూడ నేవో

శాస్త్రివాదములు పెట్టుకొని, రాత్రిభోజనమున కాలక్షేపము చేసికొను నలవాటు గలవాఁడ నగు నేను, నీకొఱకై వానినెల్లఁ గట్టిపెట్టితిని జుమీ!

శీల—బిడ్డపైఁ దండ్రికుండు ప్రేమమట్టిదే కదా? తండ్రీ! మీకెంతయుఁ గృతజ్ఞురాలను.

నర—బిడ్డా! నీవు చెప్పిన నీ జన్మనక్షత్రాదులఁ బట్టి నీజాతక చక్రము వ్రాసి చూచితిని. నీ కీపున్నమలోపలఁ బురుడు రాఁగలదు. మొదల నిన్నుఁ జూడఁగానే నాసాముద్రిక శాస్త్రిపరిచయమును బట్టి నాకు స్ఫురించిన యంశములు నీజాతకఫలములకు సరిపోయినవి సుమీ! నీకు సర్వశుభ లక్షణశోభితుఁడగు సుతుఁ డుదయించును. ఆతఁడు తాత దండ్రులను మించిన యశంబును గాంచును. నూతనస్థల మున రాజ్యము సంస్థాపించి, చిరస్థాయియగు తద్రాజ్య మునకు మూలపురుషుఁడై దాని నాంధ్రదేశమంతయు వ్యాపింపఁజేయును. తల్లీ! నీవింకఁ గంటఁ దడివెట్టరాదు. అరమరలేక మాతోఁ బాటు వర్తించుచుండుము. బ్రాహ్మణేతరను గదా యని సంకోచముతో మెలంగ నక్కఱ లేదు. నీవు క్షాత్రపుత్రివైతివి. నీకు సర్వస్వామ్యములును గలవు. నీయన్న లిద్దరును నీముద్దుముచ్చటలం దీర్తురు. నీపది నెలలు నీకు నన్నిటఁ జేదోడు వాదోడులై యుందురు.

నీవు ము న్ననుభవించిన సామ్రాజ్యవైభవ మిప్పుడు తేఁ జాలను గాని, సుఖజీవనమున కేలోపముం గలుగనీయను.

శీల—బాబయ్యగారూ! మీ యవ్యాజవాత్సల్యమునకుఁ గడుంగడుఁ గృతజ్ఞను. పార్వతీపరమేశ్వరులఁ బోలియున్న మీదంపతులకు నమస్కరించుట కన్న నేఁ జేయునది లేదు.

(నమస్కరించును.)

లచ్చ, నర—శీఘ్రమేవ సుపుత్రప్రాప్తిరస్తు. ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు.

లచ్చ—అమ్మా! ఇఁక సంభాషణముం గట్టిపెట్టి భోజనముల కేఁగుదము రమ్ము. నీబాబయ్యగారి సంధ్యావందనాదులు ముగిసినవి గదా, యిఁక జాగేల? (శీలవతీ లచ్చమాంబలు లోపలికిఁ బోవుదురు.)

నర—(తనలో) పాప మీయబల దీనస్థితిఁ జూడ నాగుండె నీరై పోవుచున్నది. ఈమె సుఖప్రసూతయైన తర్వాత బిడ్డనిం జూచికొని యించుక ఖేదము మానవచ్చును. అందనుక జాగ్రత్తమైఁ గాపాడవలయు. అబ్రాహ్మణస్త్రీ నొక్కరితను నాయింటఁ బెట్టుకొని కూఁతువలెఁ జూచుచు, నరమరిక లేక వర్తించుచున్నానని గ్రామస్థులు గుజగుజలు వోవుచుండిరి. వారు పామరులగుటచేఁ గేవల పూర్వాచారపరాయణులై, నన్నుఁగూర్చి తప్పుగాఁ దలఁచుచుండిరి. కానిమ్ము. చూచెదఁగాక. వారినెల్ల నాప్రతివాదమంత్రి

ములకుఁ గట్టుపడిన తా్రఁచులం గావించెదఁగాక. ఈ యప్రయోజకులా నన్నధిక్షేపించువారు ? ఈయప్రాజ్ఞులా నాలోఁ దప్పులం బట్టుకొనువారలు? ఈమిష చేనైన సంఘమును సంస్కరింపఁజూచెద.

(నిష్క్రమించును,)



## ద్వితీయరంగము.



రంగము:—అగ్రహారములో నొకవీధి.

ప్రవేశము:—జగన్నాథ నరసింహరాజులను నిరువురు క్షత్రియవీరులు.

జగ—తమ్ముఁడా ! రావువారి కోడ లీయగ్రహారమున దాఁగి యున్నదని నీ కెట్లు తెలిసినది ?

నర—అన్నా ! ఒక యంతఃపుర స్త్రీ కోటనుండి తప్పించుకొని పోయినదనియు, నాపె చూలాలై యున్నదనియు, నామె పేరు శీలవతియనియు, మన ప్రభువుల కెట్లు తెలిసినదో నీవు మొదటఁజెప్పుము. తర్వాత నాసంగతి చెప్పెదను.

జగ—ఆయుదంతమంతయు మనప్రభువులనుండి నీవు విననే లేదా ?

నర—ప్రభువులు రావువంశనాయకులను గొందఱను జెఱకు గడలనువలె గానుగలోఁ ద్రిప్పించియు, మఱికొందఱను జలచలఁగాగ్రుఁగు నూనియలోఁ ద్రోయించియుఁ, జంపి తమ కసి తీఱెనుగదా యని యతిప్రముదితాంతరంగులై, యన వరతోత్సవములం దేలియాడుచుండుట నీ వెఱింగినదే కదా? ఇటీవల వారితోఁ బట్టుమని యొకయరగడియయేని సావ కాశముగా మాటాడుటకు సమయము చిక్కకున్నది. అందుచే వారినుండి యేమియు వినఁజాలనైతి.

జగ—అటులైనఁ జెప్పెద, వినుము. పీనుఁగుపెంటయై, నిర్మా నుష్యమై, కమురుఁగంపుతో నిండియున్న భువనగిరిదుర్గ మును మేము ముట్టడించినప్పు డందొక పిఱికిబంటు—ధన మేమైన దొరకునను నాసచేఁ గాఁబోలు దేవులాడుచున్న వాఁడు—మాకంటఁబడెను. వాఁడు మొదట నొకసొరంగపు గదిలో దాఁగుకొనఁ జూచినాఁడు. కాని వాని దురదృష్ట ముచేత, మనచేతఁ జిక్కినాఁడు. వాఁడు మన తర్జనభర్జ నాదులకు బెదరి ప్రాణములయం దాశచే నిజమంతయు వెడలఁగ్రక్కినాఁడు. వాఁడే శీలవతింగూర్చి పూర్తిగాఁ జెప్పినవాఁడు.

నర—మనరాజుగారి యంగరక్షకులలో నొక క్రొత్తమానిసి, కోరసాగవాఁడు కనఁబడుచున్నాఁడు. వాఁడే వీఁడా?

జగ—అవును. వాఁడే.

నర——ఒకచోట స్వామిద్రోహ మొనర్చినవాఁ డింకొకస్థల మున నటులే చేయునుగదా? మన నృపాలుఁడు వాని నెట్లు నమ్మెనో!

జగ——వెఱ్ఱివాని చేతిరాయివలె, మన నరపాలుఁ డొక్కొక తఱి వెనుకముందులు చూడక వర్తించును. స్వామిద్రోహు లకుఁ దా నిచ్చిన, దానిఫల మనుభవింపకపోఁడు. ఆమాట కేమిగాని, శీలవతి యిందున్నదని యెట్లు తెలిసికొనఁ గల్గితివి?

నర——గర్భవతియగు శీలవతి యెందో తప్పించుకొని పోయి దనియు, నామెయునికి నన్వేషింపవలసినదనియు రాజుగారి యాజ్ఞయైనదని మంత్రిగారు సెలవిచ్చిరి. నేను గ్రామమున కొక్క వేసముఁ దాల్చుచు నామెకై వెదకఁజొచ్చితిని. ఈయూరికిఁ గాశికిఁబోయి వచ్చిన బ్రాహ్మణునివలె నొక కావడివైచుకొని వచ్చితిని. ఇంటింటఁ బాప పుణ్యలోక ములఁ బటములం జూపుచుఁ దిరిపమెత్తుచుంటిని. ఒక బ్రాహ్మణుని యింటికేఁగునరి కందొకవనిత, పూర్ణగర్భ వతి, దవ్వులనుండి నాపలుకులు వినుచు నిల్చియున్నది. నాకంటఁబడినది. ఆమె బాపనమ్మగాదని రూపము చెప్పక చెప్పుచున్నది.

జగ——రూపమును బట్టి మాత్ర మెట్టు లామె శీలవతియని గ్రహించితివి?

నర—విను. తొందరపడకు. ధనప్రాణములు రెండేకదా మనుజుల కాసఁగొల్పునవి ? నీవు చెప్పిన పిటెకిబంటునకుఁ బ్రాణమం దాస కల్గినట్లులే, యొకకపటబ్రాహ్మణునకు ధనమం దాశ గల్గినది. నే నాబ్రాహ్మణగృహమునందు స్త్రీని జూచి యనుమానపడి నాచెంత నిలిచిన వటువుల నామెంగూర్చి ప్రశ్నించితిని. వా రామె తమయక్కయనిరి. నే నాయిలు వెలువడివచ్చుచుండ, ధనాశగల యాకపటవిప్రుఁడు నాకుఁ గనఁబడినాఁడు. వానిని గూడ నామె యెవ్వతయని యడి గితిని. మా యిరువురకుఁ జాలప్రసంగమయ్యెను. తుద కాతఁడు తనకు నూటపదార్లు బహుమాన మిచ్చిన, గుట్టం తయు వెల్లడింతు ననియె.

జగ—వెల్లడించెనా ? నూటపదా ర్లిప్పించితివా ?

నర—వానిని గొనిపోయి ప్రభువునెదుటఁ బెట్టితిని. ప్రభువు లంచమిచ్చుటకు సమ్మతించెను. వాఁ డామె యెట్లువచ్చెనో, యెట్టులాక విప్రునాశ్రయించెనో వివరించిచెప్పెను. నేను జూచినయామె శీలవతియే యఁట.. ఇప్పుడు మన మా బ్రాహ్మణుని గలసికొని మాటాడ వలయును.

జగ—మన మూరక యీయూరిసందులలో నేల తిరుగవల యును? ఆ బాపనుఁడు కనఁబడఁడేమి? అదియొక మోసము కాదు గద ?

నర—మోసము కాదనియే నానమ్మకము. మహారాజుగారును నటులే నమ్మిరి. ఇప్పు డాతఁడే మన కాయింటిని, శీలవతిని జూపి, యామె రావువారికోడలని రుజువుచేయుదునని చెప్పె నాఁడు. అతనిబస యేవీధిలోనో తెలియకున్నది. తెలిసిన, వెంటనే మనపని ముగించుకొని మనదారిని మనము పోయియుందుము.

జగ—ఊరిబయట నున్నతోఁటలో మనపరివారము మనకై యెదురు చూచుచుండును. అతఁడు కనఁబడిన, బాగుగ నుండును. వాని పే రెఱుంగుదువా ?

నర—వాని పెరు వెంకన్నయఁట. ఇంటిపే రడుగ మఱచితిని.

జగ—ఎవ్వరినైన నడిగి తెలిసికొందమా ?

నర—అది యనుమానమునకు హేతువగును. కొంతసేపు తాళియున్న, నతఁడే కన్పట్టును. ఆవీధికిఁబోయి చూతము రమ్మ (పోవుదురు.)

(ప్రవేశము—వేదాంతకు వెంకన్న)

వెంక—(తనలో) వారే కాఁబోలు మాధవవర్మ మహారాజు గారి భటులు. నాకొఱకే వెదకుచుండఁ బోలు. వారిం గొనిపోయి నరసన్నభట్టు నిల్లుచూపెద. ఈదెబ్బతో నర సన్న గర్వభంగుఁడగును. తానే సకలశాస్త్రవేత్తననియు, సర్వజ్ఞుఁడ ననియు, నాబోంట్లు తనయెదుట నిలిచినా

టాడుటకైనఁ దగరనియు, నెంచి, యహంభావముతోఁ జరించుచున్నాఁడు. ఇప్పు డాగర్వమంతయు ఖర్వమగును. రాజభటులువచ్చి, యిల్లుముట్టడించి, తన్నుఁ దనయింటి లోని వారిని, గఠినముగా దండించుచుండ, మొఱ్ఱోయని వాఁ డేడ్చుచుండ, నే నెదుట నిలిచెదను. ఏ మన నో చూతునుగాక. (ఇంచుక యోజించి) ఈకూళలు నాచే గుట్టు వెల్లడిచేయించి, నాకిత్తుమన్న మాటపదారు లెగఁ గొట్టుదు రేమో! ఎగఁగొట్టినను సరే. నరసన్నమీఁద నాకుఁ గల కోపముం దీర్చుకొనుట కింతకన్న మంచి యదను దొరకదు. వీరు నేఁ గోరిన లంచమీయకున్నను, నావిరోధి యాధ్ధత్యము నిరోధించి నాకు సంతసముఁ గూర్పఁ జాలుదురుగదా! అదియే చాలును. (చప్పటులు గొట్టుచు) ఓయీ సర్దారులు! మాధవవర్మ మహారాజు గారి సేనానులు! ఇక్కడకు రండు. నే నిక్కడనుంటిని. ఈవంకకు రండు.

(క్షత్రియవీరులు మరలఁ బ్రవేశింతురు.)

జగ—ఏమయ్యా! బ్రాహ్మణోత్తమా! నీకై తిరుగుసరికి మాప్రాణములు కడంటినవే! (రహస్యముగా) ఎక్కడ నున్న దాశీలవతి?

నర—(మెల్లఁగా) నాఁడు నా కామె కనఁబడినయిల్లు నేను గుర్తింపఁగలను. కాని యామెను మనకుఁ జూపి రావువారి.

కోడలని రుజువుచేయుపని యంతయు నీ విప్రపుంగవునిపైఁ
బెట్టితిమి. అయ్యా! అదియే కాదా మీరు మాకుఁ
జేయు సాయము ?

వెంక—(మెల్లఁగా) అవు నంతియే. కాని రుజువుచేయవలసిన
యవసరము వచ్చి నప్పుడుగదా, యాప్రసక్తి? మీరు
నాతోరండు. మీ కాయిల్లు చూపెదను. అంత మీభట
వర్గముతో దానిని ముట్టడించి లోపలనున్న యాకాంతను
గొనిపొండు.

నర—భటులు, ముట్టడించుట, యివి యన్నియునేల ?
బ్రాహ్మణులగుటచే సామముననే కార్యసాధనముఁ గావింపఁ
జూతము.

వెంక—అబ్బో! సామమునఁ గుదురునా ? ఆయింటి యజ
మానుఁడు మిగుల దిట్టరి. మీరు పదిమంది శూరులతోఁ
బోయి వానిని గట్టిగా దండించి, విప్రజాతిలోఁ బుట్టియు
నీ కీదుర్బుద్ధియేలరాయని పల్కుచు, నలువురిలోఁ జెప్పు
దెబ్బలను గొట్టుఁడు. అప్పుడుగాని యాతఁడు లొంగఁడు.

జగ—మీ వైఖరిఁ జూడ మీ కాయనతో విరోధమున్నట్టు
కాన్పించుచున్నదే !

నర—విరోధము గావుననే యాతనిగుట్టు వెల్లడించుచున్నాఁడు.

వెంక—అవును,-విరోధమేగలదు. అదిగాక, నాకు మీరాజు
గారు నూటపదారులు బహుమతిగా నిత్తురనుటచేతను,

వాని రహస్యము ప్రకటింపఁ బూనుచున్నాను. అనూట పదార్లు తెచ్చితిరా ?

జగ—అయ్యా ! నీ వాయిల్లుచూపి, మా కాయిల్లాలిని గనఁ బఱిచి మామహారాజునకు సంతసముం గూర్చి, మేము కృతకృత్యులమైన పిమ్మటఁ గదా, నీవు సొ మ్మడుగుట ?

వెంక—నే నిల్లుచూపెదను. ఆశీలవతిని మీరే వెదకికొనుఁడు. అది నాపనిగాదు. నే నామె ముక్కుమొగము లెఱుఁగను. వెలమవారి చిన్నది యొక్కతె నరసన్నయింటఁ జొచ్చి నట్లును, ఆమె నాతఁడు మిగులఁబ్రేమతోఁ గూఁతువలెఁ జూచుచున్నట్లును, నేను వింటిని. ఆమెను నాయెదుటఁ బెట్టెద రేని, నరసన్నయింటిలో నుండువనితయగునో కాదో నేను జెప్పఁగలను. అంతమాత్రమే నేనొనర్పఁ గలను. మీ మహారాజుగారు సంతసింతురో, సంతాపింతురో, యది నా కృత్యముగాదు.

నర—శీలవతి నరసన్నయింటఁ జొచ్చినట్టు లీయూర నిం కెవ్వ రేని సాక్ష్య మిత్తురా ?

వెంక—ఏమో, నాకుఁ దెలియదు. నే నితరసాక్షులను దీసి కొని రాఁజాలను. ఆ నరసన్నయన్న, నందఱకు భయము గలదు. అతనికి వ్యతిరేకముగాఁ బల్కు నెల్లరును నోడు దురు. నా కాభయములేమి, నే నీసాహసకార్యమునకుఁ గడంగితి. మీ రాయింటిని బరిశోధించి, మీ కాకాంత

కనఁబడిననే, నా కాధనమిండు. ధన మిచ్చినంత మాత్రాన నాకుఁ దృప్తిగలుగదు. ఆగర్వివి బదిమందిలో నవమానింప వలయు. అతఁడు నాకుఁ బరమశత్రుఁవు.

జగ—ఆలాగా? అటులైన, నిన్ను నమ్మెదములే. (అపవారించి నరసింహారాజుతో) తమ్ముఁడా! ఈతనివైఖరిఁ జూడ, మనకు మోసము తటస్థించునని నాకుఁ దోఁచుచున్నది.

నర—(అపవారించి) మనము వానికి సొమ్ముఁకను నీయలేదు గదా? ఎటు మోసము చేయఁగలఁడు?

జగ—(అపవారించి) ఇతఁడు కేవల ధనాపేక్షతోనే మనకు సాయపడుటలేదనియు, నేదో హేతువుచే నరసన్నపై నీర్ష్యవహించి వాని నెటులేనిఁ జిక్కులువెట్టఁదలఁచి యిట్లు పలుకుచున్నాఁడనియు నాయూహ.

నర—(అపవారించి) ఆలాగైన, నాదండనము వీనికే గావిం తము. ఎక్కడకుఁ బోఁగలఁడు?

వెంక—మీా రేదో గుసగుస లాడుచున్నారు. నన్ను నమ్మ కున్నారు కాఁబోలు.

జగ—నిన్ను నమ్మక కాదయ్యా! మారాజుగారిని గూడఁ దీసికొనివచ్చుట మేలేమో యని యాలోచించు చుంటిమి.

వెంక—అది చాల మంచిపని. వా రేవత్తురేని, నిముసములోఁ గార్యము నెఱవేఱును.

నర—అటులైన, వారిని దీసికొని వత్తుము. వారీయూరి కొక కోసుదూరమున నొకగుడారము నిర్మించుకొని యుంపు విడిసియున్నారు.

వెంక—శీఘ్రముగా రండు. నే నింతలో భోజనముచేసి వత్తును మన మా యెదుటి రామదేవాలయపు టరుఁగుమీఁద మరలఁ గలసికొందము.

(వీరులు నిష్క్రమింతురు.)

(తనలో) వీరు నాచర్యను గూర్చి యేదో సందేహించు చున్నట్లు కనంబడుచున్నది నాకు ధనాశయేమియు లేనట్లు, కేవల మతోద్రేకముచే నరసన్న గుట్టు బట్టబయలు చేయునట్లును, వారికి నచ్చఁజెప్పి, నాయభీష్టముం దీర్చు కొందును గాక.

(నిష్క్రమించును.)

---

## తృతీయరంగము.

---

రంగము:—నరసన్న భట్టు గృహములోని గది.

ప్రవేశము:—నరసన్నభట్టు, కృష్ణసూరి, శిష్యులు, లచ్చమ్మ, శీలవతియు-అందఱు నుచితాసనములపైఁ గూర్చుండియుందురు.

నర—కృష్ణా! ఆవెట్టివెంకన్న మనమీఁద వృథామాత్సర్యము వహించి మాధవర్మతో శీలవతి యిందుఁ గలదని చెప్పి

నాఁడఁట, వింటివా? ఆతఁడు సపరివారముగా వచ్చి, మన యింటిని ముట్టడించి, శీలవతిని గొనిపోవ నిశ్చయించెనఁట.

కృష్ణ—నాన్నగారూ! ఇదంతయు మీకెట్లు తెలియ వచ్చినది?

నర—మన నారాయణుఁడు మాధుకరభిక్షకై యూరఁ దిరుగు చుండఁగా, వెంకన్నయు నిరువురు క్షత్రియవీరులును రహస్యముగా మాటాడుకొనుచుఁ బోవుచుండిరఁట. ఆమంతన మేదో గ్రహింపవలెనని, మనవాఁడు వారిని వెంబడించి నాఁడఁట. వారు తిన్నఁగా రామదేవాలయపు టరుఁగు మీఁదికిఁ బోఁగా, మనవాఁ డాప్రక్కకే వెళ్లి, దానివెనుకఁ బొంచియుండి, వారి సంభాషణ మంతయు నాలకించి నాఁడఁట.

కృష్ణ—నారాయణా! వారు మనయింటి నెప్పుడు ముట్టడింతురురా?

నారా—ఎప్పుడో గాదు. ఇఁగనో యిప్పుడో వత్తురు. వారు శీలవతిం గొనిపోవుటేగాక, మన యిల్లుకొల్లపెట్టి, గురువుగారిం దండింతురఁట. ఆమాట వినఁగానే నాకు దడపుట్టినది. (వడఁకును.)

శీల—బాబయ్యగారూ! నామూలమున మీకెట్టి చేటు వాటిల్లుచున్నది! ఇప్పు డీహానివడిం దప్పించు కొను మార్గ మేది?

నర—అమ్మా! భయపడకుము. వారెట్టిచేటును గల్గింపఁ జాలరనియే నానమ్మకము. సామముచేతనే కార్యసాధనము గావింపఁగలనను ధైర్యము గలదు.

నారా—వారు సామవాక్యములచే లొంగుదురని నాకుఁ దోఁపదు.

నర—లొంగకున్న, నితరోపాయములు లేవా? ఏ దెట్లు వచ్చినను, వెఱవనక్కఱలేదు. నారాయణా! నీ వూరక వడఁకెద వేలరా? నిన్నెవ్వ రేమి చేయఁగలరు?

కృష్ణ—ఓయీ! ఇన్నాళ్లనుండి మానాన్నగారి శుశ్రూషఁ జేయుచుండియు, నీ వాయన సామర్థ్యమే యెఱుఁగలేక పోయితివిగా? ఆయన బార్హస్పత్యౌశనసచాణక్య తంత్రాధ్యయన మొనరించిన మేటియని యెఱుఁగవా? ఏయుపాయముచేతనైన దుర్వృత్తితో వచ్చిన యాదుష్టులఁ దొలఁగింపఁగలరు. నీవు వణఁక నక్కఱలేదు.

పుల్ల—(బొరుమని యేడ్చుచు) గురువుగారూ! నన్ను మా యమ్మ కప్పగింపుఁడు. ఆరాక్షసులు నన్నుఁ జంపుదు రేమో! మా యమ్మకు నే నొక్కఁడనే కొడుకను.

నర—ఓరి బుద్ధిహీనుఁడా! నీ వెందుల కేడ్చెదవురా? ఆ శూరులు నీయట్టి మహాపరాక్రమవంతునిఁ జంపినఁ గాని, తమ జయము పూర్తికాదని యెంతు రనుకొంటివా?

శీల—సోదరా! క్రూరులైన యీ శూరులు నా కొలఁకు గాని, మీ కొలఁకు గా దిచ్చుటకి వచ్చుచుంట. మీరు వెఱ పుడిగియుండుఁడు. బాబయ్యగారూ! ఆ హాతకులు మీ సామవచనములకు లోపడిన మేలే. లోపడకున్న, మీరు కొంకక నన్నర్పింపుఁడు. అంతియే గాని, నామూలమున నిరుమలపాలు గాకుండుఁడు. కానున్నది కాకమానదు గదా?

కృష్ణ—సోదరీ! ఆకూళలు నీ కొలఁకును గా దిచ్చుటకి వచ్చుచుంట. నీ కడుపునం బెరుఁగుచున్న బిడ్డకొలఁకు. మాధవవర్మ, "శతోశ్శేషం న శేషయే" త్తను రాజనీతిని బాటింపఁ దలఁచియుండును. మాతుంటరిబందుగుండు, వెంకన్న, నీవుచూలాలవనియు వారితోఁ జెప్పియుండును.

తే. గీ. త్రిదశనాథుండు లీలావతీ లతాంగి
నిట్టి యూహాతోడనె చెఱఁబెట్టఁ దలఁప
నఖిల విదుఁడైన నారదుం డాఁపలేదె?
అట్లె, తంత్రజ్ఞుఁడౌ తండ్రి యాఁగు నిన్ను.

నాన్నగా రేదోప్రణాళిక తమ హృదయములోఁ బన్నుకొనియే యుందురు. భీతిల్లకుము.

శీల—బాబయ్యగారి శక్తియెఱుఁగుదును. కాని నావి దుర్దినము లగుటచే, నదియు వమ్మగునేమో యని శంకించుచున్నాను.

తే. గీ. కడు నదృష్టహీనుల స్నేహ ♦ కలనఁ గాదె
దిగ్విజయ శీలులకుఁ గూడఁ ♦ దేజ మెడలు;
అల సుయోధన పక్షువ♦హానమె కాదె
శాంతనవు తేజమెల్ల నా♦శం బొనర్చె ?

నారా—అమ్మా ! గురువుగారికిని శంతనుపుత్త్రునకును సామ్యము చక్కఁగాఁ గుదిరినది. భీష్ముఁడు స్వచ్ఛంద మరణవరము గలవాఁ డగుటచేత, యుద్ధరంగమునఁ దనంత తానే కూలెఁగాని, యొరు లాతనిం గూల్పలేదు. అటులే నరసన్న భట్టారకుని బరులు చెనకఁజాల రనియే చెప్ప వచ్చును.

(తలుపుమీఁద గ్రుద్దులచప్పుడు వినఁబడును. అందఱు విందురు)

ఫుల్ల—(ఉలికిపడి) ఓయినాయనో ! మీరన్న యాపరులు వచ్చిరయ్యా ! తలుపు గ్రుద్దుచున్నారు. నే నామిద్దెపై కెక్కి దాఁగుకొనియెద.

నర—ఓరీ ! మూర్ఖుఁడా ! అల్లరిచేయకు. మేము జీవించి యుండ నీకే భయమును గలుగదు.

ఫుల్ల—మీరును జీవింపరనియే నా భయము.

నర—ఎంత తెలివి గలవాఁ డవురా ! నీయిచ్చ వచ్చినచోట దాఁగుకొనుము. కృష్ణా ! నీవే పోయి తలుపు తెఱచి చూడుము. వచ్చినవారు శత్రుపుత్రులైన, వారిని సగౌర ముగా లోనికిఁ దీసికొనిరమ్ము. భయము లేదులే.

(కృష్ణసూరి యేఁగును. నారాయణశాస్త్రి కలఁతపడుచుండును. పుల్లయ్య నాల్గుమూలలకుఁ బరువులెత్తి యొకమూల నక్కి నిలుచును.)

శీల—(తనలో) ఓ పరమేశ్వరా! దీనదయాళూ! ఆర్త త్రాణపరాయణా! నీవే యీ విపత్తునుండి కాపాడవలయు.

ఉ. సైఁచితి సర్వబంధు జన♦సంఘ వియోగభరంపుదుఃఖముల్
సైఁచితి రాజ్యవైభవ వి♦నాశ యశస్సుఖనాశ శోకమున్,
సైఁచితినెల్లఁ బుత్త్రికనొ♦సంగికులంబుఁబ్రతిష్ఠ చేయుచున్
బ్రోచెదవంచు నమ్మికఁ బ్ర♦భూ! యిటు చిక్కులఁ
దోయ న్యాయమా!

తే. గీ. వైరిహృదయ మాత్సర్యాంధ ♦ కార మెడపి
స్నేహ నామకజ్యోతిని ♦ నిలుపు మయ్య!
గండిఁ డాసతో బ్రతుకు జీ ♦ వంపు గతికిఁ
ద స్నేహజ్యోతియే మార్గ♦దర్శి గాఁగ.

(ప్రవేశము:—కృష్ణసూరి మాధవవర్మాదులతో)

కృష్ణ—మహారాజా! వారే మాతండ్రిగారు. ఆవీరముపై దయ సేయుఁడు.

మాధ—ఓయీ! బ్రాహ్మణోత్తమా! నీవు మాశత్రు భార్య కాశ్రయ మిచ్చితివని వింటిమి. అది నిజమా?

నర—అయ్యా! తమ శత్రు వెవ్వఁడు? ఆతనిభార్య యెవ్వతె?

మాధ—మాశత్రు వెవ్వఁడో యెఱుఁగవా? మమ్ముఁ బరీక్షింపఁ దలఁచి యి ట్లడుగుచుంటివి కాఁబోలు!

నర—ఎవ్వరి కెవ్వరు శత్రువులో, యెవ్వరు మిత్రులో తెలిసికొను నవసరము మా బ్రాహ్మణుల కుండదుగదా? మా కెల్లరు మిత్రులే.

మాధ—ఓహో! మీరు వేదాంతశాస్త్రపండితులరు కాఁబోలు! మీ పాండిత్య మిచ్చట వెల్లడింప నక్కఱలేదు. మాకు మాటలతోఁ బనిలేదు. వినుము. రావువారు మా విరోధులు. వారికోడలు, మీ యింటనున్నదఁట. ఔనా, కాదా?

నర—రావువారి కోడలు మాయింట నెట్లుండును? ఆమె రావువారి యింటనే యుండవలయు. లేదా. పుట్టినింట నుండవలయు.

మాధ—నీ యింటలేదా? ఆలోచించి మాటాడుము. మా కనుసన్న నైనంతమాత్రమున బయటనున్న మా భట వర్గము నీ యిల్లుకొల్లపెట్టి, మిమ్మందఱను వినాశ మొనర్పఁ గలుగుఁ జుమీ!

నర—మహారాజా! ఇంతకుముందు తమ ప్రతాపానలము బహువిరోధినృపాల వంశకాననములను దహియించి,

విశేష సుకృత మార్జించియే యుందును. దానికిఁదోడ బ్రాహ్మకుల విధ్వంస పుణ్యమును గూడ మూటఁగట్టుకోఁదలఁచినదా? ఈ మాత్రంపుఁబనికి బహుభటులేల? తా మొక్కరే చాలరా? కానిండు.

(తన్నుఁ జంపుదు రేమో యని పుల్లయ్య కెవ్వన నొక్కకేక పెట్టును. నారాయణశాస్త్రి యాపాదమస్తకము వడఁకించును.)

మాధ—ఓ పితికి బాపనయ్యలారా! మిమ్మందఱను జంపుటకు మేము రాలేదు. మాకు వశ్యురాలు కావలసిన వనిత యొకతె యిందున్నది. ఆమెకొఱకు మాత్రమే మేము వచ్చితిమి. ఓయీ! భట్టారకా! అగ్రకులజాలముగదా యని మీరు విఱ్ఱవీఁగక యాకాంతను మా కొప్పింపుఁడు.

నర—అగ్రకులజాలమని మే మెన్నఁడు గర్వపడము. మా యభిప్రాయముచేఁ గులములన్నియు సమానములు. మన మందఱము లోకపితకు బిడ్డలము. కావున, నొక్కకులము వారమనియే చెప్పనొప్పును. ఒక్కకుటుంబములోని వారము నగుదుము.

మాధ—మీా కట్టి యభిప్రాయములు గలవనియు వింటిమి. దానన్నే, బ్రాహ్మణేతరకులజయైన మావైరికాంత మీా యింటనుండె నన్న, నమ్మవలసివచ్చె.

నర—మా యభిప్రాయములు పలువుర కుండవచ్చును. వారి గృహములన్నియు నిట్లు పరిశోధింతురా?

మాధ—మీా యుద్దేశములున్నవారు పలువు రుండినను, వాని నాచరణములోనికిఁ బెట్టువార లరుదుగా నుందురు. మీా రాయాచరణ దీక్షితులలో నొక్కరంట. ఇఁక మాకు మీాతో వాదప్రతివాదములు సలుపుటకుఁ గాలము చాలదు. అగ్ని, ఋణము, శత్రువు, శేషింపనీయ రాదన్న రాజనీతి మీాకును విశదంబేకదా? శత్రునిశ్శేష మొన ర్చుట మాధర్మము. మా ధర్మప్రతిపాలనమున కడ్డువచ్చిన వారల నెదుర్కొనుటయుఁ దప్పదు గదా? అట్టియెడల మాకు బ్రాహ్మణాబ్రాహ్మణ వివక్షమేమియు నుండదు.

నర—అడ్డంకిగా నున్న వారల నెదుర్కొనుటయందుఁ దమ కెట్లు కులభేదములేదో, యటులే, మ మ్మాశ్రయించిన వారికి జ్ఞానోపదేశముం జేసి మంచిదారింబెట్టఁ గడంగుట యందు మాకును విభేద ముండదు.

మాధ—అట్లయిన శీలవతి మీాయింట నున్నదన్నమాటయే. విప్రవరా! ఇఁక వాదముం గట్టిపెట్టుము. నీయింటనున్న స్త్రీపురుషులనెల్ల నిట రావింపుము. ఒక్కొక్కరినే మాకుఁ జూపి వారు నీకెట్టి చుట్టములో తెల్పుము.

నర—అయ్యా! తప్పకచూపెదము. మాబాపనచెలువలకుఁ దమలోవలె "ఘోషా" లేదు గదా? కావున వార

ల్లెరు నిచ్చటనేయున్నారు. (చూపుచు) వీ రిరువురు నాకుమారులు. ఈ యిద్దఱు నాశిష్యులు. ఆ ముసలిది నాయిల్లాలు. గర్భవతియగు నయ్యింతి నాపుత్త్రిక. నా కోడండ్రు పుట్టినిండ్లకేఁగిరి. ప్రకృతమున నిందు లేరు. వీరే నాకుటుంబములోని వారు.

మాధ—ఆ యింతి నీ పుత్త్రికయే యనుట నిశ్చయమా ?

కృష్ణ—మా తండ్రిగారు తమ పుత్త్రికయని విస్పష్టముగాఁ జెప్పఁగాఁ దాము వినియు నింకను ‘ నిశ్చయమా ’ యందు రేల ? ఆమె వారిపుత్త్రి. మాకు సోదరి. సందియము లేదు.

మాధ—ఆమె మీలో నెవ్వరినిం బోలియుండక పోవుటచే, నట్టు లడుగుచున్నాము లెండు-

నర—అయ్యా ! ఆ చిన్నది దాని తల్లినే పోలియున్నది. తల్లి పడుచుఁదనములో నున్నప్పు డీపోలికనే యుండునది.

మాధ—కావచ్చును. ఆమె సౌకుమార్యముఁ జూడ నొక రాణివాసంపు వనిత యట్లు తోఁచుచున్నదే !

కృష్ణ—ఆపె మగఁడు మహైశ్వర్యసంపన్నుఁడు. కాలక్రమమున వాని కాసంపదలెల్ల నశించినవి. బహుసంపదల భోగము లనుభవించిన దగుటచే సుకుమారత్వ మొంది యున్నది. అంతియే.

మాధ—ఆమెభర్త యిప్పు డెం దున్నాఁడు ?

నర—కాశిలో నున్నాఁడు. ఐశ్వర్యమంతయుఁ గోల్పోయి యుంటచే నిర్వేదముతో నతఁడు కాశికిఁ బోయినాఁడు. పోవుచు నీమె నిచ్చట దిగవిడిచినాఁడు.

మాధ—అలాగా ? సరియే. మీ యింట వంట నెవ్వ రొనర్తురు ?

నర—నా భార్యయే.

మాధ—మీకూఁతు రేల చేయదు ?

నర—సౌకుమార్య మొకటి, గర్భభార మొకటియు, నామెచే వంటచేయింపకుండుటకుఁ గారణములు.

కృష్ణ—అత్తవారియిండ్లఁ గష్టపడి వచ్చిన యాఁడుఁబడుచులను సుఖపెట్టుదురు గాని, వంటపనులం బెట్టి కష్టపెట్టరు గదా ?

మాధ—(తనలో) వీరు నాకెందును దొరకకున్నారు. మరల భయపెట్టి చూతును. (ప్రకాశముగా) భూసురులారా ! మీ రెన్ని చెప్పినను, మాకు నచ్చకున్నది. ఆ చిన్నది బ్రాహ్మణ్యస్త్రీ కాదని మాయంతర్వాణి మాతో నొక్కి చెప్పుచున్నది. మీ మాటల నమ్మఁజాలము. మాకొక విప్రుఁ డీయూరివాఁడే, నరసన్నభట్టునకుఁ గూఁతులు లేరనియుఁ దాను లెస్సఁగా నెఱుఁగుదుననియుఁ జెప్పినాఁడు.

కృష్ణ—తా మింకొక విప్రునిం గూడ నరయకపోయితిరా ?

మాధ—మే మారసిన యతఁడు మీకు దగ్గఱచుట్టమేయఁట. అతఁడే యట్లు వచింపఁ, నితరుల నడుగనేల ?

నర—తమకుఁ దారసిల్లిన మా చుట్టము మాయందు మచ్చరము గలవాఁడు. వానిని విడిచి మఱి యెవ్వనినేనిఁ బిలిపించి ప్రశ్నించి చూడుఁడు.

మాధ—మీ మీఁదిభక్తిచే నితరులు మీకెదురాడ నోడుదురేమో !

నర—భక్తిచేఁ గానిండు, భయముచేఁ గానిండు, "పదుగురాడుమాట పాటి" యగును గదా ?

మాధ—ఓహోహోహో ! మేము సామముచేఁ బ్రసంగించుకొలఁదిని మీరు త్రాడువాఱుచున్నారే ! ఆమె మీ కూఁతురు కానిండు. వేఱొక్కతె కానిండు, మా కప్పగింపవలయు.

నర—ఇదేటి న్యాయము ? మాకూఁతును మీ కప్పగించుట యెట్లు ?

మాధ—ఎట్లని ప్రశ్నింప వలనుపడదు. ఓయీ సర్దారులు ! ఆ బ్రాహ్మణుల నందఱను ఱెక్కలు విఱిచికట్టుఁడు.

పుల్ల—ఓయమ్మా ! నీకు, నాకు, నేఁటితో ఋణము చెల్లినదే ! (ఏడ్చును.)

నారా—అయ్యా ! గురువర్యా ! నామాటయేమి చెప్పుదురు ? (భట్టుచేతిం బట్టును.)

నర—(శిష్యుని విదళించుకొని, కోపముతో)

శా. ఓ రాజాధమ! విప్రశాపవచనా♦త్యుగ్ర ప్రతాపాగ్నిచే
నీరంబట్టుల యాఱిపోయెదు సుమీ♦నీపుత్త్రమిత్రాళితో!
పారంబొందఁగఁ బోలు నీదురిత భా♦వస్ఫూర్తి; కాకున్న నీ
తీరౌ దే? బహుసాత్త్వికాళి నిటు బా♦ధింతే, మదాంధుండవై?

కన్న—తే. గీ. సోదరీగో వపహరింపఁ♦ జూతు వేని
తత్సహోదర భార్గవుం♦ డుత్సహించి
శాపపరశుఘాతంబుచేఁ♦ జంపు నంచు
నరసి వర్తింపు మోయప♦ రార్జునుండ!

మాధ—(తనలో) ఆహా! ఊరక యీపాపుల బాధించు చుంటినేమో కదా! వీరి తీవ్రదృష్టులఁజూడ నాకు భయము గల్గుచున్నది. వీరు నిజముగా నపరాధులు కారేమో! నరసింహరాజు తప్పుగాఁ దలఁపలేదుగద? ఆ కపట బ్రాహ్మణుఁడు, వెంకన్న, యీ విప్రునందలి మాత్సర్యము తోనే యట్లు వచించియున్నాఁడేమో! అన్యాయముగా వీరలం గారించిన, వీరి శాపములచే హతుఁడను గావచ్చును. మాశరములకంటె వీరిశాపములు చుఱుకులైనవి. ఇంచుక కోపము తగ్గించుకొని మాటాడెదఁగాక. (ప్రకాశముగా) నరసన్నభట్టారకా! కోప ముపసంహరింపుము. ఓయీ, సర్దారులు! మీరు దూరముగాఁ జనుఁడు.

నర——కేవల సత్త్వగుణప్రధానులమైన మమ్ము మీ రూరక రేఁపిన, మాగుణము మాఱిపోవును. ఇఁకనైన మీరు దౌర్జన్యమును వీడి మీ వీటికిఁ జనుఁడు.

మాధ——అటులే పోయెదము. కాని యామె మీ కూఁతురని మాకుఁ బరిపూర్ణవిశ్వాసము గల్గింపుఁడు.

నర——మీ కావిశ్వాసము గల్గుట కేమి చేయుమని సెలవు ?

మాధ——మీ రామెచేతికూడు భుజింతు రేని, ఆమె మీ తనయ యని నమ్మెదము. అట్లు చేయుదురా ?

నర——చేయ కేమి ? కూఁతురువండిన వంట తండ్రి కాప్యాయముగా నుండదా? కాని, నేను మీ యెదుట నెట్లు భుజింపఁ గలను ? మీరు బ్రాహ్మణేతరులరుగదా ?

మాధ——మేమును ద్విజులమే. మీకన్న నొక్క మెట్టు మాత్రమే క్రిందుగా నుందుము గదా ? మేము చూచుచుండ మీ రేల భుజింపరాదు ? పూర్వకాలమున బ్రాహ్మక్షత్రియు లేకపంక్తినే భుజించినట్లు పురాణములు వచింపవా ? అట్లు మనమేల చేయరాదు ?

నర——తాము వచించినది నిజమే. కాని యిది కలియుగము. ఈయుగధర్మములు వేఱుగనుండును. అదిగాక మేము శుద్ధశ్రోత్రియులము. మీరు చూచుచుండ భోజనము చేయఁ జాలము.

మాధ—పోనిండుం. అందులకును మేము వ్యతిరేకముగా వచింపము. దేవాలయములోఁ బ్రసాద మన్నిజాతులవారికిని సమానమే గదా? ఈచిన్నది యచ్చటికి వచ్చి, యేదో యొక వంటకము గావించి, దేవునికి నివేదన మొనర్చి, దానిని నీాకీయ మేము చూచుచుండఁగా మీారు తినుట కడ్డంకి యుండదుగదా ?

నర—దానికిని నడ్డంకిగలదు. ఆ చిన్నదానిచేతి వంటకమేదియు మేము భక్షింపరాదు. ఏలయున, నాామె నిండుచూలాలు. ఏడు నెలలు దాఁటిన గర్భిణిచేతి యన్నముం గుడువరాదని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. గర్భవతియై యుండి నాభార్యవండినను, నేను దినను.

మాధ—ప్రతివిషయమున నేదో యొక యడ్డుచెప్పుచుఁ గేవల యుక్తిచే మమ్ము నిర్జింపఁజూచుచున్నారు కాఁబోలు. ఇఁక సహింపఁజాలము. మీా శాపతాపములకు వెఱవము. ఉత్తమ బ్రాహ్మణులరు గదా యని, మేము శాంతించి పల్కుకొలఁదిని, మీారు మొండికెత్తుచుంటిరి. మీా రీమెచేతి యన్నముఁ దిన్నఁగాని, మాకు నమ్మకము గల్గదు. నమ్మిక కుదిరినఁ గాని మిమ్ము విడువము.

నర—మీా రంతపట్టుదల వహించి నా నియమమును బాడుసేయఁ దలఁచినప్పుడు, నేనేమి చేయఁగలను ? పిచ్చుకమీాఁదఁ జంద్రాయుధమువలె, మీా క్షాత్రతేజము మమ్ముబోఁటి

పేదబాపనులపైఁ జూపనెంచిన, మాకు గతియేమి యున్నది? కష్టపుఁదీపిచేఁ గానిపనులకైన నొడిగట్టెదము. సరే. తమ యాజ్ఞయే చెల్లింతును గాక. ఈసాయంకాలమున శివాలయమునకు దయచేయుఁడు. అచ్చట మంత్రపుష్పాదులు ముగిసినపిమ్మట నాభార్యవండిన వంటకము స్వామికి నివేదనము చేయఁబడును. దానిని మా యమ్మాయి నాకుఁబెట్టును. నే నద్దానిని మీయందఱసమక్షమున భుజింతును. నా నియమములకడ్డుగాఁ దమ యాజ్ఞయుండుటచే నిట్లు చేయవలసివచ్చెఁగాని, యీమె నాకూఁతురుకాదు గావున, దానిం గప్పిపుచ్చుట కిట్లు లొనరించుచుంటినని తలంపకుందురుగాక. మఱియొకమాఱు వచింతును. ఈచిన్నది నాకొమరిత. ముమ్మాటికి నాకొమరితయే

మాధ—(తనలో) ఈతనివాక్కులు సత్యములనియే తోఁచుచున్నది. పాపము, శ్రోత్రియుఁడగుటచేతనే నాయెదుట భుజించుటకుఁ గొంకఁ బోలు. (ప్రకాశముగా) సరే. దేవాలయమునఁ గలసికొందముగాక. అక్కడ తప్పించుకొనుటకు వీలులేదు సుఁడీ! మీరు మోస మొనరింపఁజూతురేని, మీకుటుంబమెల్ల నాశనమగునుజూఁడీ! జాగ్రత్త.

(నిష్క్రమించును.)

నర—(తనలో) నీ కుటుంబనాశము పూర్తిగా జరగినపిమ్మటఁ గదా, నా కుటుంబనాశముమాట యెరు లెత్తుట? పోమ్ము. నీకు వినాశకాలము సమీపించినదిలే.

పుల్ల—(వారు పూర్తిగా వెళ్లుట నిశ్చయించి) అమ్మయ్య! నాప్రాణము లిప్పుడు గూటఁబడినవి. ఇఁక ముం దెట్టి పోవడియు రాకుండ, నే నీసాయంకాలము లోపల నే మా యింటికి నూడనిం బాడెద.

నారా—ఇంటి కేఁగినను, వారు వెంటవచ్చి తఱుముదురు రేమో! పిచ్చిపుల్లయ్యా! భారమంతయు గురువుగారిదే యని యూరకుండక లేనిపోని వెఱపుల పా లయ్యెద వేమి?

పుల్ల—నారాయణా! నీ కేమి, నీవు పోఁతులాగున నున్నావు. రెండు కొట్టఁగలవు, తినఁగలవు. నేను బక్కవాఁడను. ఒక్కబల్లెపుఁ బోటుతో నా పని సరియగును.

శీల—(నమస్కరించుచు) బాబయ్యగారూ! నా కొఱ కా పాపిచే నెన్నిమాటలం బడితిరి? మహర్షిసత్తముల రగు మీరు నాకై యనృతములు సైతము పల్కితిరి గదా?

నర—అమ్మా! వాని మాటల కేమిలెక్క లెమ్ము! పడ్డవా రెప్పుడును జెడ్డవారు గారుగదా! ఇఁక నన్నృతముల మాట యందువా? నాపల్కిన యనృతములు దోషరహితములు. ఏలయన, నవి స్వార్థ మభిలషించి వచింపఁబడనివి, యుత్తమ గుణశీలయగు నొకయబలాప్రాణరక్షణమునకై చెప్పఁ బడినవి.

నారా—గురువుగా రిందు శుక్రనీతిని బాటించుచున్నారు కాఁబోలు?

పుష్ప—ప్రాణముమీఁదికి వచ్చినప్పుడు శుక్రనీతియు లేదు, గురునీతియు లేదు. కాఁపుదలకుఁ బనికి వచ్చున దేదియో యదియే నీతి.

నర—ఓయీ! స్వప్రయోజనమునకుఁ గాక, పరోపకారార్థమై పలుకఁబడిన యసత్యము, వేయి సత్యవచనములకంటె మేలైనది గదా? తన యెదుటి పొదలలో డాఁగిన చోరులను రాజభటుల కప్పగింపఁజాలకయే కదా, మాండవ్యుఁడు సత్యము పచింపక, తానే రాజదండన మనుభవించెను! "వేయి యబద్ధము లాడియైన నొక్క-యిల్లు నిలువఁబెట్టవలయు" ననెడి లోకోక్తిలోఁ గొంతసారము లేకపోలేదు. అదిగాక, హరిశ్చంద్రునకుఁ గలదని చెప్పఁబడు సత్యవాక్యనియమము నాకు రుచింపదు. "పరిహాసమునకునైనను, మఱికలలోనైనఁ గాక మఱపుననైనన్" హరిశ్చంద్రుఁ డబద్ధమాఁడని చెప్పుదురు. అది యసంభవము. హరిశ్చంద్రుఁడు కేవల సత్యాదర్శపురుషుఁడు. ఎట్టి సమయములందైన నన్నృతమాడనని నియతి గల్గువాఁడు మానుష ధర్మమును వీడినవాఁడే యని చెప్పక తప్పదు. నేఁటి నా యసత్యములు మానుషధర్మమునకుఁ గట్టువడి నుడువఁబడినవి. వానియందు సైతము యథార్థవిషయము లిమిడి యుండక పోలేదు.

కృష్ణ—నాన్నగారూ ! ఈ ధర్మోపన్యాసముల కేమి గాని, దేవాలయమున కేఁగి మీరు శీలవతిదేవి చేతియన్నముం దిందురా ?

నర—సందేహము లేకుండఁ దిందును. ఆ తల్లిచేతి ప్రసాద మే హెచ్చుతగ్గులు లేని యాజగన్నాథ ప్రసాదమే యని నా నమ్మకము.

నారా—ఇదియొక యాపద్ధర్మమని భావింపవచ్చును.

నర—ఆపద్ధర్మమే గాదు, సద్ధర్మము నగును. జగన్నాథ ప్రసాదమును దిన్నప్పుడు మనస్సున బాధ లేకున్న, దీనికిని నుండ రాదు.

కృష్ణ—మనస్సున బాధ లేక పోవచ్చును. కాని సాంఘిక మర్యాద నతిక్రమించినవారమై తోడివారల నిందకు గురి యగుదుమేమో !

నర—కుమారా! నిందవచ్చునని ధర్మము నెఱపకుండుట పంద గుణము.

ఫుల్ల—పందగుణమని చెప్పినవారు, మీ రిందాఁక మాధవ వర్మగారితో నన్ని బొంకులేల బొంకితిరి ?

నర—ఓరి బుద్ధిహీనుఁడా ! వారియెదుట నేను మహాశోత్రి యుఁడ నని నమ్మిక పుట్టునట్లుగాఁ బ్రసంగింపకున్న, మన కార్యమునకు భంగముగాదా ?

నారా—మా యెదుట భోజనమునకు సడ్డంకి లేనివాఁడు, బ్రాహ్మణేతర స్త్రీని దనయింటిలోఁ బెట్టుకొనియే యుండు

నని వా రూహింపవచ్చును. అందుచేత గురువుగా రల్లు బొంకవలసివచ్చెను. అదియు నాపద్ధర్మమే.

నర—నారాయణా! నీవు లెస్సఁగా నూహించితివి. నేఁడు సదాచారసంపన్నునివలె నటించి రేపటినుండి శీలవతీదేవిని బాహాటముగా నా బంతిని బెట్టుకొనియే ప్రతిదినము భోజనము చేయుదును. మీరుకూడ నన్ననుసరింపవలెను.

ఫుల్ల—ఏమో! మా తల్లిదండ్రు లేమందురో! నన్ను వెలిఁ జేయుదురేమో!

నర—నీవే యాదుష్టజనులను వెలివేయుము. నాయనా! కృష్ణా! నీవును బాండిత్యమున నా యంతవాఁడవుగదా? శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములఁ దిరుగవేయుము. వేదాంతము వెంకన్న గారిమస్తుల నెవ్వరినేనిఁ బురికొల్పి మనపై సాంఘిక దండయాత్రం జేయించినచో, మనము వారి నెల్ల హేతువాదములోనికి దింపి యోడింపవలయును. తల్లీ! శీలవతీ! నీవు మీ పిన్నితో లోపలికేఁగి విశ్రమింపుము. నాయనా! నారాయణ! నేఁడు చిన్నిశిష్యులకు నీవే పాఠములం జెప్పుము. నేను నించుకతడవు పుస్తక పరిశోధన మొనరింతుఁగాక.

(అందఱు నిష్క్రమింతురు.)



# శీలవతి.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

రంగము:—శివాలయము.

ప్రవేశము:—పూజారియు, స్వస్తివాచకులును-వారిలో వెంకన్నయు నుండును.

పూజారి—విప్రపుంగవులారా! మంత్రపుష్పవచనముల నేకరువు పెట్టుఁడు.

విప్ర—అదిగో, మఱికొందఱు బ్రాహ్మణులు వచ్చుచున్నారు. వారు కూడ రానిమ్ము.

(ప్రవేశము:—మాధవవర్మాదులు)

నర—అయ్యా! కానిండు. (తానే మొదలుపెట్టును. అందఱుఁ గలసి మంత్రపఠన మొనరింతురు.)

పూజా—అయ్యా! దయచేసి కూర్చుండుఁడు. రుద్రపాదము లందుకొని యవల స్వామిప్రసాదమును స్వీకరింతురుగాక

నర—అటులే చేయుదుము ఓయీ! అర్చకుఁడా! వీరు శ్రీ పూసపాటి మాధవవర్మ మహారాజుగారు. శత్రుం జయముఁగాంచి మహానందముతో నీప్రాంతములకు వచ్చిరి. స్వామివారికి గొప్ప కానుక లర్పింపుఁడని వారి నర్థింపుము.

పూజా—ఆలాగుననా? మహాభాగ్యము! మహారాజా! మా స్వామి కడు పేదవాఁడు, తమవంటి ప్రభువుల పోషణములో నుండఁ దగ్గవాఁడు తమపేరిమీఁద నేఁటేటఁ నుత్సవములు జరపెదము. కొన్ని మాన్యములు కానుకగా దయచేయ వేఁడెదను.

మాధ—మీ స్వామికి మాన్యములు లేవా?

పూజా—లేవు, మహాప్రభూ! మా గ్రామము తురుష్క రాజ్యములో నిది. తురుష్కప్రభువులు హిందూదేవాలయములపట్ల విముఖతయే వహింతురు గదా? తమబోఁటి మహారాజులే మా చంద్రశేఖరస్వామి నేలవలయు.

మాధ—మీ తురుష్క ప్రభువులు మాకు విరోధులు. కావున, మే మెట్టి సాహాయ్యమును జేయము. అదిగాక, మే మిచ్చటికి వేఱు పనిమీఁద వచ్చితిమి.

నర—అర్చకా! స్వామివారిపై మానవమాత్రు నొక్కనిఁ గటాక్షముఁపు మందు వేల? అంత మూాధుఁడవేమి? సమస్తభూతములకు సృష్టి, స్థితి, లయకారణుండగు నా

పరమాత్మయే యెల్లరఁ బాలింపవలయుఁ గదా ? ఏల యట్టులు పల్కెదవు ?

కృష్ణ—అర్చకుని మాధ్యమట్లుండ, శ్రీమహారాజుగారు విరోధి రాష్ట్రములో నున్న దేవుఁడు కూడఁ దమకుఁ విరోధియే యని యెంచుట—యేమనవలయు ?—వింతగా నున్నదే! ఇంక మా దేవుఁ డేమాన్యములును లేని సామాన్యుఁడుగా నుంటయే మేలని తోఁచుచున్నది.

మాధ—ఓయీ! నీవు నీ తండ్రిని మించు వానివలె నున్నావే! దేవుఁడు మాకు విరోధికాఁడు. వానిపేరు చెప్పి తిను మీ రందఱు మాకు విరోధులు. కావున, నే నెట్టి సాయమును జేయఁ దలఁపను.

నర— కుమారా ! ప్రభువులతో మనకు వాదము సేయుట తగదు. అయ్యా ! అర్చకా ! నీవు శీఘ్రముగా దేవప్రసాదముం బంచిపెట్టుము. మాకుఁ గొంత పనియున్నది.

పూజా—(అందఱకు రుద్రపాదము లిచ్చి యొక్కొక మారేడుదళ మిచ్చును. అవల సాతాళించిన సెనగలు పంచిపెట్టును.)

మాధ—బ్రాహ్మణులారా ! ఇంచుకసేపు కూర్చుండుఁడు. (అందఱుఁ గూర్చుండుదురు.) ఆ యెదుట నిలిచియున్న కాంత యీ నరసన్నభట్టారకుని కూఁతురఁట. నిజమా ? మీ రెఱుఁగుదురా ?

బ్రాహ్మ—(గుసగుస లాడుదురు.)

మాధ—ఏమి, మాటాడరు? కూఁతురు కాదా?

బ్రాహ్మ—ప్రభూ! నరసన్న భట్టారకులు సర్వత్రపూజ్యులు. వారిమాట సంశయింప నేల?

వెంక—ఇది మాత్రము సంశయింపఁ దగ్గదే. ఆమె యాత్రని కొమరిత గాదు. నే నెఱుఁగుదును.

కృష్ణ—ఛీ! నోరుమూయుము, పెద్దలను ధిక్కరింతువటరా?

వెంక—పెద్దలే బుద్ధులు లేక ఘోరముగా నన్నృతము లాడు చుండ నూరకుండ వలెనా? ఏమయ్యా! ఊరివా రెవ్వరును మాటాడ రేమి?

బ్రాహ్మ—వెంకన్నా! నీవు గురుజనుల నెదురొక్కనఁ బూనుట తప్పు.

కృష్ణ—ఆలాగున గడ్డిపెట్టుఁడు.

నర—కుమారా! వానిమాటలు పాటింపనేల? ఒక్కఁ డాడు మాట యొప్పదు గదా? మహారాజా! ఇప్పుడు న న్నేమిచేయు మందురు?

మాధ—ఇందఱ యెదుట నామె వడ్డింపఁగా నీ వన్నముం గుడువవలయును.

నర—చిత్త మటులే యొనర్తును. అమ్మా! మీ యమ్మ వండి తెచ్చిన పదార్థము లాకవిస్తరిలో వడ్డించి యా యెదుటి గదిలో నుంపుము. ఇది నా భోజనవేళ కాకపోయినను,

మహారాజాజ్ఞ నెఱవేర్పకున్నఁ బ్రాణభంగమే కలుగ వచ్చును గావున, నేను భుజింపక తప్పని దన్యేను. పద.

లచ్చ—బిడ్డా! అవిగో వంటకము లామూలఁ బెట్టితిని. మీా బాబయ్యగారికి వడ్డింపుము, తల్లీ!

సర—సోదరులారా! నా కూఁతురు పూర్ణగర్భవతియాట చే నామెచేతి వంటకము మా యింటఁ గుడువ నిష్టపడకుంటిని. మాధవవర్మ మహారాజులు తమ సమక్షమున నామె చేతి కూఁడుఁ దినుమనిరి. అందులకై యిక్కడఁ గూడితిమి. నే నిదే యామె పెట్టు నన్నముఁ దినుచున్నాను. వచ్చి పరీక్షింపుఁడు. (పోవును.)

బ్రాహ్మ 1—(అపవారించి) ఎంత సాహసమున కొడిగట్టి నాఁడు! పరమ ఛ్ఛాందసుఁడే!

బ్రాహ్మ 2—(అపవారించి) ప్రాణములమీాఁదికి వచ్చినప్పుడు ఛాందసుఁడు మాత్రమేమి చేయఁగలఁడు?

బ్రాహ్మ 3—(అపవారించి) పూర్వము రక్కసులు మునుల నోళ్లలోఁ గుక్కమాంసము బలవంతముగాఁ గ్రుక్కిరని చెప్ప వినమా? అటులే మన భట్టారకుని గతియైనది కాఁబోలు.

మాధ—(పరీక్షించి వచ్చి) ఆహా! యితఁడు కొంకక భుజించు చున్నాఁడు. ఆమె యితని కూఁతురే. సందియములేదు.

(ప్రకాశముగా) ఏమయ్యా! వెంకన్నగారూ! ఇప్పు డే మందురు? మీరు రుజువు చేయఁ గల మంటిరే! ఏమయ్యె మీా రుజువులు?

వెంక—ఘోరకలి వచ్చినది. ఊరివా రందఱు బెల్లముం గొట్టినరాయివలెఁ గిమ్మన కూరకుండిరి. నే నొక్కఁడ నార్చినఁ బ్రయోజనమేమి? నేను మరలఁ జెప్పుచున్నాను. ఆమె యితని కూఁతురుగాదు.

మాధ—మీా మాట మేము నమ్మము. నమ్మి మేము కార్యా చరణముఁ గావింతుమేని, పాపముల పాలగుదుము

(నరసన్న భోజనము ముగించి వచ్చును.)

నర—అయ్యా! తమ పరీక్ష ముగిసెనా? నా కొడుకులు, శిష్యులుఁ గూడ మా యమ్మాయిచేతి తిండి తినవలయునా?

మాధ—అక్కఱలేదు. నీవు తింటి వది చాలును. ఒక్కఁడు నీకు వ్యతిరేకముగాఁ బలుకుచున్నను, గ్రామస్థు లెల్లరు నీ మాటాడుచుండిరి. అయినను, మామనస్సులో నేదియో సందేహాము పీడించుచునే యున్నది. ఏమైనఁ గానిమ్ము. నిన్ను విడువ నిశ్చయించితిమి. ఈమె ప్రసవించిన పిమ్మటఁ బుట్టిన బిడ్డ యే పోల్కినుండునో పరికింపవలసియున్నది. ప్రకృతమున మిమ్ము విడుచుచున్నాము. పొండు. మేమును బోయెదము.

(నిష్క్రమించుచుండును.)

నర—చిత్తము–(తనలో) తడవ మిన్నాగుడైన దన్నట్లు, శీలవతికిఁ బుట్టిన శిశువు నీ పాలిటి శత్రువై నిన్నుఁ బరిమార్ప నున్నప్పుడు గదా నీ పరీక్షలు సాగివచ్చుట? పొమ్ము, నీకుఁ బోఁగాలము దాపించినది, లెమ్ము.

వెంక—(తనలో) నానూటపదా ర్లీయకుండఁగనే వీఁడు పోవుచున్నాఁడే! పైకిఁ జెప్పకొన్న, నవ్వులపా లగుదును. అయినను బిలుతును గాక. (ప్రకాశముగా) అయ్యా! మాధవ వర్మ మహారాజుగారూ! నాకుఁ జేసిన వాగ్దానము మాట మఱచితిరా?

మాధ—(పోవుచు నాఁగి) జగన్నాథా! ఇతనిం దగినవిధిని బహూకరింపుము. (కనుసైఁగతోఁ దన్నుమని సూచించును)

జగ—చిత్తము. రావయ్యా! బ్రాహ్మణుఁడా!

వెంక—(దగ్గఱకుఁ బోవును. అతఁడు చెంప రెండు చెపేట ములం దీయును.) ఔరా! దుష్టా! విశ్వాసఘాతకా! నన్నుఁ గొట్టెదవురా? ఓయీ, దీక్షితులు! అన్నప్ప సోమయాజులుగారూ! సూరయ్యబావా! రండు. ఈ దురాగ్రస్థునిఁ బట్టుఁడు. పాఱిపోవుచున్నాఁడు!

బ్రాహ్మ—వెంకన్నా! ఊరకుండుము లేనిపోని జోక్యము నీవేల కలుగఁ జేసికొంటివి? ధనాధికార మదాంధు లగు వారితో నీకు స్నేహమేల?

వెంక—(లెంపలు తడవుకొనుచు) ఎందులకో చెప్పెద నుండుండుఁడు నరసన్నా! ఇందఱిలో శూద్రహస్తమునఁ గూడు తింటవిగదా? చూడు, ని న్నేమిచేయింతునో! పందలారా! ఆ యాఁడుది వీని తనయయాఁటరా? ధర్మాచరణముపట్ల మీకింత భయమేలరా?

బ్రాహ్మ—ఊరకుండుము. గురువుల నెదిరింపరాదు.

వెంక—గురువు లనఁబడువారే తెరువులు తప్పుచుండఁ జూచి సహించి యూరకుందురా? మీ మతము మంటఁగలిసెనా? రే పేమొగముఁ బెట్టుకొని జాతిభ్రష్టుఁడైన యీకపట గురుని మీ యిండ్లకు భోజనములకుఁ బిలుతురో, మీ రెట్లు వీనియింటికిఁ గుడువఁబోయెదరో, చూతునుగాక! ఒక్క ద్రోహిమూలమున నగ్రహారమంతయు నడుగంటి పోవలసినదే?

నర—ఓరీ! తుంటరీ! పేలకు. ద్రోహివి నీవో, నేనో, కొలఁది దినములలోనే వెల్లడియగును. దేశద్రోహివి, మతద్రోహివి, జాతిద్రోహివి నీవే యగుదువురా? నీవే మాదిగవై యొక డప్పుఁ బుచ్చుకొని, యూరంతయు నాకృత్యముంగూర్చి చెప్పుచుఁ జాటింపుము. అప్పుడు నీపక్షమున నెవ్వరేని చేరుదురేని, వారితోఁ గలసి నన్ను సంఘమునుండి బహిష్కరింపుము. ఓరి, బ్రాహ్మణబ్రువా!

నీవు కూడ నన్నధిక్షేపించువాఁడవే? బ్రాహ్మణతేజస్సు నీమొగమునం దేకోశమునను లేదాయె. ఓనమాలైనరాని విద్యాధికుండవై యుంటివి. ఏమి చూచుకొనిరా, నీకీ గర్వము? ముండమునుపువలెఁ బెద్దలార్జించి యిచ్చిన భూవసతి యించుక గలదనియా యీపెకలిపాటు? ఓరి యపరియోజకుఁడా! ఆముదుపు మూలఁబడనిమ్ము. నీపని యే మగునో? నీ తుచ్ఛధనమున కాసించి యేనల్వు రైదుగురో నీవెంటఁ దిరుగుచున్నారనియా యీయెగురు? మీ రందఱును గూడి మమ్ము మీయిండ్లకు భోజనములకుఁ బిలువకున్న, మేము తిండిలేక తిరిప మెత్తుదుమనుకొంటివా! మాబుజువర్తనమే వజ్రకవచమై, మాదృఢసంకల్పములే మంత్రములై, మా యమోఘవాక్కులే యస్త్రములై, నిన్ను, నీమిత్రులను, ముంచి చించి వైచునురా! కాచికొనుము. కుమారీ కుమారులారా! రండు. పోవుదము.

(నిష్క్రమింతురు)

(అందఱు నివ్వెఱపడి నిలి[illegible])

## ద్వితీయరంగము.



(రంగము:—అగ్రహారము చివరనుండు నుపవనపరిసరభూమి.)

ప్రవేశము:—వడిగానడచుచు వెంకన్న, వాని కెదుటిదిక్కు నుండి యన్నప్ప సోమయాజి- నెత్తిమీఁద మూట, చంకను దర్భాసనము, మెడలో నుపవస్త్రమునకుఁ గట్టఁబడి వ్రేలాడు జారీచెంబు, మున్నగువానితో-వచ్చును.

అన్న—ఎక్కడికోయి వెంకన్న, యింత వడిగాఁ బోవుచున్నావు?

వెంక—సోమయాజులుగారూ! మీకుఁ దెలియనే లేదా, నేఁటి సభావిషయము?

అన్న—నే నీనడుమ బెజవాడలో వంకాయల వీరన్నగారి యింట జరిగిన పెండ్లికిఁ బోయియుంటిని. వారి కుటుంబమునకు నేనే బ్రహ్మనౌటచే నీ వారమంతయు నందే యుండవలసి వచ్చెను. ఆకారణమున, మన యూరివార్త లెవ్వియుఁ దెలియవయ్యె. సభయేమిటి? అది యెందుంగూర్చి?

వెంక—అలాగైన, మీ కీయూరి గడబిడలెవ్వియుఁ దెలియవన్నమాటయే.

అన్న—ఏమియుఁ దెలియవు. ఇప్పుడేమి మునిఁగినది? ఏదైన శాస్త్రవాదము వచ్చెనా?

వెంక—శాస్త్రివాదము లేదు, గీస్త్రివాదములేదు. మా నరసన్నభట్టారకుఁ డీనడుమ నొక వెలమవారి చిన్నదానిని గూఁతుఁగాఁ గైకొని పెంచుచు, నామెను దనపంక్తిని బెట్టుకొని తిండి తినుచున్నాఁడు.

అన్న—ఏది? మీతోడి యల్లుఁడైన నరసన్నభట్టే? శుద్ధశ్రోత్రియకుటుంబములోనివాఁడే! అనూచానుఁడే! వాని కేమి పోఁగాలము వచ్చినది?

వెంక—పోఁగాలమే వచ్చినది. వానితోఁబాటు మన సనాతన హిందూమతము కూడఁ బోవుకాలము వచ్చినది.

అన్న—సరే వాఁడుశూద్రాన్నము తినుచున్నాఁడేయనుము. ఇప్పుడు సభ యెందులకు?

వెంక—మన సోమన్న, పొట్టి రామన్న, దీక్షితులు, మీ తమ్ముఁడు లింగప్ప, సుబ్బయ్య, నేను, మఱి కొందఱును జేరి యొకసభఁ జేసి, నరసన్నను బహిరంగముగా హిందూ సంఘములో నుండి వెలిఁజేయ నిశ్చయించితిమి.

అన్న—ఓహో! అదియా సమాచారము? మీరు సభఁ జేయుదురు. కాని గ్రామస్థు లెల్లరు మీతో నేకీభవింతురా? నరసన్న యపరబృహస్పతి యని యందఱు నమ్ముచున్నారే! మీకు పట్టి కంఠశోషమే గాని, తగిన ప్రయోజన ముండదేమో?

వెంక—నేను, మాయప్ప వెంకమ్మయు, నింటింటికిఁ బోయి వారి దుర్వృత్తియెల్ల వెల్లడించితిమి. ఇంచు మించుగా గ్రామమంతయు మన వశమైనదనియే చెప్పవచ్చును. నర సన్నకు వాని మఱిఁది కృష్ణయ్య యొక్కఁడే తోడుగా నుండును. మఱి యెవ్వఁడును రాఁడు. కావున, మన సభ జయప్రదముగా జరుగును.

అన్న—నరసన్నకుఁ గృష్ణయ్య తోడుగానుండుటలో నాశ్చర్య మేమున్నది? నరసన్న వెలమకాంత చేతికూఁడు మాత్రమే తిని యుండవచ్చును. కృష్ణయ్య యంతకంటెను ఘోర కార్యములను జేయుచున్నాఁడు.

వెంక—కేచిగాని పిల్లలకుఁ జదువు చెప్పుటయే గాదా వీా తలఁపులో నున్నది ?

అన్న—అది యొక్కటియా? ఈ నడుమ, "వాల్మీకి కుల సంఘ" మను పేరితోఁ గొంతమంది పంచమబాలురను బోగుచేసి, వారికి జ్ఞానబోధ చేయుచున్నాఁడు. వారి కొఱ కెన్నియో పాటలను బద్యములను రచించి, వారికి నేర్పుచున్నాఁడు. వారిని వెంటఁబెట్టుకొని భజనలు సలు పుచు నూరివెంబడిఁ దిరుగుచున్నాఁడు.

వెంక—ఈ యారేఁగుటలను గూర్చి నే నెఱుఁగను. కాని, బోగపుఁబడుచులకుఁ బెండ్లిండ్లుచేయించు సంఘ మొకటి

యేర్పాటుచేసి, యందుఁ దాను నాయకుఁడై పనిఁ జేయు చున్నాఁడని మాత్రము వింటిని. అట్లయిన, వాఁడు కూడ భ్రష్టుఁడై నాఁ డన్నమాటయే.

అన్న—వాని భ్రష్టత కేమిగాని, భోగము వాండ్రకుఁ బెండ్లిండ్లా? అటులైన, నింక దేవాలయములలో నేకాంత సేవ యెట్లు?

వెంక—ఏకాంత సేవ కేకాంతలో దొరకక పోవుదురా? వారి సొంతకాంతలే కొంతపనిని జరుపుదురు లెండు. మ్లేచ్ఛులతో సావాసము లెచ్చుకొలఁది, వాఁడు బొత్తిగఁ జెడగుచున్నాఁడు.

అన్న—ఆ నడుమ మన తహసీలుదారు సాహేబు, జమాబందికై యీ యూరికి వచ్చినప్పుడు, కృష్ణయ్య, వాని గుడారములోనికి వెళ్లి, 'మెహానతు'కొఱకు నరసన్నభట్టు చేయించి పంపిన పిండివంటలు, వానితోఁ గలసి యొక్కపళ్లెరమునుండియే గ్రహించి, భుజించెనని మన కరణకుఁడు చెప్పినాఁడు.

వెంక—కలికాల మహిమ! దేశము పాడైపోవుచున్నది. వర్ణసాంకర్యమగు దినములు వచ్చినవి. ఆ కారణముననే మన మొక సభఁజేసి, నరసన్నను, వాని కుటుంబమును, నగత్యమైనఁ గృష్ణయ్యను, సంఘమునుండి బహిష్కరింపఁగా

వలయును. ఇందు మీ తోడ్పాటు కూడ నే నభిలషించు చున్నాను.

వెంక—వెంకన్నా! మా తమ్ముఁడు నీకుఁ బ్రాణస్నేహితుఁడై యున్నట సాయపడుచుండ, నేను మాత్రము వేఱుగా నుందునా? అదిగాక, నరసన్న నాకంటె నీ కెక్కువ ముఖ్యబంధువు గదా? నీవే యతని పట్ల మొగమోట లేక వర్తించుచుండ, నాకాజంకు? వైదికవృత్తిలో లేని నీవే మత రక్షణమునం దంతపట్టుదల వహింపఁగాఁ గేవల వైదిక వృత్తిలో నున్నవాఁడను, గ్రతుసంస్కార మొందిన నిత్యాగ్నిహోత్రిని, నే నూరకుందునా? నీకు, నాకు, ముఖ్యమిత్రులును జుట్టాలు నగు సోమన్న మున్నగువార లందఱు మనకుఁ దోడుగా నుండిరి గదా? అటులే కానిమ్ము.

వెంక—విశేష కార్యమేదియుఁ జేయ నక్కఱలేదు. ఇఁక నొకగంటలో జరగఁబోవు సభలో మీరు కూడ నుపన్య సింపవలెను. మత సంరక్షణ మావశ్యకమని సభ్యుల కందఱకు లెస్సఁగా బోధింపవలయును.

అన్న—అలాగుననే చేయుదును. కాని, నాకు శాస్త్రపరి చయము విశేషముగా లేదే! ఆ నరసన్నగాని, యతని కుమారుఁడు గాని, వచ్చి శాస్త్రవాదములోనికి దిగినచో, మనము నిర్జితుల మగుదుము. ఏ శాస్త్రవాద మక్కఱ

లేకయే, కేవల యుక్తివాదముతోనే కృష్ణయ్య మనల నోడింపఁగలఁడు. మన మీ సభయు, గిభయు విడిచి, లోలోననే ప్రసంగించి, యందఱం ద్రిప్పి వేయుట మేలేమో యని నాకుఁ దోఁచుచున్నది.

వెంక—మీరు చెప్పిన యుపదేశము కూడ మంచిదే. కాని యీ సభకు నరసన్నగాని, యతని పరివారము గాని రారు. ఏలయన, వారిని మే మాహ్వానింపలేదు.

అన్న—ఆహ్వానింపకున్నను వారు వచ్చినచో, నీవేమి చేయుదువు ?

వెంక—ఎంతో మర్యాదతో నాహ్వానించిన సభలకే వారు రారు. దీనికి వత్తురా ? రారు. ముమ్మాటికి రారు. ఒక వేళ వచ్చినను, వారికిఁ దగిన ప్రత్యుత్తరము లీయఁగలుగు వారు మనలోఁ గొంద ఱున్నారు లెమ్ము.

అన్న—సరే. నీ కంతధైర్య మున్నప్పుడు, నేను బిఱికిమందు పోయనేల ? ఎన్నిగంటల కాసభ ? ఎక్కడ జరగును ? సభ కధ్యక్షు లెవ్వరు ?

వెంక—ఇఁక నొకగంటలో నా యెదుటి తోఁటలోనే సభ జరగును. దానికి బ్రహ్మశ్రీ వంక వెంకప్పశాస్త్రిగా రధ్యక్షులుగానుందురు. మీరును త్వరితగతి నింటికేఁగి, మాటముల్లెలు దించి, మీ సాలువు వైచికొని, మకరకుండలములం దాల్చి, పరిపూర్ణలంకారములతో సభకు దయ

చేయుఁడు. ఇఁక విశేష ప్రసంగమునకుఁ గాలము చాలదు. నాకు సెలవిండు.

అన్న—వంక లేనివారికే నరసన్న వంకలు పెట్టును. ఇఁక వంక వారేయైనఁ జెప్పవలెనా? సరే. కానిమ్ము. పద. (వెంకన్న యేఁగుచుఁ దనలో) ఈ సభయేదో యొక ముప్పునకే వచ్చినది. ఆ నరసన్నభట్టు సామాన్యుఁడు గాఁడు. అతఁడు కుమార శిష్యాది పరివారముతో మా మీఁదికి దాడివచ్చి, మా మర్మములెల్ల నుచ్చిపోవునట్లు వాక్యాస్త్రములం బ్రయోగించునేమో! కృష్ణసూరియు, నతని మేనమామయు గొప్పకవులు కూడ నగుదురు. మా ఛాందసపుటాచారము లన్నియు నెగతాళిఁ జేయుచుఁ బద్యములుగా రచించి మమ్ము నలువురిలోఁ జిన్నవుత్తురేమో! ఈ వెంకన్న, కేవల మత్సరభావముతో నరసన్నపై దండెత్తినట్లు తోఁచుచున్నది. మా తమ్ముఁడు, వెంకన్న వలన బహూళోపకారములం బొందుచు నొక్కవీధిలోనే కాఁపురమున్నవాఁడు గావున, వెంకన్నమాట దాటక మానఁడు. నేను గూడ నటులే చేసిన, నగుఁబాట్లపాలగుదునేమో! కానిమ్ము. చూతుఁగాక! అలంకరించుకొని వేగముగా వచ్చెదను.

(నిష్క్రమించును.)



## తృతీయరంగము



రంగము:—ఊరి బయటనున్న తోఁట.

పరివేశము:—సభాస్తారులై యున్న వెంకన్న మొదలగువారు. సభ్యు లెల్లరుఁ జాఁపలపైఁ గూరుచుండి యుందురు. అందు నడుమగా నొక యెత్తైనపీఠ మధ్యక్షునికై యుంపఁబడును.

దీక్షి—(లేచి నిలువఁబడి) సభాస్థారులారా! ఆర్యులారా! నేఁటి సభకు బ్రహ్మశ్రీ వంక వెంకప్పశాస్త్రి గారగ్రాస నాధిపతులుగా నుందురని మీ కింతకుమున్నే కార్యదర్శి తెలియఁజేసియుండెను: శాస్త్రులవారి నెఱుఁగనివారీప్రాంతముల నుండరు. ఇప్పుడు బయలుదేఱు తరుణవయస్కులగు పండితులలోఁ బెక్కండ్రు వారిశిష్యులే. వ్యాకరణ శాస్త్రమందు వారి కపారపాండిత్య మున్నదనుట జగద్విదితమేగదా? అదిగాక వారు శ్రౌతములోఁ బారముం జూచిరి. జ్యోతిషములోఁ జాలఁ బ్రజ్ఞగలిగియుండిరి. మన సనాతనహిందూధర్మ మనిన, వారికిఁ గల యభిమానము మిగులఁ బ్రస్తుతింపఁదగ్గది. అదియే వారి నీ సభాధిపత్యము నకు రావించినది వారికట్టి శాస్త్రపరిజ్ఞాన ముండుటయే గాక, రాజకీయ విషయములందును బ్రవేశముగలదు. వారు విశేష ధనవంతులగుటకు వారి రాజకీయ నిర్వాహణ

శక్తియే యని మీకుఁ దెలిసిన విషయమే. అట్టి ప్రజ్ఞా ధురంధరులు నేఁ డధ్యక్షత వహించుట మన భాగ్యమనక తప్పదు. మనము పూనిన కార్యము తప్పక జయము గాంచుననుటకు, వారి రాకయే నిదర్శనము. ఇంకను గాలహరణముం జేసి మిమ్ము విసిగింపక, నేనిఁక వారి నగ్రస్థానమలంకరింపుఁడని మీ యందఱకు మాఱుగాఁ బ్రార్థించుచున్నాను. (వెంకప్పగారు లేచి యగ్రపీఠ మలంకరింతురు. వెంకన్నగారు పూలమాల యధ్యక్షుని కంఠమున నలంకరింతురు. సభ్యులు కరతాళధ్వను లొనర్తురు.)

అధ్య—(లేచి) మహాశయులారా ? నేఁడు మీరు నన్నీ యున్నతపదవికి రావించి గావించిన గౌరవమునకుఁ గడుం గడుఁ గృతజ్ఞుఁడను. కాని నాపై మీరు వైచిన కార్యభారము మాత్రము దుర్భరమైనది. నరసన్న భట్టారకుని బహుళశాస్త్రజ్ఞానము, పాండితీవిలసనము, నిరర్గళ వాక్పాటవము, మున్నగుశక్తు లెల్ల రెఱింగినవియే. అతని కన్నిటందగిన యౌరసుఁడని చెప్పఁదగ్గవాఁ డతని కుమారుఁడు, కవిసార్వభౌమ బిరుదాంచితుఁడు, కృష్ణసూరి. వారిపై మోపఁబడిన నిందంగూర్చి చర్చించుట యనఁగా నాబోఁటివానికిని సాహస మనక తప్పదు. భట్టారకుఁ డెంతటి ఘనుఁడుఁ బూజనీయుఁడు, నైనను నాతనిం గూర్చి చింతింపవలసినది మన మతాచార విషయమగుటచే,

సాహసింపక తప్పని దయ్యెను. మన బ్రాహ్మకులము వర్ణములలో నగ్రగణ్యము. 'బ్రాహ్మణోస్య ముఖమాసీత్' అని వేదము చెప్పుచున్నది. బ్రాహ్మణులు బ్రహ్మదేవుని ముఖమునుండి పుట్టినవా రగుటచేఁ బూజ కగ్రస్థాన మందుచున్నారు. శమము, దమము, తపస్సు, శుచిత్వము, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యబుద్ధి-ఇవి బ్రాహ్మణుల కుండవలసిన ముఖ్యగుణములు. అవి సద్బ్రాహ్మణునకుఁ దోడనే జనించును. పైగుణములలో నొక్కటిలోటు వచ్చినను, విప్రత్వము చెడిపోయిన దనియే చెప్పవచ్చును. వానిలో శుచిత్వము ద్విజుల కత్యగత్యము. దానిని గాపాడుటకొఱకే మనయార్యులు స్నానసంధ్యాద్యనుష్ఠానములు, భోజనాది సమయముల దృష్టిదోషములు తగులరాదను నియమములు, మున్నగునవి యేర్పాటుచేసిరి. ఆ నియమములఁ బాటింపనివారిని బ్రతి యుగమునందును సంఘము బహిష్కరించుచునే వచ్చుచున్నది. హిందూమత మగ్నిహోత్రమువంటిది. దానిం జెనక సమకట్టువారి నది మాడ్చివైవక మానదు. దానికి మొగమోటలు లేవు. అట్లుండునది గావుననే యది, బౌద్ధాది పాషండమతము లెన్ని దానిపై దాడిసల్పినను, జలింపక నేఁటికిని నిలిచి యున్నది. ఇతర మతములు, తమ ధర్మము లితరులకెల్ల బోధించి వారిని దమతోఁ గలిపికొను నియమములు

గలవి. మన మతమన్ననో, యది యితరులకు బోధ సేయ వచ్చును. కాని, వారిని దనలోఁ జేర్చుకొనదు. పైఁగాఁ దన్నుఁ దిరస్కరించిన తనవానినే యది విడనాడు స్వభావము గలది. ఇంకను హిందూమత ప్రాశస్త్యముం గూర్చి యెన్నియో సద్విషయములు చెప్పవచ్చును. కాని కాలము చాలదు. మన భావికార్యమున కడ్డుగల్గును.

ఇప్పుడు మన మాచరింపవలసిన ధర్మము శ్రీ నరసన్న భట్టారకుని చర్యం గూర్చి చర్చించుట. దానిని మతాభిమానులు, జాత్యభిమానులు, నగు మీకే విడిచి, మీ యుపన్యాసములు ముగిసినతర్వాత నాకుఁ దోఁచిన మాటలు కొన్ని చెప్పి ముగింతును. ప్రకృతవిషయమును బూర్తిగా నెఱింగియున్న బ్రహ్మశ్రీ వేదాంతము వెంకన్న గారిని, దా మెఱిఁగినంతవట్టు, నరసన్నభట్టుగారిం గూర్చి, సభ్యుల కెఱింగింపఁ గోరుచున్నాను. (కూర్చుండును.)

వెంక—(కలఁతపడుచు లేచి, రొండిని బెట్టుకొన్న తాటాకుల కట్టను వడఁకుచు విప్పి) ఆర్యులారా! నేను విశేష విద్యావంతుఁడను గానని మీకుఁ దెలిసినదే కదా? కావున—

(సభలోఁ గలకలము.)

సభ్యు—అయ్యా! మీ యల్పకంఠము మాకు వినఁబడకున్నది. అదిగాక మీరు బొత్తిగా హ్రస్వాంగులరు. కావున మాకుఁ గనఁబడకుంటిరి. మీరు చెప్పఁగలిగినచో, నొక

మొత్తయిన బల్లపై నిల్చి, బిగ్గఱగా నెల్లరకు
నట్లులు చెప్పఁడు. అట్లు కాకయున్న, మీ తాళపత్త్రిము
లింకొకని కిచ్చి చదివింపుఁడు. అంతే గాని, మ మ్మూరక
బాధింపకుఁడు.

వెంక—(వడఁకు నెలుంగుతోఁ) అలాగైన, నాయుపన్యాసము
నూ బావగారగు దీక్షితుఁడుగారిచేఁ జదివించెదను. అను
మతి దయచేయఁ గోరెద. నా యసమర్థతకు క్షమింప
వేఁడుచున్నానుఁ. (తాళపత్త్రిములు దీక్షితుని చేతి
కిచ్చును)

సభ్య 2—అయ్యా! మీరు సర్వవిధముల నసమర్థులరని
మాకుఁ దెలియును. కావున, క్షమించుచున్నాము. (వెంకన్న
సిగ్గుపడి కూర్చుండును)

దీక్షి—ఆర్యవర్యులారా! సోదరులారా! వెంకన్న బావగారి
కుటుంబమునకు నేను బురోహింతుండ నగుటచే, వారు
తా మొనరిచు పితృకర్మాదులయందుం బలె, నేఁటి సభా
కార్యమునందును మంత్రి తంత్రిములెల్ల నాకే విడిచిపెట్టి,
తాము విశ్రాంతితోఁ బీఠ మలంకరింప నెంచిరి. వారిపని
"మమ" యనుట మాత్రిమె.

(సభ్యులు హర్షముతోఁ గరతాళ ధ్వను లొనర్తురు.)
ఇఁక వారి యుపన్యాసముఁ జదివెదను. ఇందలి దోషా
దోషములు నావి కావు, వానికి నే నుత్తరవాదిని గాను.

సభ—కాకేమి? వారివైపునఁ బనిచేయుచున్నారు. వారిచ్చు "వైపుల" గ్రహించుచున్నారు. వలయుచో మఱి కొంత హెచ్చుగాఁ బుచ్చుకొనుఁడు.

అధ్య—కూర్చుండుఁడు, కూర్చుండుఁడు.

దీక్షి—నేను గూడ నుత్తరవాదినే యనుఁడు. వినుఁడు. వింజమూరి నరసన్నభట్టు నాపక్షకుఁడని మీరెల్ల రెఱుంగుదురు.

సభ్య 4—ఆ సంగతి మాకుఁ దెలియదే! ఇది క్రొత్తవిషయమే! (ఎల్లరు నవ్వుదురు.)

దీక్షి—అయ్యా! మీ రిట్లు మాటమాటకు నన్నధిక్షేపించుచున్న, నేను గిమ్మనక కూర్చుండెదను. (కూర్చుండఁబోవుచు) వెంకన్నబావగారూ! మీరే చదువుకొనుఁడు.

సభ్య 4—కూర్చుండు మయ్యా! ఎవరికిఁ గావలయు? అంత మాత్రపు శాంతము లేనివాఁడ వొక మహానుభావునిపై నింద మోపి యెట్లు నిలువఁగలవు?

అధ్య—సోదరులారా! ఉపన్యాసకులు చెప్పునది సాంతముగా విని, యవల మీ విమర్శనములు చేయుఁడు. మధ్యమధ్యమున నాటంకపఱుప న్యాయముగాదు. దయతోఁ గూరుచుండుఁడు. దీక్షితుఁడుగారూ! మీరు కానిండు.

దీక్షి—అతఁడు గొప్పపండితుఁ డనియు మీకుఁ దెలియును. కాని, యతఁ డీనడుమ నొనర్చిన కృత్యము మిగుల శోచనీయమై యున్నది. పద్మనాయక కులస్థురాలు, రావు

వారి కోడలు, నగు నొకయిల్లాలి కాతఁ డాశ్రయ మిచ్చు టెల్ల రెఱుఁగుదురు. అది యెంతయుఁ బ్రశంసనీయమే. కాని, యతఁ డంతట. నూరకుండక యామె చేతికూఁడు దినుచు, నామెను దన పంక్తినే పెట్టుకొని నిరంతరము భుజించుచున్నాఁడు. అతని పొలముపాలికాఁ పగు రేచి గాని పిల్లలకుఁ జదువు చెప్పుచు నతని మఱఁది, కృష్ణయ్య, పంచమకులోద్ధరణమునకై పాటుపడు చున్నాఁడు. ఇవి యెల్ల బ్రాహ్మణాచారములకు విరుద్ధములని మీకు వేఱుగఁ జెప్ప నక్కఱయే లేదు. అట్టివారు పండితులనియు బంధు గులనియు మనము యోజింపక, మన హిందూసంఘము నుండి బహిష్కరించి మతము నిలువఁ బెట్టవలసిన ధర్మము మనపై నున్నది. శరీరావయవములలో నొకటి కుళ్లి పా డగుచున్నప్పుడు దానిని ఖండించి శేషాంగశ్రేణికి రక్షణ మొనర్చుట మేలుగాదా? మీరే లెస్సఁగా యోజించి కర్తవ్య మూహింపుఁడు. నా చుట్టాలనే నే నిట్లు నిందింప వలసెఁగదా యని వగచుచున్నాను.

సభ్య 3—ఈ మాత్రపు టుపన్యాసము సైతము, నేఁటి సభా కార్యదర్శిగారు, చెప్పఁజాలక యితరులచే వ్రాయించు కొని వచ్చుటయే కాక, దాని నింకొకనిచేఁ జదివించు నంతటి చిన్నఁదనపుఁ బనికినిం గడంగుటకు మేము మఱియు వగచుచున్నాము.

అధ్య—అయ్యా! ఎల్లవారికిని వాగ్ధాటి లెస్సఁగా నుండదు. అది లేనంత మాత్రమున నెకసక్కెము లాడవచ్చునా? ఇది న్యాయముగాదు. ఊరకుండుఁడు. ఇఁకఁ దక్కుంగల వక్తలను బిలుతము. రెండవవక్త యన్నప్ప సోమయాజి గారు. వారు దయచేసి మాటాడుదురు గాక.

అన్న—సభాధ్యక్షా! సభ్యులారా! నేను వెంకన్న మాత్రపు వక్తనుం గాను. అయినను, నాకుఁ దోఁచిన విషయములు కొన్ని చెప్పెదను. నరసన్నభట్టారకుని నడత యెంత మాత్రమును దగదు. అంతటి పండితుఁ డట్టినైచ్యమున కొడిగట్టుట మిగుల శోచనీయ మనక తప్పదు. మత్స్య మాంసములం దిను శూద్రులతోఁ గలసి భుజించుట మన బ్రాహ్మకులమునకు బొత్తిగాఁ దగదు. వేయి మాలకాకుల లో నొకకోయిలవలెఁ గృష్ణయ్య యీ మాలలతోఁ గూడి యూరేఁగుట మఱియు నసహ్యముగా నుండెను. వారు చిన్నవాండ్రేమో చీవాట్లు పెట్టుదమన్న, సర్వ మెఱింగినవారు. తప్పేఁబని పండితుఁ డొనర్చినను, దప్పుగానే కైకొనవలయుఁ గాన, వారిని బహిష్కరింప వలయును.

సభ్య 2—సోమయాజులుగారే బాగుగా మాటాడిరి. వక్తను గాననుచునే భాషించిరి. ఎవరైనను-గార్యదర్శిగారి కంటె మేలే.

అధ్య—సోమయాజులుగారి తీర్మానమును సోమన్నగారు బల
పఱిచెదరు.

సోమ—అవును. బలపఱుచుచున్నాను.

సభ్య 1—అయ్యా! వేదికియొద్దికి వచ్చి రెండు ముక్కలు
మాటాడుఁడు.

సోమ—(అధ్యక్షునికడకు వచ్చి) అన్నప్ప సోమయాజులు
గారి తీర్మానమును నేను బలపఱుచుచున్నాను.

సభ్య 4—ఆహా! చాల గొప్ప యుపన్యాస మిచ్చితిరయ్యా!

అధ్య—పిమ్మట బాలకవి శ్రీరామశర్మగారు కొన్ని పద్య
ములఁ జదువురు.

దీక్షి—(ప్రక్కనున్న సభ్యునితో నపవారించి) వీని పద్యము
లను నేనే దిద్ది యిచ్చితిని జుమీ!

రామ— తే. గీ. ఆర్యులార! హిందూమత ♦ వర్యులార!
చిన్నవాఁడను నైన, నా ♦ విన్నపంబు
శ్రద్ధతో వినఁ గోరెద ♦ బుద్ధిధీరు;
తప్పు లున్నచో క్షమియింపుఁ ♦ డొప్పుగాను.

సభ్య 3—ఈ బాలకవిగారు బొత్తిగాఁ జనుఁబాల కవిగా
నున్నారే! పద్యములో యతులగతులఁ జూచ నతులితము
లుగ నున్నవే!

దీక్షి—యతులకేమి లోపముగల దయ్యా! చక్కఁగాఁ
బ్రాసయతులు పడినవే.

సభ్య 3—బాలకవికా, మీకా ?

దీక్షి—ఆ పద్యములు నావికావే! నే నించుక దిద్దిపెట్టితిని. అంతే. అయినను, ఆతఁడు తప్పులున్నచో క్షమియింపుఁ డనుచున్నాఁడే!

సభ్య 3—"తప్పులున్నవి క్షమియింపుఁ డోప్పగాను" అని చెప్పుకొనుమయా, బాలకవీ!

అధ్య—అయ్యా! బాలుఁడు, ఉత్సాహముతో నేవియో కొన్ని పద్యములు, తనకుఁ దోఁచిన విధమున, వ్రాసికొని వచ్చినాఁడు. వానిలో మంచిని గ్రహింపవలెఁ గాని, తప్పు లేకరువుపెట్టి నిరుత్సాహపఱుపరాదు గదా ?

సభ్య 2—మంచియున్న, నటులే గ్రహింతుము, లెండు. కాని మ్మయ్యా, బాలకవివర్యా!

రామ—తే. గీ. భట్టుగారి నడత యేమి ♦ బాగులేదు.
శూద్రకూఁడు తిన్నారఁట ♦ భద్రమగునె ?
బ్రాహ్మణోత్తములై యట్టి ♦ పాడుపనులు
చేయువచ్చునా ? బొత్తిగా ♦ సిగ్గు గాదె ?

సభ్య 1—ఓహో! యేమి పదలాఘవము! ఏమి, సమాస రచనా చాతుర్యము! మేలు, మేలు! బాలకవీ! భళీ! దిద్దిపెట్టిన దీక్షితకవీ!

రామ—తే. గీ. మాలవారికై పాటలు ♦ లీలఁ జేసి
వారలను రాచుకొని తిర్గు♦చూరివెంట

బయలు దేఱెడు కృష్ణయ్య,♦భట్టు మఱంది,
వెలిని వేయఁ దగినవాఁడె ♦ యిలను దలఁప.

సభ్య 4—ఆహా! దీక్షితులుగారు చెప్పినట్లుగానే, బాలకవికిఁ బ్రాసయతు లప్రయత్నముగా నెంత చక్కఁగాఁ గుదురుచున్నవి! "త్రిగ్గుచూరివెంట" ఎంతముద్దైన సంధికూర్పు!

రామ—(కోపముతో) అయ్యా! నన్ను మాటి మాటి కాక్షేపించుచున్నారు. మీ రీమాత్రపుఁ గవిత్వము చెప్పఁడు. చూతునుగాక. తప్పులు పట్టుట కారంభింతు మేని, నన్నయభట్టు కవిత్వములోఁ గూడఁ బట్టవచ్చును.

సభ్య 3—అవును బాబూ! నీ వంతటి సమర్థుఁడవే! ఇప్పుడీభట్టు చరిత్రములోఁ దప్పులు పట్టుచున్నవాఁడవు, ఆ భట్టు కవిత్వములోఁ బట్టలేవా?

దీక్షి—అయ్యలారా! మీరిట్లు బాలుని బెదరఁ గొట్టుట తగవుగాదు. అతని శక్తి మీరు పరీక్షఁ జేయఁ జూతురేని మీకుఁ దోఁచిన యంశముంగూర్చి యాశువున నొక్క పద్యముఁ జెప్పుమని కోరుఁడు. ఎంతచక్కఁగాఁ జెప్పఁ గలఁడో మీకే విశదము కాఁగలదు.

అధ్య — సోదరులారా! మీ చర్యల నే నొప్పను. సభలో నొకరు మాటాడుచుండ నింకొక రడ్డు పల్కరాదు. నాయనా! తక్కిన పద్యములం జదువుము.

సభ్య 2—(అపవారించి ప్రక్కవానితో) ఓయి బాబో! అధ్యక్షుఁడుగారు మనలను శాసించుచున్నారురా!ఇంక మన న్లోళ్ళకుఁ దాళములు వైవవలయుఁ గాఁబోలు. ఓరీ! వాఁడు చదువుపద్యములు ముగింపనిమ్ము! అధ్యక్షుఁడు గారిని గంధపద్యములలో నాశువున వర్ణింపు మందము. వానిపస బయలు వెడలును.

సభ్య 1—సరే. ఆలాగుననే చేయుదము. వాని పద్యములు ముగియనిమ్ము.

రామ—చదువుమని సెలవా ?

సభ్యులు—ఆ! సందేహమేమి ?

రామ—

తే. గీ. శ్రుతులు, స్మృతులు, పురాణముల్ ♦ చోద్యముగను
కావ్యము, లితిహాసములును, ♦ గల్గుమతము
పెక్కువేలేండ్లనుండియుఁ ♦ బెరుఁగు మతము
ఇలను మతరాజ మనఁదగు ♦ హిందుమతము.

సభ్య 4—భళీ! సీతరామశర్మ! హిందూమత ప్రాశస్త్య మిప్పుడు మాకుఁ జక్కఁగా బోధ పడినదోయి! "చోద్య ముగను" అను పదము చాలఁ జోద్యముగాఁ బడినది.

రామ—. తే గీ. అట్టి మన మతమొ చెడెడు ♦ నట్టివేళ
నూరకుందురే, కిమ్మన ♦ కూరిచారు ?

జంక కల నరసన్న కృ♦ష్ణయ్యగార్ల
వెంటనే వెలివేయుఁడీ ♦ వేగమీరు.

(కరతాళ ధ్వనులు)

సభ్య 3—భేష్! బాలకవీ! నీ పంచపద్యరత్నమాల ప్రపంచమునఁ జిరస్థాయిగా నుండఁ దగ్గదోయి! దానిచే నలంకృతుఁడవైన నీవు పంచశరునివలెఁ బ్రకాశించుచున్నావు సుమీ. ఈ చివరపద్యములోని చివరపాద మెంత రసవంతముగాఁ బడినదోయి! సార్థకమైన పదములతో నిండియున్నది.

అధ్య—ఆర్యులారా! పాప మీబాలు నూరక బెదరఁగొట్టిరి. అది న్యాయమా!

సభ్య 2—అయ్యా! సంతోషము పట్టఁజాలకఁ మేము చేసిన పనిని సైరింపుఁడు. బాలకవీ! అన్యథా తలఁపకుము.

సభ్య 2—నీ వాశువున ఘనుఁడవని నీ గురువుగారు పల్కుచున్నారు. ఏదీ, మన యధ్యక్షుని వర్ణించుచు రెండు కందపద్యములఁ జెప్పుము. చూతము. నీ తెలివిదేటలు.

రామ—ఓ! అ దెంతపని! వినుఁడు. (తడవుకొనుచు, నడుమఁ బైకిఁజూచుచు)

కం. కప్పకెలుఁగుతో శ్రీ వెం
కప్ప సుపండితుఁడు హాయి♦గా వేదపునోర్
విప్పఁగఁ గుప్పలు కుప్పలు
మెప్పులు సభికులు విడుచు సు♦మి యలఘుధుపయిన్.

సభ్య 2—(పెద్ద నవ్వుతో) హాయి, హాయి ! శబ్దార్థాలంకారాల కుప్ప ! సరళమైన నడక ! నిర్దుష్టమైన శబ్దవాక్య ప్రయోగములు ! మేలు మేలు !

దీక్షి—ఊరక యాక్షేపించుట కాదు. ఇట్లు కవిత చెప్పఁగల వారు మఱి యెవ్వరు ? గొగ్గినడక యని కాఁబోలు మీ యూహ ! యతు లెంతధారాళముగఁ దడవుకొనకుండఁ బడినవి ! "సభికులు విడుచు" అను ప్రయోగము తప్పని కాఁబోలు మీ యభిప్రాయము. "సభికులు"–ఇది సంఘ వాచకము. దీని క్రియ యేకవచనములో నుండవచ్చును. ఇట్టి ప్రయోగములు భారతములో లక్షోపలక్షలు దొరకును.

అధ్య—అయ్యా ! ఇట్లు మీ రందఱును నా యనుమతి లేనిదే మాటాడఁగూడదు. ఇఁక నే నొప్పను. కూర్చుండుఁడు. ( సభ్యు లూరకుందురు. ) మఱి యెవ్వరైన మాటాడఁ దలఁచిరా ? (ఎవ్వరును మాఱుపల్కరు) పోనిండు, నాకుఁ దోఁచిన మాటలు రెండు మూఁడు చెప్పి సభ ముగించెదను. నా యుపన్యాసము ముగిసినతర్వాత మీలో నెందఱు భట్టారకునిఁ దత్పరివారమును సంఘ బహిష్కారము చేయఁగోరుదురో, యెందఱతని పక్షమవలంబింతురో యెఱిఁగింపుఁడు. అప్పుడు తీర్మానము ధ్రువపఱుతము.

సభ్య 3.—అయ్యా! తీర్మానము ధ్రువపఱుచుట కది . సవ్యముగా జరగినప్పుడు గదా? దాని నామోదించువారు లేకయే యొకరు బలపఱిచిరి. అది యట్లుండ, మనము వ్యతిరేక పక్షమువారి వాదముకూడ వినవలదా? ఇప్పుడు చెప్పినవారి మాటలలో సహేతుకమై, యుక్తియుక్తమై, శాస్త్రసమ్మతమై, యనుభవసిద్ధమగు వాద మెద్దియు వినఁబడి యుండలేదు. కావున, సభ మఱియొక నాఁటికిఁ బెంచి, యానాఁడు నరసన్నభట్టారకుని గూడ రావించి యతని వాదముకూడ వినుట యుక్తము.

వెంక.—గ్రామస్థు లెల్లరును సభకు రాఁగా, నరసన్న యేల రాఁగూడదు? అతఁ డెప్పుడును రాఁడు.

(తెరలో—"రాకేమి! ఇదే సపరివారముగా వచ్చుచున్నాఁడు. మీ హృదయ కవాటకములం జొచ్చుచున్నాఁడు. మీ కర్ణరంధ్రముల వ్రచ్చుచున్నాఁడు. మీ సంకల్పదధులను దగ్ధచ్చుచున్నాఁడు.")

(ప్రవేశము:—కృష్ణసూరియు శిష్యులును. అందఱు నివ్వెఱ పడుదురు.)

కృష్ణ—తే. గీ. ఓరి! బ్రాహ్మణ బంధువులార! పూత
జాహ్నవీతోయసదృశ స్వచ్ఛ హృదయుండు
దేవగురుసమాన నయ కళావిదుండు
మజ్జనకుఁ డొప్పఁడే, యార్యమతవివక్ష?

తే. గీ. అగ్ని పర్వతాం తర్గతం♦బౌ పదార్థ
మట్లు లాత్మ మాత్సర్యంబు ♦ నణఁచి యుంచి
మానమిాప బాంధవుఁడు నేఁ♦డీ సరణిని
వెడలఁ గ్రిక్కి, దవ్వగఁ బోవఁ ♦ గడఁగ రేల ?

సీ. సతము వేశ్యల యిండ్ల ♦ సలిపెడు కామతం
త్రంబులే వేదమం♦త్రములు గాఁగ
నిరత మన్యధనాప♦హారణ కృత్యంబులే
యాత్మ ప్రధాన కృ♦త్యములు గాఁగ
అనిశ మసత్యసా♦క్ష్య ప్రయోగంబులే
కర్తవ్యకృతిని యో♦గములు గాఁగ
అనయ మాత్మప్రయోజ ♦ నార్థ చింతనములే
సములతోఁ జను మంత♦నములు గాఁగ

గీ. బ్రతుకు జాతి మాత్ర ద్విజ♦వర్గమెల్లఁ
బంక్తి భోజనార్హ మగునే ? ♦ వారివలన
మిా పవిత్ర హిందూమత ♦ మేపగిదిని
నిలిచి యున్నదో తెల్పుఁడో ♦ తులువలార !

మ. అమితైశ్వర్యములంది, దీనజన సా♦హాయ్యంబు గావించి, పే
రిమి గన్నట్టి సుశీల, కాలగతి చే♦శ్రీలెల్లఁ గోల్పోయి, స్వీ
యమహానంద నికేతనం బతిని, బ్రే♦మాధారమా బంధువ
ర్గమునుం గోల్పడి, యాశ్రయం బడుగఁ జే♦ర్పం బాపకార్యం
బొకో ?

మ. కడునార్తిం జనుదెంచునట్టియబలన్ ♦ గాపాడఁగ ర్తవ్యమో,
విడువందగ్గ పురాణ మూఢమతసం ♦ విద్భావమేముఖ్యమో,
మొడఁదల్ చిచ్చిపరీక్షఁజేసికొనమీ ♦ కేగోచరంబయ్యెడిన్;
జెడుదారిం బడిపోకుఁడీ, గురులనిం ♦ దింపన్ మహాఘుంబగున్.

(ప్రవేశము:—నరసన్న భట్టు సంభ్రమముతో)

నర—కుమారా! నీవేల తొందరపడి వచ్చితివి? ఎందుల కీకంఠశోషము? వీరిసభాకార్యంబులకు నీ వడ్డు రా వచ్చునా?

కృష్ణ—నాన్నగారూ! కూళలు కొందఱు గూడి మిమ్ము వృథాగా నిందకుఁ బాల్పఱుచుచున్నారని విని, వెంటనే వారి నోళులు గట్టుటకు వచ్చితిని.

నర—నాయనా! అట్టి తీవ్రవాక్యము లాడవచ్చునా? వారి వలెనే నీవును నిందకు దొరఁకొన్న, నీ గొప్ప యేమున్నది? సభాధ్యక్షా! నా కుమారుఁడు దూరాలోచనము లేక, తొందరపాటుచే నవాచ్యములు కొన్ని పల్కియుండఁ బోలు. వానిని మన్నించి మీ సభాకార్యములం జూచి కొనుఁడు.

అధ్య—అయ్యా! ఈసభ, మీపై నిందమోఁపి మిమ్ము సంఘ బహిష్కారముచేయుటకే కావింపఁబడుచున్నది. ఇం దెల్ల రును మీ ప్రతిపక్షులవలెనే కాన్పించుచున్నారు. ఇప్పుడే

మేము మీ పక్షవాదముకూడ వినుట మేలని యెంచు చున్నాము. ఇంతలో మీ 'పుత్త్రుఁడు వచ్చి యాశుపున బద్దెముల రచించి చదివినాఁడు. అవి యెంతయు హృద్య ముగ నున్నవి. తగిన సమయమునకే మీరును దయచేసి యున్నారు. కావున, నేఁటి తీర్మానమునకు వ్యతిరేకముగా నుండు తమ ప్రతివాదముం గూడఁ దెలుపఁగోరుచున్నాను.

నర—మహాశయా ! నాకీవాద ప్రతివాదములతోఁ బనిలేదు. మీ తీర్మానములేవో నాకుఁ దెలియవు. నే నెట్లు ప్రత్యు త్తర మీయఁగలను?

అధ్య—తా మొక వెలమకాంత చేతికూఁడు తింటిరనియు, నామెను బంక్తిని బెట్టుకొని ప్రతిదినము భుజించుచుంటి రనియు, మీ మఱఁది, కృష్ణయ్యగారు, పంచములతో రాచుకొని తిరుగుచున్నారనియు, దాన సంఘము నుండి వెలిఁజేయఁ దగుదురనియు, సభ్యులు కొందఱు చెప్పిరి. ఆ వాక్యములే తీర్మానరూపమునఁ బెట్టిరి. దానికిఁ దమకుఁ దోఁచిన ప్రత్యుత్తర మీయఁ గోరు చున్నాను.

నర—అయ్యా ! మీరు శ్రమపడి పొరుగూరినుండి వచ్చితిరి. ఓపికతోఁ నిందఱ పండితుల యుపన్యాసముల విని విసిగి యుంటిరి. ఇంకను నా నుడుల వినుటకు మీకుఁ దీక్షక గలదా ?

అర్థ్య—కలదా యని మెల్లఁగా నడుగుదురా? మీ ప్రతి వాదము మా కెల్లరకు ముఖ్యము. అదియు విని చేసిన తీర్మానమే చెల్లును గాని, తక్కుంగలది చెల్లదుగదా? దయతో మీ యభిప్రాయములం దెల్పుఁడు. సభ్యులారా! కూరుచుండుఁడు. భట్టుగారిని గూడ విందముగాక.

వెంక—మే మీభట్టు నిచటికి రమ్మని పిలువలేదే! ఏలవచ్చి మాకార్యముల కడ్డు వచ్చుచున్నాఁడు?

కృష్ణ—నీ వేలవచ్చి నీయిచ్చవచ్చిన మచ్చున వదరుచున్నావు? ఇది నీ తోఁటయా?

అర్థ్య—(వారించుచు) అయ్యా! కూరుచుండుఁడు, వెంకన్న గారూ! మీరిందాఁక నరసన్నభట్టారకులు పిలిచినను రాకున్నారని పల్కితిరి. ఇప్పుడు పిలువనిదే యేల వచ్చితి వని యాయన నడుగుచుంటిరి. మీ మనస్సే కల్మష పూరితమై యున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. ఆయనను బిలువకుండుట గొప్పతప్పుకాదా? తీర్పరు లుభయవాదములను విని విషయనిర్ణయము చేయవలెఁ గాని, యొక్క పక్షము విని కాదుగద? మీమాట నేను బాటింపను. భట్టుగారూ! మీయుపన్యాస మారంభింపుఁడు. (సభ్యు లాసీనులయ్యెదరు. వెంకన్న సిగ్గుపడి కూర్చుండును.)

నర—మహాశయులారా! ఇది మాతోఁడియల్లుండ్ర సంవాదము గాని, మతవివాదము గాదు. "షడ్ఢకష్షడ్ఢకశ్చైవ,

ముష్టియుద్ధం పునఃపునః ” అను నానుడి మీరును, వినియే యుందురు. మా వెంకన్నకు నాపైఁ జిరకాలమునుండి యీర్ష్యగలదు. అది నానాఁటికిఁ బెరిఁగి యతనిహృదయము ను బీడించుచున్నది.

వెంక—(లేచి) అది కేవల మసత్యము.

సభ్యులు-కూర్చుండుఁడు, కూర్చుండుఁడు. (కేకలు,కలకలము)

నర—అసత్యమనుట యసత్యము. కలిరాజు యత్నించి యత్నించి నలునియందొక చిన్నతప్పును బట్టి, దానిం బట్టి యతనిం జిక్కులు బెట్టఁ బూనినట్లు, మా వెంకన్నకు నాయందుఁ దప్పు పట్టుకొనుటకు నేఁటి కొకయాధారము దొరకి, నన్ను సిలుఁగుల పాలుచేయఁ బూనినాఁడు. నా మఱఁది, కృష్ణయ్య, యితనికి నావలెనే భార్య వంకఁ జుట్టమని మీ రెఱుఁగుదురు. ఆ చుట్టఱికముచేతనే యితఁడు కృష్ణయ్యచర్య చాలకాలము సహించినాఁడు. దాన లెన్నఁగా యోజించినఁ దప్పేమియు లేదనియు గ్రహించి నాఁడు. కాని యతని స్వాతంత్రభావము లీతనికి నచ్చ కుండెను. అతనితో వాదప్రతివాదములు సలుపుటకు సామర్థ్యముగాని, సాహసము గాని యీతనికి లేకుండెను. కావున, నతనిపైఁ గూడ మచ్చరము వహించినాఁడు. ఇవి మాయాంతరంగిక విరోధములకుఁ గారణములు. ఇఁక నా శూద్రాన్నభుక్తివిషయము, వినుఁడు.

శీలవతి రావు సింగమభూపాలు దేవి. ఆమె సమస్త బంధుమిత్రులను గోల్పోయియు, నగతికయైయుండియు, గర్భవతియైయుంట సంతానకాంక్షచే జీవింపఁ దలఁచియుండెను. అట్టి యీవనిత యీశ్వరసంకల్పముచే నా కన్నులఁ బడియెను. నే నామెను నా యింటికిఁ దెచ్చి నాకూఁతుగాఁ జూచి పెంచుచున్నాను. అంత నామెం గూర్చి విషమపరీక్షలు వచ్చినవి. కూరుఁడగు మాధవవర్మ మహారాజామెం బట్టి చెఱంబెట్టి, తదర్భకుఁ జంప నిశ్చయించినాఁడు. మా యిల్లు ముట్టడించి యల్లరిచేసినాఁడు. అప్పు డాతనితో నామె నా కూఁతురని బొంకితిని. మా వెంకన్నచే ముందుగా బోధితుఁడై కాఁబోలు వచ్చియున్న వర్మ, నా మాటనమ్మక, తనయెదుట నామెచేతి యన్నముం దిన్నఁగాని నన్నువిడువనని పంతము పట్టియుండెను. ఒక్క యబలాప్రాణరక్షణము గావింపనా, బ్రాహ్మణాచారమే నిలువఁబెట్టుకొందునా, యను సందిగ్ధస్థితి నామనస్సునకుఁ గల్గినది. లెస్సఁగా యోజించితిని. "బ్రహ్మవా ఇదమగ్ర ఆసీదేకమేవ" అను నుపనిషద్వాక్యము జ్ఞప్తికి వచ్చినది. ఈ జగత్తంతయు మొట్టమొదట నొక్క బ్రాహ్మణ జాతిగానే యుండెఁగదా, యవలవృత్తులం బట్టి యేర్పడిన వర్ణభేదమును జ్ఞానులు పాటింపరాదు గదా, యని యూహించితిని. "మన హిందువులు తమ సాంఘికాచారములనెల్ల,

నూహా ప్రపంచముమీఁద నాధారపడియున్న కొన్ని మత సూత్రములతో జతపఱిచి, వానిని సృష్ట్యాదినుండియు భగవంతుఁడే యేర్పఱిచెననియు,నవి యవిలంఘనీయములనియు నమ్ముచున్నారు. మేమే సనాతన హిందూధర్మజ్ఞులమని విఱ్ఱవీఁగువా రెల్లరు నీ నమ్మకములకు దోహద మొసంగి వానిని నిలువఁబెట్టఁ జూచుచున్నారు. అది మన సంఘాభివృద్ధికి భంగకరము." అని నాకుఁ దోఁచినది. మన సాంఘికాచారములు పూర్వకాలమునుండి నేఁటివఱకు నెన్నో పరిణామములం గాంచియున్నవి. ఇంకను గాంచనైయున్నవి. అట్టి విషయములోఁ బ్రాఁతపద్ధతులనే పట్టుకొని ప్రాఁకులాడుట తప్పని నాకు స్ఫురించినది. అది గాకఁ మనము గుణముచే వర్ణనిర్ణయము చేయవలెఁ గాని, జాతిచేఁ గాదు తహసీలుదారుకొడుకు తహసీలు దారుఁడేయై యుండ నక్కఱలేనట్లు, బ్రాహ్మణుని పుత్త్రుఁడు బ్రాహ్మణుఁడే యైయుండ నక్కఱలేదు. ఉండనుం జాలక యుండుట సర్వసాధారణముగా మనము చూచుచున్నాము. అటులే తక్కుంగల వర్ణములకును ధర్మాచరణముచేత నికృష్టవర్ణము లుత్తమవర్ణములుగను, అధర్మాచరణముచేత నుత్తమవర్ణములు నీచవర్ణములుగను, మాఱొందుచుండును.

"ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వం పూర్వం వర్ణ
మాపద్యతే జాతి పరివృత్తౌ।
అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యం జఘన్యం వర్ణ
మాపద్యతే జాతి పరివృత్తౌ॥

అని యాపస్తంబ సూత్రములలోఁ గలదు. గీతారహస్య మును, ఉపనిషద్సారమును, లెస్సఁగా భావించి చూడ, సర్వమానవ సౌభ్రాత్రమునే తెల్పుచున్నవి. మనము ధర్మశాస్త్రములను బట్టియే నడుచుకొందమన్న, నవి పరస్పర విరుద్ధములు. వానిలో మనకు ముఖ్యమైన మనుస్మృతి, "బ్రాహ్మణుఁడు ప్రాపంచక వ్యవహారములను మాని, వేదాధ్యయనము చేయుచు, వేదమునే బోధించుచు, వరి కళ్లములలో రాలినగింజలనే నేరికొని, తృప్తిగలిగి, శుద్ధముగ జీవింపవలె" నని యున్నది. ఆ రీతిగా మనము నడుచుకొనుచున్నామా? నడుచు కొందమన్నను, మనకు సాధ్యమా? అటులే యెన్నో ధర్మములు, మనము శాస్త్రములకు విరుద్ధముగా నాచరించుచున్నాము. ఆపద్ధర్మము లనుపేరు పెట్టి యెన్నో పనులు మనకుఁ దోఁచినట్టు లొనరించుచున్నాము. కావున, శీలవతిచేతి కూఁడు దిన్నను దప్పుకాదని నాకుఁ దోఁచినది. దురాచారపరుఁడై యుండు బ్రాహ్మణుని చేతియన్నము దురన్నమనియు, సదాచార పరుఁడై యుండు శూద్రుని చేతియన్నము సదన్నమనియు,

నామత్రము. శీలవతి సదాచారసంపన్నురాలు కనుక నామె చేతియన్నముం దింటిని, దినుచున్నాను, దినఁగలను. "శుచిగానున్న శూద్రుఁడు వైశ్వదేవములలోఁ గూడ నగ్రజాతులకు వంటచేసి పెట్టవచ్చు"నని, యాపస్తంబ సూత్రములును, "గొల్లవాఁడు, సేద్యగాఁడు, మంగలివాఁడు, నౌకరు, కుటుంబమునకు స్నేహితుఁడు—వీరు పెట్టిన భోజనమును బ్రాహ్మణుఁడు స్వీకరింపవచ్చు"నని గౌతమధర్మసూత్రములును, మఱియుఁ బెక్కు ధర్మశాస్త్రములు పెక్కువిధములుగను, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులతోఁ గలసి భుజింప వచ్చునని చెప్పుచున్నవి. ధర్మశాస్త్రములమాట యటుంచి, కేవల స్థూలదృష్టితో నీశ్వర పితృత్వము, సర్వమానవ సౌభ్రాత్రమును బాటింపఁ జూచిన, నట్టి భోజనములు దోషములు గావు.

నా మఱఁది చర్యయు నిటులే పరమపవిత్ర మైన దనియు, శాస్త్రసమ్మతమైన దనియు, నేను రుజువు చేయఁ గలను. కాని యిప్పుడు కాలము చాలదు. నా యనుష్ఠానములకు వేళ యగుచున్నది. నా కిఁక సెలవిండు. మమ్ముఁ గూర్చి మీ రిచ్చవచ్చిన మచ్చునఁ దీర్మానములు గావింపుఁడు. మేము లక్ష్య పెట్టము. తప్పుఁ జేసితిమని చెప్పి లెంపలు వాయించుకొని, మీ యెదుటఁ బ్రాయశ్చిత్త

కర్మ మొనర్చికొనము. మా బంధుగులు కొందఱు "మే మే తప్పును జేయలేదు. శీలవతి చేతికూడు తినుట యసత్యము" అని నలువురిలోఁ బల్కిన, మమ్ము మరల సంఘములోఁ గలుపుకొనెద మనిరి. చేసి లేదనుట వారికే తగును కాని, మాకుఁ దగదు. అది గాక, యేమంత ప్రాణసంకటము వచ్చిన దని బొంకవలయు ? సోదరా ! వెంకన్నా ! నీవు తప్పుఁ బనులుగా నెంచుచున్న మాదిరివి, పెక్కులు నీవును, నీ వారును జేసిరి, చేయుచున్నారు, చేయఁగలరు. మీకు, మాకు, భేద మేమన, మీరు చేయులేదని బొంకి, యొక తప్పున కింకొకతప్పుఁ జేర్చుచున్నారు. మేము చేసినపని చేసితిమని యొప్పుకొనుచున్నాము. నీవు నిజముగా వెట్టి పనియే చేసితివి సుమీ. మమ్ము విడనాడి పరులఁ జేపట్టుట వలన, నీకుఁ బ్రయోజనము లేదు. ఖేదమోదము లప్పు డాత్మబంధువు లట్టు లితరులు తోడుపడఁ గలరా ? అది యట్లుండ, నీ మిత్రు లందఱు నీ ధనమున కాసించి నీ మాటాడుచున్నారు గాని, వారికి మతధర్మములు తెలిసి కాదు. నేను గూడ ధనవంతుఁడనైన, నొక్క నిముసము లో, వారినందఱను నా వంక కాకర్షింపఁగలను. నే నిఁకఁ బనివినిమెద. ఇంట నాకూఁతు రించుక బద్ధకముగానున్నది. ఆలస్య మొనర్పరాదు.

ప్రవేశము:— పుల్లయ్యశాస్త్రి.

పుల్ల—గురువుగారూ ! శీలవతీదేవిగారికి మగపిల్లవాఁడు పుట్టినాఁడు. మిమ్ము వేగముగాఁ దోడుకొనిరమ్మని యమ్మగారు నాకు సెలవిచ్చిరి. దయచేయుఁడు.

నర—సభ్యులారా ? ఇది నాకు మహదానంద సమయము. నాకు దౌహిత్రుఁడు గల్గెను. ఈ ముహూర్తబలమును బట్టి చూడ నతనికి భావికాలమున మహారాజ్యము లభింపఁగలదు. అట్టివాని కర్త్వావిధిని జాతకర్మ సంస్కారములం గావింపవలయు. మీ యందఱకు యథావిధి నాహ్వానములఁ బంపెదను. మీ రెల్లరు మా యింటికి దయచేసి, శిశువు నాశీర్వదింపఁ బ్రార్థించుచున్నాను. కుమారా ! శిష్యా ! రండు.

(నిష్క్రమింతురు.)

(సభ్యులెల్లరు కలకలధ్వనులతో సభవిడిచి పోవుదురు.)

అధ్య—(తనలో) నేను సభముగింపకుండఁగనే సభ్యులు లేచి పోవుచున్నారు. ఇఁక నా యుపన్యాస మెవ్వరు విందురు? అవును. నరసన్నభట్టారకుని వాదము సహేతుకమై హృదయంగమమైయుండ, నితరుల పల్కులు వారేల విందురు ? (ప్రకాశముగా) వెంకన్నగారూ! మనపని యైనది. మనము కూడఁ బోవుదమా ? పాపము, మీ వాదము నెగ్గనందు

నకు నాకుఁ గడు విషాదముగా నున్నది. మీాది యసమ కక్ష. రేపు నరసన్నగారియింటి కెల్లరు భోజనములకుఁ గూడ వెళ్లుదురు. మానిన మీారొక్కరే. మీారు పట్టుఁ బట్టిన, మీాకుటుంబము వా రుందురు. అంతియే.

వెంక—కాలమట్లు మాఱి పోవుచున్నది. కానిండు. మన మేమి చేయఁగలము ? రండు.

(నిష్క్రమింతురు.)



చతుర్థ రంగము.



రంగము:—ఒక యింటి యరుఁగు.

(ప్రవేశము:— వేదాంతము వెంకన్న, వెంకమ్మ, దీక్షితులు)

వెంక—అక్కయ్యా! నే నెంత ప్రయాసపడినను, నరసన్నగాని, కృష్ణయ్యగాని, మనకు లొంగకున్నారు సుమీా. వారి యదృష్టమేమో గాని, వారి మాటయే చెల్లుచున్నది.

వెంకమ్మ—తమ్ముఁడా ! నేను మొదటనే చెప్పలేదా? ఏల వృథాగా నీవు మన రక్తబంధువుల మీాఁదనే దాడియెత్తితివి ? నీ కొడుకులు చేయు నవకతవకలకంటెఁ గృష్ణయ్య యేమిచేసెను.

వెంక — నా కొడుకులు చేసిరని యెవ్వరు చెప్పిరి? ఎవ్వరు చూచిరి?

వెంకమ్మ — చెప్పినవారు, చూచినవారు, పెద్దమనుష్యులు పెక్కండ్రుగలరు. రుజువులేల?

దీక్షి — వారు తప్పుఁ బనిఁ జేసినచో మనము చీవాట్లుపెట్టి మాన్పింపఁగలము. నరసన్న కృష్ణయ్యగార్ల నెట్లు వారింప నేర్తుము?

వెంకమ్మ — నరసన్నమాటకేమి? అతఁడు పెద్దవాఁడు. కృష్ణయ్యను నీవు నీ పుత్త్రులతోఁబాటు సమానముగా నాదరింప వలసినది. నీవీ విరోధము పాటించుట నాకు నచ్చలేదు.

వెంక — నీకు నచ్చకున్న, నీవు కూడ వారిలోఁ జేరుము. నా కొడుకు లేదోషకృత్యములును జేయలేదని చెప్పిరి. అట్లు తాము జేయలేదని నరసన్నకృష్ణయ్యలను బదిమందిలో జెప్పమనుము. మేమును వారిలోఁ గలియుదుము.

వెంకమ్మ — తప్పుఁజేసి లేదన్నంతమాత్రమున, నది పోవునా? చేసి లేదని యబద్ధమాడువానికంటెఁ జేసితినని ధైర్యముతోఁ బలుకువాఁడు మనకు మిగుల నాదరణీయుఁడు గాఁడా? అబద్ధమాడువాఁడు రెండుతప్పులు చేసినవాఁడు గదా?

దీక్షి — పిన్నిగారూ! మీ రేవో సత్యకాలమునాఁటి మాటలు చెప్పుచున్నారు. ఈ కాలములో బాహ్యాచర్యనే లోకులు

చూతురుగాని, యంతశ్చర్య లెవ్వరికిఁ గావలయును ?జ్ఞానికి నలువురిలోఁ దిన్నఁగా వర్తించుటయే కావలసియున్నది.

వెంకమ్మ—అవును. నిజమే. నీ బావ మ్లేచ్ఛకాంతతోఁ బంక్తిభోజనము చేయువాఁడైనను, దివ్యజ్ఞానము గల్గువాఁడని నీవు నమ్మిటంబట్టియే కాఁబోలు, నతనిచర్య బయటఁ బెట్టకున్నావు.

దీక్షి—అమ్మా! నా మీఁదనుం దప్పు దోఁపియుచుంటిరా ? మా బావవంటివారు మీకునఁగలరు.

వెంక—బావా ! నీ పూరకుండుము. ఆమెతో మన కేమిపని. అక్కయ్యా ! ఈమాటలకేమిగాని, రేపు పంచమినాఁడు నీ మనుమని పెండ్లిగదా, దానికి నరసన్న కృష్ణయ్యగార్లను బిలుతువా ?

వెంకమ్మ—తమ్ముఁడా ! వారు రాకుండ నే నిదివఱకే కార్యము జేసియుండలేదు. అదిగాక కృష్ణయ్య మా జ్ఞాతియగుటచే, నిప్పు డాతనినే స్నాతకము జరపఁ గోరనై, యుంటిని. నీ వేమందువు ?

వెంక—నే నేమియు ననఁ దలఁచికొనలేదు. వారిని బిలిచినఁ నేనుగాని నా కుటుంబమువారు గాని యిఁకముందు నీ గుమ్మము తొక్కము.

వెంకమ్మ—అట్లనుట న్యాయముగాదు. మా పిల్లలలో బచ్చఁగా నున్నది నీ భార్య యొక్కతెయే గదా ? అది

రాకుండ నే నెటుల శుభకార్యముఁ జేయుదును ? పోనిమ్ము. వారిని బిలువను లెమ్ము. వారితోఁబా టితర బంధువుల నెవ్వరిని బిలువక, మొ్రొక్కుకున్నదని నెపముఁ బెట్టి పెండ్లి తిరుపతిలోఁ జేయుదమా !

దీక్షి—అది చాల బాగుగనున్నది. స్నాతకమునకు జ్ఞాతులే యుండ నక్కఱలేదు. ఏ గృహస్థయినఁ బనికివచ్చును. మీ సెలవైన నేను, నా భార్యయుఁ బీటలపైఁ గూర్చుండి స్నాతకము చేయింతుము.

వెంక—అక్కా ! అది మిగుల యోగ్యముగా నుండును. నీ పురోహితుఁడు యాజ్ఞికమునకు రా నన్నాఁడు. కనుక నితఁడే మనతో వచ్చి శుభకార్యము చక్కఁగాఁ జేయించును లెమ్ము. మంచి పండితుఁడు కూడ నగును గదా ?

వెంకమ్మ—మా పురోహితుఁడు నరసన్నగారి కుటుంబమునకుఁ గూడఁ బురోహితుఁ డగును. అతఁడు కూడ మీ లోని వాఁడే. మీ యభిప్రాయములను గొప్ప యుద్యోగుల యిండ్ల వ్యాపకముఁ జేసిన వారిలో నొక్కఁడే. కాని యేల మా యింటికి రా నన్నాఁడో తెలియదు. పోనీ, అతఁడు రాకున్న, మన దీక్షితులు రావచ్చును.

దీక్షి—(అపవారించి) బావా ! అపాంక్తేయులగు నరసన్న కృష్ణయ్యగారులు పెండ్లికి వత్తురనియు, దాననందఱకు వెలి చుట్టుముట్టు ననియు నేనే చెప్పి, వానిని భయపెట్టితిని జుమీ !

వెంక—(అపవారించి) వాని కుంటలో మన్నుఁగొట్టినను, మంచిపనియే చేసితివి. నీ కేలాగుననో నాల్గుడబ్బులు దొరకుటయే నాకును గోరిక గదా ?

వెంకమ్మ—ఏమా గుసగుసలు ? తోడిదొంగ లిద్ద రేదో మోసము చేయఁ దలఁతురేమో !

దీక్షి—ఏ మోసముఁ దలఁపము. మా జట్టులోని వారగు పొట్టి రామన్న, సోమన్న, మున్నగు వారలను గూడఁ బిలువనీయరా దనుకొను చుంటిమి.

వెంకమ్మ—నాకు వారి నడవడియు నచ్చకుండెను. వారి కొడుకులును మా తమ్ముని బిడ్డలవలెనే పలుసారులు దొరలతోఁ గలసి భోజనములు చేసిరనియుఁ జేయుచున్నా రనియు వింటిని.

వెంక—అప్పా ! అవన్నియుఁ గిట్టనివారు పుట్టించిన వాదులు, నమ్మకుము. మన గ్రామములోని వారు పెక్కండ్రు మూఢులు. ఒక్క మాటమీఁద నిలువఁబడరు. నాఁడు మాతోఁ బాటు తోఁటలో ధర్మోపన్యాసము లిచ్చినవారు, మరల సిగ్గులేక, నరసన్న యింటికి బారసాలకు భోజనముల కేఁగిరి.

దీక్షి—కక్కుతిత్తి ముండకొడుకులు. మాడ కాసించిరి. మాల కూడు దినిరి.

వెంకమ్మ—దీక్షితులూ! నీవు మాత్రి మామాడ కాసింప లేదా? సంభావన కేఁగితివఁట కాదా?

దీక్షి—సంభావనము పుచ్చుకొంటిని. కాని వానియింట భుజింపలేదే!

వెంకమ్మ—భుజింపకపోయినను, భుజించి వచ్చినవారితోఁ గూడి భుజించినట్లులే నటించి సంభావనము గ్రహించితి వఁట. డబ్బుకక్కుఱితి నీకు మాత్రము లేదా? ఎంతవాఁడైన, డబ్బునకు నిముసములో లొంగిపోవును. పోనిమ్ము. దానికేమి? మాకృష్ణయ్య మాలవాండ్రతోఁ దిరుగుట మీరు చూచితిరా?

వెంక—మేము పెక్కుసారులు కండ్లారఁ జూచితిమి. వలయు నన్న, నేఁడును నీకుఁ జూపెదము. కొలఁదిసేపటిలో నతఁడు "అరుంధతీకుల సంఘము"తో మనవీధి నూరేఁగును. చూతువు గాని, తొందర పడకుము.

దీక్షి—ఇదివఱకు "వాల్మీకి కులసంఘ"మని యొంకటిగలదు. ఇప్పు డింకొకటి క్రొత్తది బయలుదేఱినదా?

వెంక—మా కృష్ణయ్య దయయున్న, నిట్టివి వేనవేలు బయలు దేఱఁగలవు. మాలల మాలలే యతని కలంకారములు.

(ప్రవేశము:—రేచిగాఁడు)

రేచి—(దూరమున నిల్చి) కామందులు! తొలఁగిపొండి. పెద్ద కొలము వాఁడను. తప్పుకొనుఁడి.

వెంక—ఓరి వెఱ్ఱివాఁడా! తప్పుకొనుట యెందులకురా? మా బందుగు లెల్లరు నీ యింటనే పడియేడ్చుచు, నీ కొడుకులకు మనుములకు విద్య నేర్పుచుండఁగా, మా కింకను మడి, మైల, యనునవి కలవఁటరా?

రేచి—గొప్ప పెబువ్రులు, మీ రాలాగు సెప్పవచ్చునా? మా కుఱ్ఱలు మీ మరియాద లెఱుఁగక పోవచ్చును. మేమెఱుఁగమా? ఆ కృష్ణయ్యగారికి వెఱ్ఱి కాకపోయిన, మా వారల కే నాఁటికైన చదువు లబ్బునా?

దీక్షి—చదువు రాకేమి? నీ మనుమలు సన్నని కంఠధ్వనుల తోఁ గృష్ణయ్య పాటలన్నియు శ్రావ్యముగాఁ బాడు చున్నారు. చక్కని యాంధ్రము వ్రాయఁగలరనియు వింటిని. అది చాలదా?

రేచి—ఒకటి మాత్ర మున్నది లెండు. నా కొడుకులవలెఁ గాక, నా మనుమలు త్రాగుడు మానినారు. ప్రతిదినము తెల్లవాఱు సరికే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, చల్లని నీటిలో స్నానమాడుదురు. తర్వాత, అందఱును ఒక్క చోటఁ గూడి దేవునిమీఁది పాటలు పాడుకొని, వేఁడు కొందురు.

వెంకమ్మ—అటయినఁ గొంతవఱకు బాగుపడుచున్నా రన్న మాటయే. మా కృష్ణయ్యబోధ లూరక పోలే దన్న మాటయే.

రేచి—అమ్మా! వారు బాగుపడినను, నా కొడుకులు మార రండి. వా రేనాఁటి కానాఁడే చెడఁదాగివచ్చి నా వీఁపు బద్దలగునట్లు కొట్టుదురండి. నా కీనౌకరీ తప్పదు, నా కొడుకులచే దెబ్బలును తప్పవండి.

వెంకమ్మ—మీ కృష్ణయ్యగారి కాళ్లమీఁదఁబడి వారి త్రాగుడు మాన్పుఁడని కోరుము.

వెంక—ఓయీ! మాకు నీతో నీ గొడవయేల? నీ యిచ్చ వచ్చిన విధమునఁ దంటాలుపడుము. ఎక్కడకో బరువెత్తి కొని పోవుచున్నావు. నిన్నాఁపరాదు. పొమ్ము.

రేచి—ఎక్కడకో గాదండి. మా కామందులు, నరసన్నగారి యింటికే వెళ్లుచున్నానండి. ఈ కావడిలోనివి కూరలండి. నేఁడు నరసన్నగారి వెలమ మనుమనికి అచ్చరాలు సెప్పు టకు మొదలు పెట్టెదరంట. మీ బాపనయ్యలకు బోనాలు కుడువఁ బెట్టవలెనంట.

దీక్షి—బావా! అదా? ఇందాఁక చింతపల్లి సత్తిగాఁడు కొంతమంది నిరక్షరకుక్షులను దీసికొని నరసన్న యింటి వంకఁ బోవుచున్నాఁడు. వాఁడే నేఁటి యాజ్ఞికము చేయిం చును గాఁబోలు.

వెంక—అపరకర్మ చేయించుట కలవాటు పడినవానికి శుభ కార్య మంత్రములు వెన్నఁగా రావేమో? ఒకవేళ వచ్చి నను, రెండు మంత్రములును గలిపి చెప్పునేమో!

పీక్షి—అట్లు చెప్పిన, నరసన్న యూరకుండునా? అతఁడేమి యవాజ్ఞుఁడా? సత్తిగాని పనియే బాగుగా నున్నది. పట్టు దల గల మన మేనాల్లయిదిండ్లవారమో, నరసన్న యింటి కేఁగుట మానితిమి గాని, గ్రామస్థు లెల్లరు వాని యింట బాహాటముగాఁ గుడుచుచునే యున్నారు. ఓరీ, రేచిగా! నేఁడు మీ కామందులు మీ పెద్దకొలము వారికిఁ గూడ భోజనాలు పెట్టెదరా?

రేచి—పెట్టెద రండి. కృష్ణయ్యగారు మమ్మందఱను పిలిచి నారండి.

వెంక—ఇఁక నేమి కావలయును? నేఁడు మనయూరి విప్రు లందఱుఁ దరించి రన్నమాటయే. అప్పా! ఇట్లు భ్రష్టులై పోవువారిని మీ యింటఁ బెండ్లికిఁ బిలుతునంటివి కాదా?

వెంకమ్మ—తమ్ముఁడా! మనయింట శుభకార్యము లగునప్పుడు, మనము మాత్రము మన పాలికాఁపులకుఁ దిండ్లు పెట్టమా? అటులే నరసన్నయుఁ గావించుచుండ వచ్చును.

వెంక—నరసన్న యట్టు లెందునకుఁ జేయును? బ్రాహ్మణు లతో మాలల కేకపంక్తిని వడ్డింపించును. నా కెందుల కీగొడవ? నీ కింకను, నరసన్నయింటఁ దిండియాన వదల లేదు కాఁబోలు, నిట్లు వానిని వెనుక వేసికొని పలుకు చున్నావు? నీయిష్టము నీది, నా యిష్టము నాది. రేచి గాఁడు గారూ! పోండి.

రేచి—అదేఁటి, కామందు, లాలాగు మాటాడెదరు ?

వెంక—రేపు మీ వారలందఱును జదువుకొని, యీమ్లేచ్ఛ రాజ్యములో నున్నతోద్యోగములు సంపాదింతురు. అప్పుడు మేమే లాగునను మిమ్ము గౌరవింపక తప్పదు. ఇప్పటినుండియు నలవాటు చేసికొనుట మేలని యట్లు పిలుచుచున్నాను.

(ప్రవేశము:—కృష్ణయ్య యరుంధతీకుల సంఘముతో నిట్లు పాడును-)

తెగఁ ద్రెంపుం డయ్యా, యే-ద్వేషపు సంకెళ్లని,
తెగనివి కావయ్యా, - యుగయుగముల వైనంగాని- తెగ

1. ఏ కౌటిల్యము వీని - నేర్పఱిచినదో కాని
చీఁకటి గదులున్నే -జగదీశ్వరాలయములో నే ? - తెగ.

2. గుణము లేనివాని దే-కులమైనను నేమి ? యే
తృణమైనను నేమి - శ్రీ చరణ మంటునేని?- తెగ.

3. మాలలమే మా పనికి - మాలిన వారమొ - యేమొ ?
శ్రీ లలితేశ్వర గళనవ-మాలా కుసుమాల మేమొ?- తెగ.

రేచి—కృష్ణయ్యగారూ ! మీ రీలాగున మా మాలపిల్లలను వెంటఁ బెట్టుకొని తిరుగుటచేత, ఈ కామందులు మా నోళ్లలో మన్ను గొట్టుచున్నారు. బాబూ ! దయయుంచి యీ యూరేఁగుటలు మానుఁడు.

కృష్ణ—ఓయీ! ఈ కామందులు మందులు. వారిమాట పాటింప నక్కఱలేదు. వారి ప్రాపువలన మీకుఁ గల్గిన నష్టమంతయు మేము భరింతుము లెమ్ము. అనుఁగోతమనీనికి నేఁ డక్షరాభ్యాసమహోత్సవ మొనర్పనై యున్నాము.

అతఁడు—మాబావ జ్యోతిషమే నిజమయి—కృష్ణుఁడు రాజ్య శ్రీలంగాంచునేని, మీ పంచమకులము ప్రథమకులముగా మార్చివైవఁగలఁడు. ఇంత చిన్నవయసున నుండియు, నాతఁడు మీపైఁబడు జాలి వర్ణింపఁదరము కానిది. అది యెంతయు సంస్తవనీయము గదా? ఇప్పుడీసంఘమాతనిని సంతోషపెట్టుటకే బయలు దేఱఁదీసితిమి. చిన్నితమ్ములారా! యీపాట పాడుఁడు.

(కృష్ణయ్య పాటఁజెప్ప, మాలలు వానితోఁ గలసిపాడుదురు.)

ఏ జాతివాఁడవో - యే బ్రాహ్మణుఁడవో
తేజమే చెడి - దేవదేవు నడుగులను విడి - యేజాతి.

1. బిగిసె సిగలోఁ గులము - బిగిసె జందెపుఁ ద్రాళ్లఁ
సగము కుళ్లితి వైనఁ - దెగదు తెగదందువా?-యేజాతి.

2 వాఁడు వాదనెదవు - మీఁదు క్రిందనెదవు
బీదసాదల ప్రభుని - విడిచి మతమనెదవు-యేజాతి.

3. లోనఁ జీఁకటి రొదలు - పైని ద్వేషపు గదులు
వేదకాలము నాఁటి - వెలుఁగు నాదనెదవు-యేజాతి.

వెంక—అక్కయ్యా! చూచితివా, నీ జ్ఞాతిచర్య? ఇప్పుడే మందువు?

వెంకమ్మ—తమ్ముడా! నీ మాట కాదనను. కాని, వాని పాటలో నెంతో భావము గలదనియు, వాని నతడ చెడ్డని కాదనియు, నామనస్సునకుఁ దోఁచుచున్నది.

వెంక—సరే. నీకును నటులే తోఁచెనా? నీవు కూడ వారి మతము గ్రహింపుము.

దీక్షి—బావా! నీవు వృథాగా బాధపడుచున్నావు. కాని యేమియు లాభము లేదు. కాలప్రవాహము ననుసరించి యెల్లరుఁ బోవక తప్పదు. నా కిఁక సెలవిమ్ము. ఒక గొప్ప యింట సంభావనపుఁబద్దు వేయించుకొనవలెను. దానికై ముందుగాఁ బొట్టిరామన్నను బ్రతిమలాడవలయు.

వెంక—పొట్టివానికిఁ బుట్టెఁడు బుద్ధులు గదా? పద.

(నిష్క్రమింతురు.)



# శీలవతి.

## చతుర్థాంకము.

---

### ప్రథమరంగము.

---

రంగము:—నరసన్నభట్టు నిల్లు.

ప్రవేశము:—నారాయణశాస్త్రి, పుల్లయ్యశాస్త్రి.

నారా—ఓరీ! పుల్లయ్యా! నా ప్రయాణమునకు గురువుగారు రేపే సుమీ ముహూర్తము పెట్టిరి?

పుల్ల—ఆలాగుననా? నారాయణా! నీ వదృష్టవంతుఁడవురా. చక్కఁగా విద్య ముగించి, స్వతంత్ర జీవన మొనరించుటకుఁ బోవుచున్నావు.

నారా—ఏ మదృష్టమురా? పదునాల్గేండ్లయి వచ్చితిఁగదా? ఇన్నాళ్లకు మూఁడు శాస్త్రములు మాత్రము ముగిసినవి. అంతే గదా?

పుల్ల—నేను నీకన్న రెండేండ్లు ముందుగా వచ్చియుఁ గావ్య పంచకమైన ముగింప లేకుంటిని.

నారా—నీ కొకవ్యావృత్తియా? అన్ని పనులును నీకే కావలయుఁ గదా? ఇంటెఁడు చాకిరీయు నీ వొక్కఁడవే యేల చేయుదువురా? మొదలే మందబుద్ధివి గదా, దానికిఁ దోడీ పనులేలరా? ఒక్కనాఁడేని పట్టుమని యొకగంట సేపు చదివిన పాపానఁ బోలేదు గదా?

పుల్ల—ఏమి చేయుమందువురా? గురువుగారే కాక, యూరిలోని వారెల్లరు నాకే పనుల నియోగింతురు. ఇఁకఁ జదువెట్లు సాగును? నాకుఁ దోడుగా గురువుగారి రెండవ కొడుకున్నాఁడు. కాని, వాఁడు తిండికిఁ దిమ్మరాజు, పనికిఁ బోతురాజు. వాఁ డే పనియుఁ జేయఁడయ్యె.

నారా—ఆకారణముననే గురువుగారు మి మ్మిరువురను జేర్చి యొకకాఁడి యెడ్లుగా నుపయోగించుకొనఁ జూచుచున్నారు.

పుల్ల—నే నెద్దున్నరలాగునఁ బని చేయుచుందును. మెప్పు లేదాయె.

నారా—ఓరీ! వారి మెప్పుల కాసించియు, దెప్పులకు భయపడియు నఁటరా నీవు మెలఁగవలసి వచ్చుట? నాల్గుముక్కలు చదువుకొని బాగుపడవలెనని కాదా? నాకెవ్వరును బనులేల నియమింపరు? చదువుకొనుచుండువానికిఁ జూచి చూచి పను లెవ్వరును జెప్పరని యెఱుఁగుము. మన కండ్లయెదుటఁ బుట్టిన యనువోతయ్య

యెంత చులుకుగా విద్య నేర్చుచున్నాఁడో చూచితివా ? కృష్ణసూరిగారి కొడుకు, సోమేశ, యెంతవాఁడైనాఁడో చూడుము.

పుల్ల—వారివి యుద్దండపుఁ దెలువులురా? నాకొక్క శ్లోకము కంఠస్థముగా వచ్చుటకు మూఁడు నాల్గుదినములు పట్టును. వారు దినముననే పదిపండ్రెండు శ్లోకము లవలీల నప్పగింపఁ గలరు. వారికి నాకు సామ్యమా ?

నారా—అందుకొఱకే గురువుగారు నీకు మొద్దబ్బాయి యను పేరు పెట్టిరి. అది నీ కెంతయు సార్థకమే గదా ?

పుల్ల—సరస్వతి యెల్లరకు నొక్కరీతిగా నలవడునా ? కృష్ణ సూరిగారు తండ్రిని మించిన పండితులగుటయేమి, యతని తమ్ముఁడు. వెంకటేశము, పండితపుత్త్రుఁడని పిలి పించుకొనుటయేమి ? ఎవ రెంత పెట్టిపుట్టిరో, యంతే లభించును.

నారా—అది నిజమే. కాని, మనుష్యప్రయత్నము కూడ లెస్సఁగా నుండవలయుఁ గదా ? అంతయు దైవము మీఁదనే త్రోయుట తగవా ?

పుల్ల—ఇన్ని పుస్తకములు చదివి, యింత జ్ఞానమార్జించిన మీరు, హాస్యప్రసంగము వచ్చినప్పుడు, నాచే జయింపఁ బడుచుందురేమి ? అదియు దైవనిర్మాణమే గదా? నాకుఁ

బ్రసంగములలోఁ దెలివిదేటల నిచ్చినవాఁడును దేవుఁడే. మీకుఁ బ్రబంధములలోఁ బ్రజ్ఞ నిచ్చినవాఁడు నాతఁడే. ఏమందువు ?

నారా—ఇంక నీ వాధోరణిలోనికి దిగిన, నీతో మేము భాషింపలేము. దాని కేమి గాని, యిప్పా డనువోతయ్య కావ్యపాఠము లెంతవఱకుఁ జదివినాఁడు ?

పుల్లి—చెప్పకొన్న సిగ్గు! నాకన్న నేను వెనుకలలో నుండియుఁ బదిదినముల క్రింద నన్నుఁ గలసికొన్నాఁడు. ఈ నడుమ మా కిరువురకు గురువుగారు భారవి యొక్కనాఁడే మొదలు పెట్టిరి. నే నింకను మొదటి సర్గలోని మొదటి పుటలోనే యుందును. అతఁడు రెండు సర్గలు పూర్తిగాఁ జదివి యున్నాఁడు. శీలవతీదేవి మిగుల నదృష్టవంతురాలు సుమీ ?

(ప్రవేశము:—శీలవతి.)

శీల—నాయనలారా! మా యబ్బాయి యున్నాఁడా ?

నారా—గురువుగారితోఁ గూడి పొలమునకుఁ బోయి యున్నాఁడు. ఒకజాము ప్రొద్దెక్కుదాఁక నచ్చటనే యుందు మని వారు చెప్పిపోయిరి.

శీల—(తనలో) ఓహో! నేఁడే కదా తండ్రిగారు నా బిడ్డకు శస్త్రవిద్యోపదేశముం జేసెదమని సెలవిచ్చి యుండిరి ?

అందులకే కాఁబోలు, మా బాబు నింతసేపు పొలములో నిలిపిరి. ఆ మహామభావుని సంకల్పము లెల్ల సిద్ధించి మా నాయన వంశోద్ధారకుఁ డగును గాక. (ప్రకాశముగా) అయ్యా! మా పిల్లవాఁడు రాఁగానే, వానిని ముందుగా నవ్వగారి కడకుఁ బోవలసిన దని నాయాజ్ఞగాఁ జెలుపుము.

నారా—అమ్మా! అంత ముందుగాఁ బోవలసిన పనియేమి వచ్చెను?

శీల—నాయనా! నేఁడు వాని పదుమూఁడవ జన్మదినము. అవ్వగారు వాని కారతు లిచ్చి, తలయంటి, క్రొత్త యుడుపులు గట్టఁ బెట్టుదురఁట. వానికై యామె పేరఁ టాండ్రితో నెదురు చూచుచున్నారు.

నారా—ఓహో! ఆలాగైన, మన యనువోతయ్యకు బాల్యావస్థ దప్పి కౌమారము ప్రారంభమైన దన్నమాట. నేఁడేదో యొక క్రొత్తవిద్య యతనికి నేర్పుటకే కావలయు, గురువుగా రింతసేపు తడసిరి!

శీల—అవును బాబూ! వాని కస్త్రవిద్య నేర్పెదరఁట.

పుల్ల—ఓయి నాయనో! అస్త్రవిద్యయే? అది నేర్చి మా యందఱిమీఁద బాణములు ప్రయోగించును గాఁబోలు?

నారా—వడిచినట్టులే యున్నది, నీ తెలివి! నిన్నుఁ గొట్టియేమి, వీధిలోని కుక్కను గొట్టియేమి? గురువుల సంకల్పము మహత్తరమై యున్నది. అమ్మా! మీ నుడులు వినుటకు నా కెంతయు సంతసము గల్గుచున్నది.

మ. అలగాధేయుఁడు రామచంద్రునకు శ స్త్రాస్త్ర ప్రయోగంబు సం
ధిలఁ జేయంగని, క్రూరరాక్షసులమర్దింపంబ్రయత్నించిన
ట్టులు, భట్టారకుఁడట్టి మేల్దలఁపొకం దుంగాంచెఁగాఁబోలు, ని
ర్మలకీర్త్యాయతినీకుమారునకుఁగూర్పంజిత్తమం దెంచుచున్

శీల—నిజమే. బాబయ్యగారి కేదో మహితోద్దేశమే యుండును.

నారా—తల్లీ! గురువుగారి చర్యం గూర్చి లెస్సఁగా యోజింపఁగా, మీ నందనునకు నతని పితృపితామహాదులకుం గల్గని మహోచ్ఛస్థితి భావికాలమునఁ జేకూఱనై యున్నదని నాకుఁ దోఁచుచున్నది.

మ. దనుజాగ్రేసరుఁడై పవిత్రకుల విధ్వంసంబు గావించి, త
ద్ఘనసంపత్తులఁ గొల్లగొన్న రిపువున్ ఖండించి దండింపఁగాఁ
జనుసామర్థ్యము చేకుఱన్ గురుఁడుశిక్షాదీక్షలో మీకుమా
రుని బెట్టందలఁపూనఁగావలయు నిర్ధూతాఖిలాకాంక్షుఁడై.

శీల—కావచ్చును. మా బాబును మాత్రము రాఁగానే పంపుమీ!

(నిష్క్రమించును.)

పుల్ల—ఈ యమ్మ దెంతటి సాత్త్విక స్వభావమురా! ఇన్నాళ్లనుండి యీమెను జూచుచున్నాము గదా? పల్లెత్తి యీమె యొక్కవలు కాడఁగా మనము చూడలేదు గదా?

నారా — బ్రతికిచెడ్డ పడఁతి. ఆమె కట్టి గుణములుండుట యబద్ధమా ?

పుల్ల — ఆమె మాటకేమి గాని, నారాయణా ! మన విద్య ముగించి యిండ్లకేఁగిన తర్వాతఁ బ్రాయశ్చిత్తకర్మముఁ జేసికొనవలయుఁ గాఁబోలు ?

నారా — ఎవనికిరా ప్రాయశ్చిత్తము ? నీకుఁ గావలసియున్న, నీవు చేసికొనుము. నా కక్కఱలేదు. " శ్లో. ప్రాయో నామ తపఃప్రోక్తం । చిత్తన్నిశ్చయ ఉచ్యతే । తపో నిశ్చయయోగాభ్యామ్ । ప్రాయశ్చిత్త ముదీర్యతే." అనిగదా పెద్దలు ప్రాయశ్చిత్తశబ్ద నిర్వచనముం జేసిరి ?

పుల్ల — ఇవన్నియు నాకుఁ దెలియవు. కాని గురువుగారి చర్య తప్పు గాదనియే నీ వందువా ?

నారా — కాదనియే నా దృఢవిశ్వాసము. నా విశ్వాసమును మార్చికొనను. దానిని నిలువఁ బెట్టుకొనుటకై వలయుచో నా పెద్దలయాజ్ఞను ధిక్కరింతును.

పుల్ల — నా కట్టిది సాగదురా. గురువుగారి సంఘసంస్కరణోద్దేశములు, సమస్తాంధ్రదేశమును వ్యాపించియున్నవి. మా నాయనకును దెలిసినవి. మొన్న మకరసంక్రాంతికి నే నింటికి వెళ్లినప్పుడు పంచగవ్యము లిప్పించిన పిమ్మటనే నన్ను లోపలికి రానిచ్చిరి. ఆ కారణముచేత, నింటికిఁ బోకుండుటయే మేలని నాకుఁ దోఁచుచున్నది.

నారా__పోవు. మాధుకరభిక్షుతోనే యుండే శాశ్వతముగా జీవింపుము. ఇంటికిఁ బోయి మాత్ర మేమిచేయుదువు?

పుల్ల__ఏమి చేయుదునా? పెండ్లాడుదును. సుఖముగాఁ గాఁపుర మొనర్తును. ఎల్లకాల మీ బ్రహ్మచర్య దీక్ష లోనే గురువులు నన్నుండు మందురా?

(ప్రవేశము—నరసన్నభ ట్టనుపోతునితో)

నర__ఓరీ! మొద్దబ్బాయి! శాశ్వత బ్రహ్మచర్య దీక్షలో నుండుమనియే బ్రహ్మ నీ నొసటను వ్రాసినాఁడురా.

పుల్ల__అయ్యా! తమరే యట్లు పల్కిన నా ముందు గతి యేమి? నన్నొక యింటివానిగాఁ జేయరా?

నర__అది నీలో నున్నది. విద్యాకృషి యేమియుఁ జేయ వైతివి. సదా సోమరివై యుండఁ గోరుదువు. చూడు మీ చిన్నిపాపని. నీ కండ్లయెదుటఁ బుట్టిన యీ యనుపోతుని! ఇతఁడు విద్యలో నిన్ను మించిపోయినాఁడని యెఱుఁగు దువా? నీతో సమానముగా విద్యారంభ మొనర్చిన మా సోమేశము చదువు ముగించి ద్వ్యర్థికావ్యరచనకే పూని యున్నాఁడు గదా!

పుల్ల__ఎంత చదివిన నంత మంచిదని చదువుకొనుచున్నాను. కాని నేను మాత్రము గట్టిగాఁ దలపెట్టిన, ద్వ్యర్థికావ్యమే గాదు, త్ర్యర్థికావ్యము కూడ రచింపలేనా?

నర—(నవ్వుచు) అంతటి సమర్థుఁడవే. ఎల్లకాల మిట్లు చదువు కొనుచుందుము. దాననే నీకుఁ బరిణయ మక్కఱలేదంటిని.

పుల్ల—పోనిండు. నే నాంజనేయునివలె బ్రహ్మచర్య దీక్ష లోనే యుండి కీర్తిపొందెదను లెండు.

నర—చేష్టలచేఁ గోఁతివంటివాఁడవే. ఇఁకఁ దోఁకయొక్కటే నీకుఁ దక్కువ. దానినిం గూడఁ బెట్టుకొనుము. ఓరీ! నారాయణా! నీ ప్రయాణమున కన్నియు సిద్ధము చేసి కొనుము. నీవు మీ తండ్రికడ కేఁగి గృహస్థాశ్రమ స్వీకార మొనరించి యందుఁ గొంతకాలముండి మరల రమ్ము. మన యనుపోతయ్య మరల మహారాజగుకాలము సమీ పించుచున్నది. అప్పుడు నీవు మా సోమేశముతోఁ బా టాతని యాస్థానకవీశ్వరుఁడవై యుందువు గాక!

నారా—ఆర్యా! ధన్యుఁడను. ఇదె యభివాదము లర్పించు చున్నవాఁడను. (నమస్కరించి, లేచి)

చ. కొమరులతోడ సాటియగు♦కూరిమి యొప్పఁగ నన్నుఁ బెంచి, శా
స్త్రమహితమర్మముల్ గఱపి, ♦ జ్ఞాన సులోచనముల్ వికాస భా
వము గనఁజేసి, భావిసుఖ♦పద్ధతులున్ మది నేర్పరించి, న
న్దమిమెయిఁ బ్రోచినట్టి కరు♦ణాపరిపూర్ణుఁడవౌ మసద్గురూ!

అనువోతయ్యా ! నీకడఁ గూడ సెలవు గైకొనుచున్నాను. దైవానుగ్రహముచేతను, గురువరుల యాశీఃప్రభావముచేతను, నీవు కర్ణమ్మగారి కుమారుఁడవుండ వగుభాగ్యమే కల్గునేని, సింహపీఠిని గూరుచుండి నీవు నిండుకొలు వుండునపుడు నీ దర్శన మొనరింతును. అయ్యెడ నీపేదబాపనుని విస్మరింపకుమీ ! సాందీపనికడఁ జదువుకొన్న కుచేలకృష్ణుల చరిత్రము మదిని నిల్పుకొనుము.

అను—సోదరా ! నీ యాశీస్సునకుఁ బాత్రుఁడనై నేను నిన్ను విస్మరింతునా ?

తే. గీ. తన సహాధ్యాయుఁడౌ కుంభ♦జుని మఱచిన
పార్షదుని పాటు గురువుల ♦ వలన వినియు
గర్వినై సహాశిష్యు నే ♦ కరణి మఱతు ?
చెలిమికన్న నధికమౌనె ♦ కలిమి బలిమి ?

నర—నారాయనా ! మంచి మాటాడితివి. నేఁటి పాఠమునకు రెండు శ్లోకములు మాత్రము చెప్పి విడిచిపెట్టెద. పుస్తకముం దెచ్చుకొనుము. పుల్లయ్యా ! నీవు కూడఁ బుస్తకముం దీయుము.

పుల్ల—చిత్తము. శీలవతీదేవి తన కుమారుని శీఘ్రముగా లోపలికిఁ బంపుమన్నది. నేఁ డాతని పుట్టిన దినమఁట. అవ్వగారు ముత్తయిదువలతో నారతు లిచ్చుట కెదురు చూచుచున్నారఁట.

సర__అది యెటులగియుండినయే నేటికి రెండు శ్లోకములే చెప్పెద నంటిని.

(అనువాదకుడు, పుల్లయ్యయుఁ బొత్తములం దెచ్చికొని నిలుతురు.)

నాయనలారా! కూర్చుండుఁడు. ఇదే నేనొక శ్లోకముం జదివి యర్థముఁ జెప్పెదను, వినుఁడు. ఒక్కమారే చదివెదను. మీరు శ్రద్ధగా విని, వెంటనే దాని నప్పగింపవలయు. చూతును గాక మీ ధారణశక్తి. (చదువును.)

"శ్లో. సహసావిదధీత నక్రియా।మవివేకః పరమాపదాంపదమ్
వృణుతేహి విమృష్యకారిణం।గుణలుబ్ధాః స్వయమేవ
సంపదః."

క్రియామ్=పనిని, సహసా=శీఘ్రముగా, నవిదధీత=చేయఁగూడదు. అవివేకః=వివేకింపకపోవుట, పరమాపదాంపదమ్=విస్తారమైన యాపదలకు స్థానమగును; గుణలుబ్ధాః=గుణముల యం దాశగల్గిన, సంపదః=సంపత్తులు, విమృష్యకారిణం=విమర్శించి చేయువానిని, స్వయమేవ=తమంతట తామే, వృణుతేహి=వరించుచున్నవి.

తా. త్వరపడి యేపనిని జేయఁగూడదు. ఆలోచింపకపోవుట గొప్ప యాపదలకెల్ల మూలమగును. విమర్శించి కార్యములు చేయువానిని సంపదలు తమంతట తామే వరించుచున్నవి.

అను—(చిఱునవ్వుతో) తాతగారూ! మరల నీ శ్లోకముం
జదువుమని సెలవా ?

నర—నాయనా! చదువుము నీ యత్యద్భుతధారణ వెల్ల
డింపుము.

అను—చిత్తము. (ఇంచుక తడవుకొనుచు శ్లోకము నప్పఁ
జెప్పును )

నర—మేలు! బాలకా! మేలు, మేలు. పుల్లయా! నీవు
కూడ నప్పగింపుము.

పుల్ల—తొందరపడి యేకార్యమును జేయరాదని తమరే సెల
విచ్చితిరి గదా! నేనేల తొందరపడి యప్పగింపవలయు ?

నారా—ఈ కుయుక్తులేల? నాకు రాలే దనుము.

పుల్ల—ఏమంత మునిఁగినదని నామెదడు పాడుచేసికొని శ్లోక
మంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకోవలయును ?

నర—నీ తెలివికి మెచ్చితిమి. ఇఁకఁ బుస్తకము మూసి నీళ్లు
తోడుటకుఁ బెరటిలోని కరుగుము.

పుల్ల—అలాగుననే వెళ్లెదను. కాని నాకొక్క యనుమానము
గలదు.

నర—అదేదో చెప్పుము. దానిని దీర్చెదను.

పుల్ల—మీా రిప్పుడు చదివిన శ్లోకము, మన యనువోతయ్య
నేఁడు చదువవలసిన పాఠములోనిదే గదా?

నర—అవును. అయినచో ?

పుల్ల—ఆతఁ డీపద్యమును ముందే చదువుకొని లెస్సఁగా వల్లె వేసి యుండుటచే నిట్టు లొక్కసారి విన్నంతనే యప్ప గించినట్లు నటించినాఁడేమో! లేక మీరే యతనిచే నీ నాటక మాడించి నన్నుడికింప నెంచితిరో!

నర—ఓరి మొద్దబ్బాయి! ఎంతటి గొప్ప యాలోచనలురా, నీవి? ఇది రెండవసర్గలో ముప్పదవ శ్లోకము. మఱి యొక్కటి నీ యిచ్చవచ్చిన చోటఁ దీసి యిమ్ము. చూతువు గాని.

పుల్ల—సరే. (భారవిఁ దీసి కండ్లుమూసికొని యొకచోటఁ దెఱచును.) అయ్యా! ఇదే పదుమూఁడవ సర్గలో నేడవ పద్యము వచ్చినది దీనిని జదివి యర్థముం జెప్పేఁడు. చూతును గాక యీతని జ్ఞాపకశక్తి.

నర—(పుస్తకముం బుచ్చికొని యిట్లు చదువును.)

శ్లో. మునిరస్మి నిరాగసః కుతో మే | భయమిత్యేష నభూత
యేఽభిమాన

పరవృద్ధిషు బద్ధ మత్సరాణాం | కిమివహ్యాస్తి దురాత్మనా
మలంఘ్యమ్.

అస్మి=నేను, ముని=మునిని; నిరాగసః=దోషరహితుఁడను; మే=నాకు, భయం కుతః=భయ మెక్కడిది?; ఇతి=అని చెప్పి, ఏష అభిమానః=ఈ యహంకారము, నభూతయే= మేలుకొఱకుఁ గానిది; పరవృద్ధిషు=ఇతరుల యభివృద్ధి విష

యమైు, బద్ధమత్సరాణామ్=కట్టఁబడిన యసూయగల్గిన, దురాత్మనామ్=దురాత్ములకు, అలంఘ్యమ్=దాటరానిది, కిమ్ ఇవ అస్తి=ఏమున్నది ?

తా. "నేను మునీశ్వరుఁడను, దోషములు లేనివాఁడను, నాకు భయ మెందులకు ?" అని చెప్పెడు గర్వము శ్రేయస్సు గల్గింపనిది. ఇతరుల వృద్ధిని గూర్చి గట్టియసూయ గల్గిన దురాత్ములకు నతిక్రమింపని దేదియు లేదు గదా ?

నాయనా ! నీ భావివర్తనమున కనుకూలించు నీతిని నేర్పు శ్లోక మిది. పుల్లయ్య వెదకి మంచిదే యిచ్చినాఁడు. ఏదీ, యప్పగింపుము.

అను—(అవలీల నప్పగించును.)

నర—ఇప్పు డే మందువు పుల్లయ్యా ? గుడ్లుమిటకరింతు వేల? అనువోతయ్యా ! నేఁటి కిఁకఁజాలును. నీవు లోనికేఁగుము. మీాయమ్మ పిలిచినదఁట. (అనువోతుఁ డేగును.)

నారాయణా! చూచితివా, యాతని యేకసంథాగ్రాహిత్వము? నీవు నాల్గయిదు సారులు చదివి పద్దె మప్పఁగింపఁగలవు. ఈ మొద్దబ్బాయి నూరుసారులు చదివినను శ్లోకము కంఠస్థము చేయఁజాలఁడు.

నారా—అనువోతయ్యది మన సోమేశమునకుండు కుశాగ్రబుద్ధి.

నర—కుశాగ్రబుద్ధియే గాదు. సద్వినయము, సౌహార్దము, సౌజన్యము, సౌశీల్యము—ఇవి యెల్ల నతని యందిమిడి

యున్నవి. ఇవి భావికాలమున నాతనికి మహోపకార మొనరించునవి. ఓయీ! నీ వీక నీ ప్రయాణసన్నాహ మును గావించుకొనుము. పుల్లయ్యా! నీవు విద్య ముగించి యీ యానందముతో మా యిల్లు విడుచుభాగ్యము గాంచఁజాలవు. నీ యిచ్చవచ్చినన్నినా ళ్లుండుము. అవల నీదారి నీవే చూచికొనుము.

పుల్ల—అనుకోతయ్య రాజైన తర్వాత నన్ను మాత్రము పోషింపఁడా ?

నర—పోషింప కేమి ? ఎందఱనో యనాథలను బోషించును. వారితోఁ బాటు నీవును నుండవచ్చును. కాని,నారాయణున కుండు గౌరవము నీ కెట్లు వచ్చును ? నీ వంతియే పెట్టి పుట్టితివి. పద.

(పుల్లయ్య లోని కేఁగును. తెరపడును.)



ద్వితీయరంగము.



రంగము—ఒక చావడి.

ప్రవేశము:—పుల్లయ్యశాస్త్రి, చాకలి పుల్లిగాఁడును.

పుల్ల—ఓరీ, పుల్లిగా ! గురువుగారు ప్రయాణమునకు సిద్ధపడి యున్నారేమో చూచిరా.

పుల్లి—బాబూ! పయన మెక్కడి కండి?

పుల్ల—ఎఱుఁగవఁటరా?

పుల్లి—నా కెఱుక లేదు బాబూ!

పుల్ల—నేను, గురువుగారు, అనువోతయ్య, కొంత వేఁట సిబ్బందితో నేఁడు వేఁటకై యరణ్యప్రాంతముల కేఁగెదము.

పుల్లి—బాపనయ్యలు గదా, మీాకు వేఁట యేఁటికయ్యా?

పుల్ల—మే మందఱమును బ్రాహ్మణులము గామే. అనువోతయ్య యనఁపసీత క్షత్రియుఁడు. అతనికి గురువుగా రస్త్ర విద్య నేర్పినారు. వినోదమునకై వేఁటకుఁ గూడఁ దీసికొని పోవుచున్నారు. వారితో నేను గూడ వెడలి, నాకు శక్తిగలిగినంత సాయము చేయుదును.

పుల్లి—నీ వేమి సాయము సేయుదువయ్యా? దారిలో నిన్ను మేపలేక వారు బాదలు పడెదరేమో!

పుల్ల—ఓరి, మూర్ఖుఁడా! ఎంతమాట యంటివి? నన్ను మేపుటకు నేనేమి పశువు ననుకొంటివా?

పుల్లి—బాబూ! పశువు కన్న నెక్కువవాఁడవు. మొన్న నీవు తిన్న మామిడిపండ్లు మానిసి తినఁగలఁడా? కుడిచి కూర్చుండి గంపెఁడు పండ్లను గడియలోఁ గాఁజేసితివే! నీ వెన్నియన్నను, నీది గేదె తిండియే, బాబూ! మా జాతిలోని వారు కూడ నీ తిండి తిని యఱిగించు కోలేరు.

పుల్ల—ఓరీ, నీకంత యుడుకేలరా ? నీవు మంచి తిండికిఁ బెట్టి పుట్టలేదు. కావున, నీవు తినఁజాలవు. పూర్వజన్మమున నే నితరులకుఁ బెట్టితిని గానఁ గడుపునిండఁ దినఁగలను.

పుల్లి—బట్టలు గుంజి గుంజి యాయాసపడి యింటికి వత్తును. అయినను, నీవు తిన్నంత తినలేను. నీ వేపనియుఁ జేయక యే యంత తిండి యేలాగునఁ దినఁగలవయ్యా ?

పుల్ల—నేను నీపని, నీ గాడిదపనియుఁ జేయుదును. నేను గూడ నీవలెనే గురువుగారియింట మడికిపలయు బట్టలన్నియు గుంజియిత్తును. నీ గాడిద కన్న నెక్కువ బరువు మోచికొని పొలమునుండి కూరగాయలు మున్నగునవి తెత్తును.

పుల్లి—ఇప్పు డట్టి గాడిదపనికే కాఁబోలు, వేఁట సిబ్బందితో నీవు వెళ్లుచున్నావు ? గాడిదచేయు సాయము నీవునుఁ జేయుదువా ?

పుల్ల—ఓరి, బుద్ధిహీనుఁడా ? నేనేమి చేయుదునో నీవే చూతువు గాని, ముందుగా నా ప్రక్క గదిలోని కవచాదులను గొనిరమ్ము. వానిని దొడిగికొని ప్రయాణమునకు సిద్ధపడి యుందును.

పుల్లి—(నవ్వుచు) చిత్తము, మారాజా ! (లోపలికేఁగును.)

పుల్ల—(తనలో) నేను జాకలివానికిఁ గూడ లోకువనైతిని. వాఁడు కూడ నన్నుఁ దృణీకరించుచున్నాఁడే ! నాకు

బాగుగాఁ జదు వంటకపోవుటచేతఁ గదా యీలాఘవము?

(చాకలివాఁడు కవచాదులతో వచ్చును.)

పుల్లి—బాబూ! తొడిగికొనుఁ డీ దుస్తులను. ఎంత సక్కఁగా నుందురో సూతును.

పుల్ల—(కాలికిఁ దొడుగుకొనునవి చేతికిఁ, జేతికిఁ దొడుగు కొనునవి కాలికిఁ దొడిగికొనును. చేఁతగాని వంకరతల పాగ ధరించును.)

పుల్లి—మేలు మేలయ్యా! నాఁడు భారతకథలో నలబృహన్నల యే తొడిగినాఁడు, నేఁడు నీవే తొడిగితివయ్యా కవచాదులు! అతఁడు చేఁతగానట్లు నటించినాఁడు. నీకు నిజముగాఁ జేఁత కాకున్నది. అంతియే భేదము.

పుల్ల—నాకు మంచి యుపమానము చెప్పితివి రా. నే నా బృహన్నలవలెనే మ మ్మెదుర్కొను జంతువులనెడు వీరులను సమ్మోహనాస్త్రములు వైచి పడఁగొట్టుదును. డంబములు గొట్టుటలో నుత్తరుఁడని చెప్పఁదగ్గ యనువోతునికి నేనే సంపూర్ణ జయము చేకూర్చి తీసికొనివత్తును. (వీథిలోఁ బుల్లిగానిగాడిద యోండ్రపెట్ట విని యులికిపడును.)

పుల్లి—వెఱ్ఱి బాపనయ్యా! నీ వంత గొప్పవాఁడవే. మన గాడిదకూఁతకే నీ చేతనాలు సెడినవి గదా, యింకఁ బెద్ద

పులులు, సింగాలు, అడివిపందులు, మొదలయిన క్రూర జంతువుల యార్పులు విన్నను, వాని నెదుటఁ జూచినను, నెట్టు తాండవ మాడుదువో, యెంతగాఁ బాఱుదువో! మాటలలోను, గూడు దినుటలోను వీరుఁడవే.

పుల్ల—నోరుమూయుము. నేనంత చేతగానివాఁడ నను కొంటివా? గట్టిగాఁ దలఁచుకొన్న మాబ్రాహ్మణులు చేయఁజాలని పను లుండునా?

పుల్లి—ఆ మాట నిజమే. గట్టిగాఁ దలఁచుకొనుటకు నీకు మెదడున్నఁ గదయ్యా, నీ సేఁతలకు వీలుగల్గుట? వయసు మీఱినను, నరసన్నగారి పట్ల, ఆ మాటలనుము. నే నొప్పుకొందును.

(ప్రవేశము:—నరసన్నభట్టు)

నర—ఏమిరా, చాకలీ! మా మొద్దబ్బాయితో వాదించు చున్నావు?

పుల్లి—బాబూ! ఈపుల్లయ్యగారు వేఁటలో జంతువు లన్నిటిని బొడిచివేసి యనువోతయ్యగారికి సాయము చేసెద రంట. అందుకొఱ కెంత బాగుగాఁ దయారైరో చూడుండి.

నర—(పుల్లయ్య వంకఁ దేఱిచూచి) ఓరి మూర్ఖుఁడా! యి దేమి కవచధారణమురా?

పుల్ల—అయ్యా! నా కెట్లు తెలియఁగలదు? "ఇది కాలికి, నిది చేతికి" అని మీరు దుస్తులపై లిఖించి యుంపవలెనెతిరి.

నర—భోజనసామగ్రిలలో "ఇవి భక్ష్యములు, ఇవి భోజ్యములు, ఇవి చోష్యములు, ఇవి లేహ్యములు, ఇవి ఖాద్యములు" అను భేదములు లిఖింపకుండఁగనే తెలిసికొనఁగల్గు నపూర్వ మేధాశక్తి నీ కలవడినట్లు లీ కవచధారణము పట్ల నలవడ లేదు కాఁబోలు. ఇఁకఁ దెలివితక్కువ ప్రసంగము మాని మాతోఁ బయన మయ్యెదవా, లేదా?

పుల్ల—రా కేమి? నే నాతయారులోనే యుంటిని.

నర—ఓరి పుల్లిగా! అనువోతునికి వలయు దుస్తులన్నియు నుతికి తెచ్చితివా?

పుల్లి—తెచ్చితిని, బాబూ!

నర—నీవు మన గారయ్యదొర దగ్గఱకేఁగి వేఁట సిబ్బందితో సిద్ధముగా నుండుమనుము. అప్పన్నను బండ్లు కట్టించికొని ర మ్మనుము. నీవు కూడ మాతో రావలయు.

పుల్లి—చిత్తము, బాబూ! పుల్లయ్యగారి వేఁటతెలివి చూడ వలయునని నాకును గోరిక గలదు.

(నిష్క్రమింతురు.)



## తృతీయరంగము



రంగము:—అటవీప్రదేశము.

ప్రవేశము:—అనువోతుఁడు, నరసన్నభట్టు, పుల్లయ్యశాస్త్రి, పుల్లిగాఁడు, వేఁట సిబ్బంది.

అను—తాతగారూ! నాకు మీరు నేర్పిన యస్త్రవిద్యాలక్షణము లక్ష్యసమన్వితము చేయుటకే గదా. న న్నీయరణ్యసీమకుం దోడ్కొని వచ్చితిరి?

నర—అవును బాబూ! అలనాఁడు శ్రీరామచంద్రుఁడు విశ్వామిత్రప్రేరితుఁడై కాననప్రదేశమునకేతెంచి తాటకాసుబాహుల సంహరించి సాధుజనులకు మహోపకృతిం గావించిన విధమున, నీవు కూడ దుష్టసంహారముం బొనరించి మముబోంట్ల కుపకారము చేయవలసి యున్నది.

అను—తాతగారూ! తమ మాటలు నాకర్థము కాలేదు. మీరు విశ్వామిత్రసంకాశులరు కావచ్చును. నేను మాత్ర మా శ్రీరామునితోఁ బోలికకుఁ దగను. అది యట్లుండ నిప్పుడిం దెవ్వరు రాక్షసులు గలరు?

నర—వారు ముందు ముందు నీకే గోచరింతురు. ప్రకృతమున రక్కసుల క్రౌర్యము వహించి మనుజులం దినుచుఁ దిరుగు

వ్యాఘ్రాదిక్రూరసత్త్వము లిందున్నవి. వానింజంపవలసి యున్నది. (దూరమున గాంఢుమ్రియని పులియార్పు విననగు)

పుల్ల—(ఉలికిపడి) ఓయి బాబో! పులియార్పే కాఁబోలు వినఁబడుచున్నది. గురువర్యా! నన్నాపులినోటఁ బడవైచి నా బాధఁ దప్పించుకొనుటకా, యీ యరణ్యములకుఁ దీసికొని వచ్చితిరి?

నర—ఓరి మూఢుఁడా! నీ యట్టి వెఱ్ఱిపుల్లయ్యలను బులుల బారినుండి తప్పించుటకే మనము వచ్చితిమి. ఆ పని మన యనువోతుఁ డవలీల నెఱవేర్చును. నీకేల యీ వెఱపు?

పుల్ల—పులియే నాకంటఁ బడిన, నా ప్రాణము లప్పుడే పోవును. కావున నన్నెటులఁ గాపాడెదరో, మీదే భారము.

పుల్లి—ఏమయ్యా! మొన్న యన్ని బడాయి మాటలాడి యిప్పుడీలాగున భయ పడెదవేమి?

పుల్ల—ప్రాణమున్న నందఱ కాశయే గదా? ఆ పులి యెదుటికి రానీ, నీ వైఖరి మేమును జూతుము. నేను దెలివి గల్లువాఁడ నగుటచే, ముందు జాగ్రత్తను బడుచుంటిని.

అను—(నవ్వుచు) దూరమునఁ బులి కన్పట్టినంతనే, ముందుగా ని న్నే వృక్షాగ్రమునకో విసరివైతుము లెమ్ము.

పుల్ల—అటయిన, నన్నేలాగుననో చంపుటకే మీరు నిశ్చ యించుకొంటిరి కాఁబోలు!

నర—మూర్ఖా! ఊరకుండుము. నీ కెట్టి భయమును లేదు. నీ వంటి మొఱకు మాతో నున్న, మాకు వినోదముగాఁ గాలక్షేప మగుననియే ని న్నిటకుఁ దీసికొని వచ్చితిమి.

అను—తాతగారూ! పుల్లయ్యతో నేమిగాని, వేఁట సప్త వ్యసనములలో నొకటి యని చెప్పుదురు గదా, యది రాజుల కెట్లు ధర్మమగును ?

నర—నాయనా !

చ పరులకుఁ గీడు సల్పక యొ♦పచ్చిక కై మను సాధుజంతులన్
గఱకు శిలీముఖమ్ములను♦గాసిలఁ జేయుట పాపమౌను; భీ
కరముగ హింసఁ జేసెడు మృ♦గంబులఁ జంప నఘంబుగాదు; మీఁ
దర హానిఁగూర్చు పున్నమగు;♦ధర్మ్యమె వేఁటనృపాలకోటికిన్

అను—ఆర్యా ! తమమాట కాదనను. కాని,

తే. గీ. జనన మొందిన దొక్క బ్రా♦హ్మణ గృహంబు,
తినెడు తిండి కేవల సత్త్వ♦గుణ యుతంబు,
మనెడు మన్కి పండిత బృంద ♦ మధ్యసీమ,
సాధ్యమగు నెట్లు నాకు హిం♦సాక్రమంబు ?

నర—బాబూ ! నీవు చెప్పినమాటయు నిజమే. అయినను,

తే. గీ. హరికిశోరంబునకు మద ♦ హస్తియూధ
సంహరణ కార్య మేరీతి ♦ సహజ మగునో
క్షత్రజాతి బాలకునకు ♦ నైత మట్లు
శత్రు నిర్మూలన క్రియ ♦ సాజమగును.

నీ వొక యనుపనీత క్షత్రియబాలుఁడవు నీకు క్షాత్త్రతేజము నైజముగాఁ గల్గుట యబ్బురమా? నీవు మా యింట నుండుటచేఁ బ్రిక్కృతమున నీ తేజము మాటుపడియున్నది. అది బహిర్గతమగు సమయ మచిరకాలములోనే వచ్చును.

పుల్ల—అయ్యో! చచ్చితిని, చచ్చితిని. ఎవఁడో యడవి మనుష్యుఁడు కాఁబోలు, మనవైపునకే వచ్చుచున్నాఁడు. నా వంక నెఱ్ఱనిచూపులఁ జూచుచున్నాఁడు. ఓయి నాయినో! నేఁటితో నా యాయువు ముగిసినది. అమ్మా! నీ యొక్కకొడుకున కెంత గతిపట్టెనే! (ఏడ్చును)

అను—అన్నా! అన్నిటికి నేడుపే? ఆ మాటవికుఁడేడీ? చూపుము. (పరికించును.)

పుల్ల—అదే చూడుము. ఒడలంతయు సవరాలతోఁ గప్పు కొన్నాఁడు. ఒకొక్కసారి నాల్గుకాళ్ల జంతువులవలె నడుచుచున్నాఁడు. అదిగో నిప్పుడు మనవలెనే రెండు కాళ్లపై నిలిచియున్నాఁడు.

నర—ఓరి మొద్దా! అది యెలుగుగొడ్డురా! అడవిమనుష్యుఁడు గాఁడు. ఓరీ! పుల్లిగా! కొన్ని యెండాకులు పోగుఁజేసి మంటఁ బెట్టుము. (పుల్లిగాఁడు మంటఁబెట్టును. ఆ మంటను జూచి యెలుగుబంటి పాఱిపోవును.)

పుల్ల—అమ్మయ్యో! ఇంక బ్రతికితిని.

నర—ఓరీ! నీ వీయడవిలో నడు గడుగునకుఁ జచ్చుచు మరల బ్రదుకుచు నుందువా? ఇంకను ముం దున్నది ముసుళ్ల పండుగ యన్నట్లు లేవ్యాఘ్రిమో, యే సింహమో మరల నెదుర్కొన వచ్చును. అప్పుడు కుప్పిగంతులే వైతువు కాంబోలు! నడువుము. (అందఱును నడిచి పోవుదురు.)

అను—(ఆఁగి) ఆర్యా! ఆదవ్వునఁ గన్పట్టు గ్రామమునకుఁ బే రెయ్యది?

నర—అదియే పెదవీడు. ఈ మైదానముననే తొల్లి నీ జనకు నకును, బూసపాటి మాధవవర్మకును రణము ప్రవర్తిల్లి నది. మాధవవర్మ పక్షమునఁ బోరిన శూరులలో నొకఁ డీనడుమ నాకుఁ దారసిల్లి యీస్థల మాహాత్మ్యముం జెప్పుచుఁ గడపట నీ తండ్రి లొనరించిన సమరక్రీడ యభి వర్ణించినాఁడు. అ దెట్లన—

సీ. అలగున్నమావి పొం♦తలకీడ్చి రెడ్డితే
నిం దన్నె వెన్నమ ♦ నీఁడు నాఁడు
అలతాళ్ల గుంపుల ♦ యం దె కమ్మదొరను
ద్రొక్కె యాచమనీఁడు ♦ దుండగీఁడు
అలగుట్టఁ జుట్టించి ♦ యులయించె మాధవ
ప్రభుని సింగమనీఁడు ♦ పంతగాఁడు
అల తటాకమునందె ♦ యొలయించి ముంచె మ
హావీరు నీ మామ ♦ యాఁగ డీఁడు

తే. గీ. ఇట్టు లరిశూరులం జిక్కి ♦ వెట్టఁగల్గు
వీరశేఖరులయ్యు నీ ♦ పితరు లెల్ల
దైవబల లోపమాత్రాన ♦ దళితులైరి;
యీశ్వరకృప పొసఁగకున్న ♦ నింతె కాదె ?

అను—మహాత్మా ! ఇదియా మా పెద్దల పూతరక్తప్రవాహ ములచేఁ దడిసిన పుణ్యభూమి ? దీనిం గాంచుటచే నా జన్మము ధన్యమయ్యెఁ గదా ?

నర—నిజముగా నీవు ధన్యుఁడవైతివి.

సీ. ఈ పుణ్యభూమియే ♦ నీ పితృబాంధవ
రక్త భాగీరథీ ♦ ప్లావితంబు
ఈ పవిత్ర ధరిత్రి ♦ యే రావువంశ మ
హావీర మరణ శ♦య్యాతలంబు
ఈ పూతధారుణి ♦ యే రవి నిభ పద్మ
నాయక తేజస్స ♦ నాతనంబు
ఈ నిర్మ లావని ♦ యే వెల్మశౌర్య ర
మాలాస్య నేపథ్య ♦ మధ్యసీమ
గీ. అట్టి దీపావన క్షేత్ర ♦ మగుట, బాల !
భవ దమల వంశజాత భూ♦వరుల కెల్ల
నిది కురుక్షేత్రమగు, దీని ♦ మదిని నిలిపి
యాత్ర సేయుట ముఖ్యకా♦ర్యంబు సుమ్మి !

అను—మహానుభావా! తెలిసినది. ఈ పతితోద్దేశముతోనా, నన్నిచటికి మృగయావ్యాజమునఁ గొని తెచ్చితిరి? ఆహా! కృతార్థుఁడను. పితరులారా!

చ. నిరుపమశౌర్య కౌముది వి♦నిర్గతిఁ జేసి, పవిత్రరావువం
శ రజని కెల్లఁ దేజము నొ♦సంగిన శారదచంద్రులీర లో
వరపథగాములార! పరి♦పంథి నిరాసన కార్యమూని మీ
పరిభవదుఃఖము న్బొలఁచు♦ వాఁడ ధరాస్థలి వీడులోపలన్.

నర—(తనలో) నేను దలఁచిన రీతిగా వీనికి వీరరసోద్రేకము కలుగుచున్నది. ఇంకను దానిం బురికెక్కింతుఁగాక! (ప్రకాశముగా) నాయనా!

చ. చలచలకాగు నూనియ♦చట్టుల రావుకుల ప్రధానులన్
జలమునఁ గూలఁద్రోసియమ♦సన్నిధికంపినచోటి దేసుమీ!
కలుషమనస్కులై చెఱకు♦గానుఁగలం జొనిపించి వెల్మయో
ధుల నరిరాక్షసుల్ మిగులఁ♦ద్రుంచిన ఘోరధరాస్థలంబిదే!

సీ. అభిమన్యు నట్టులే ♦ యంద ఱొక్కటఁ గూడి
సింగమనీనిఁ ద్రుం♦చినది యిచట
ద్రుపదాత్మజుని భంగి ♦ దుష్టతన్ యాచమ
నీనిఁ జిత్రవధ మొం♦దించి రచట
వడముడిచూలినిం ♦ బలెఁ గపట రణాన
వెన్నమనీనిఁ జం♦పినది యిచట

తన తేరు నవరించు♦కొను కర్ణునిం బోలె
సర్వసేనాపతిం ♦ జదిపి రచట
గీ. గజదళంబులు కసిమసం♦గఁ బడె నిచట
ఘోటక వ్రజముల నెల్లఁ ♦ గూల్చి రచట
కాల్బలము పెద్ద నిద్దురం ♦ గాంచె నిచట
వెలమ పౌరుషం బిందె మున్ ♦ వెలసి చనియె.

అను—తాతగారూ! మీ రీయంశములం జెప్పుకొలఁది నా రక్తమధికోష్ణతం గాంచి ప్రవహించుచుండె. నాకంటి కొలుకుల నుండి వేఁడి కన్నీళు లొలుకుచుండె.

తే. గీ. కటకటా! రావుకుల తటా♦కంబులోని
బిసరుహముకుళ మొక్కటే ♦ విడిచియుంచి
ఫుల్ల పద్మకాండము లెల్లఁ ♦ బెల్లగింతే?
దైవమా! కన్నుగుట్టెనే ♦ దాని సొగసు?

నర—నాయనా! నీవు ఖేద మొందరాదు. నీ తండ్రుల ధైర్య సాహసౌదార్యములు మదినెంచి వాని నలవర్చికొన వలయును. పరలోకమునుండి ని న్నాశీర్వదించుచుండు వారి యాత్మలు శాంతిఁ బొందునట్లు, వారి కిష్టములగు కార్యము లాచరింపవలయును.

అను—అటులైన నా ప్రతిజ్ఞ వినుఁడు.

సీ. శత్రురాజ మకుట ♦ స్థగిత దివ్యమణి త
తియె దేవతార్చిత ♦ తిలలుగాఁగ

పరిమళ తైల లి♦ప్త విరోధినృప శిరో
జనికాయమే దర్భ ♦ జాలములుగ
అభిషేక శుభసమ ♦ యావభృతస్నాత
విహితారిశిరములే ♦ పిండములుగ
మచ్ఛమూపతి సమూ♦హోచ్చారి తోత్సాహ
వాక్యంబులే మంత్రి ♦ వాక్యములుగ
గీ. వైరికం ఠోద్గత రుధిర ♦ ధారలే తి
లోదకంబులు గాఁగ, వి♦ధ్యుక్త ఫణితి
మత్పితృనిలింప శ్రాద్ధ క♦ర్మంబు సలిపి
తృప్తిఁ గావింతుఁ, గాంచెద ♦ ఋణ విముక్తి.

నర — బాబూ! నీవు సంకల్పసిద్ధుఁడ వయ్యెదవు గాక! నీ మూలమున నీ పితృదేవతలు పరితృప్తిం గాంతురు గాక! ఇఁక మన మిచ్చోటు వాసి పోవుదము. తేరెక్కుము.

ఫుల్ల — సూర్యాస్తమయము కావచ్చినది. నా ప్రాణము పోయినను సరియే, నే నొక్కఁడనైనను గదలను. ఏ సింగమునకో నన్నప్పగించుటకా, బాబులారా, యిప్పుడు ప్రయాణమగుట? అదిగాక మన తిండిమాటయేమి?

నర — ఓరి తిండిపోఁతా! ఇప్పుడే కదా పాతికయరఁటిపండ్ల నవలీలఁ దింటివి? ఇంతలో నాఁకలియైనదిరా? వృకోదరుని వలెఁ గన్పట్టుచున్నావే!

అను—అన్నా ! దారిలో నీకుఁ గావలసినంత యాహారముఁ దెచ్చి యిత్తును లెమ్ము. తిండికై బెంగఁగొని యాఁగకుము.

పుల్ల—అటులైన నేనును బయలువెడలఁ బ్రయత్నింతును. నన్ను మెల్లఁగా లేవఁదీయుము. నా సత్తువ బొత్తిగా నన్నగిల్లినది.

అను—(చేతి నూఁతగా నిచ్చి) లెమ్ము. తిండిలేకే కాఁబోలు నింత నీరసముతో నుంటివి ? బండ్లలోనున్న మఱి నాల్గు గెలల పండ్లిమ్మందువా ?

పుల్ల—తెప్పింపుము. మెల్లఁగా భక్షింతును.

నర—నాయనా ! ఈ మొద్దబ్బాయితో వినోదములకేమి గాని, త్వరపడి పయనము కమ్ము. ఇక్కడ కనతిదూరములో నున్న యొకదుర్గమును నీకుఁ జూపఁగోరుచున్నాను.

అను—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

(తెరపడి మఱియొక తెర లేచును.)

రంగము—పాడుపడిన భువనగిరి దుర్గము.

అను—తాతగారూ! ఈ కొండకోట యిట్లు పాడువడి యున్న దేమి? ఇది యెవ్వరిదో ?

నర—బాబూ ! ఇది పూర్వకాలమున మీదే. ఇప్పుడు మాధవవర్మకు వశమై యున్నది. అతఁ డీపవిత్రదుర్గమును

బాహువలుచి యిట్లు దిగవిడిచినాఁడు. ఇందే తొల్లి నీ తల్లి తప్పఁ దక్కుంగల యంతఃపుర కాంతలెల్లరు నొక్కపర్యాయమే యగ్నిప్రవేశ మొనర్చిరి.

మ. పసుపుం గందము మేనఁబూసి, సునుఁ గూ♦ర్పాసంబులం దాల్చి, యిం
పెసఁగన్ స్వర్ణపుటంబరంబుల మణీ♦బృందంబులం గట్టియున్,
నొసటన్ గుంకుమ బొట్లు దిద్ది, సుమసం ♦ దోహంబులం బూని, సం
తస మొప్పారఁగఁ బెండ్లివేఁడుకనఁ గాం♦తల్ సొచ్చిరా యగ్నిలో.

అను—ఆర్యా ! మీ సుడులు విన్నకొలఁది నాఖేద మతిశయించుచున్నది. ఘోరకిరాత సన్నిభుఁడగు తన్మాధవవర్మాభిఖ్యునిచేఁ గదా, మా కులంబున కింత చేటువాటిల్లె? నాకుఁ దగిన యాయువే భగవంతుఁ డిచ్చునేని, ఆ నీచుని సమిత్రబాంధవముగఁ దెగటార్చి, నాకోపాగ్ని చల్లార్చుకొందును.

సీ. నాఁడు మా తల్లు లొ♦నర్చిన యాక్రంద
న ధ్వనులే సింహ♦నాదములుగ
దుర్భరశోకంబు♦తో వారు విడిచిన
కన్నీటిధారలే ♦ ఖడ్గములుగ
అతికోప వివశలై ♦ యా స్త్రీలు పల్కిన
శాపాక్షరంబులే ♦ శరతతులుగ

చిత్తులందు వార లా♦హూతు లౌతఁజేని రేఁగు
ధ్వనులే శతఘ్నికా♦ధ్వానములుగ

గీ. పూసపాటివంశ బలని♦ర్మూలనంబు
సేయుదే ? కట్టి కుడుపఁబో♦దే యఘంబు ?
పరమ స్వాధీమతల్లులన్ ♦ బాధపెట్టు
దోషులన్ శిక్షసేయఁడే ♦ శేషశాయి ?

నర—వత్సా ! నీ తలఁపులన్నియుఁ బండును. ఆ దుష్టుఁడు తెగుకాల మాసన్నమైనది. వాఁ డీనడుమ నిన్నుఁ బరీక్షించుట కఁట, చారులఁ బంపినాఁడు. వారు నిన్నుఁ జూచియు నావవాలు పట్టఁజాలక, నీవుకూడ నొక బాపన బాలుఁడవనియే నమ్మి యేఁగిరఁట. నీ వికఁ గంది కుందకుము. మన విూ కోటయంతయు సత్వరము పరిశీలించి యేఁగవలయు, రమ్ము—(వారు మెల్లఁగా నడుతురు.)

పుల్లి—ఓసి కోఁతిముండా ! నీ కేమి పోఁగాలము వచ్చినదే ? నా చేతిలోని పండ్లగెల యంతయు నొక్కమాటే యపహరించికొని పోయితివి ! నేను గడుపారఁ దిండిఁ దినుట నీకును గిట్టకుండెనే ?

నర—ఓరి బుద్ధిహీనుఁడా ! దాసిని దిట్టిన, నది యభిమానము వహించు ననియా నీ నమ్మకము ?

పుల్లి—గోలపెట్టకుండుమయ్యా! బాపనయ్యా! నీకుఁ గావలసినన్ని పండ్లు నేను దెచ్చి యిత్తునులే.

అను—(ఆ మాటలు వినక యోజనాదృష్టితో)

సీ. కాఁబోలు నిది సభా♦గారంబు, కుడ్యముల్
జనకుల శాసన♦ధ్వనుల నీను
(కొంతనడిచి)
కాఁబోలు నిది నృపాం♦గనల యలంకార
నిలయంబు, శృంగార ♦ మొలుకుచుండె
(కొంతనడిచి)
కాఁబోలు నిది కృత ♦ కజలాశయంబు, రా
ణుల జలక్రీడలం ♦ గలఁగె జలము
(కొంతదవ్వేఁగి)
గాఁబోలు నిది కేళి♦కామందిరం బాట
సరకు లాడాడఁ జె♦దరి యొసంగు
(కొంత దూరమేఁగి)

గీ. దేవగృహములు కాఁబోలు ♦ దీపధూప
ముఖ్యముల్ లేక యుండియు ♦ పొలుపు గాంచు!
మున్ను సిరుల కిరవగు నీ ♦ మన్నెకోట
కటకటా! దయ్యముల కయ్యెఁ ♦ గాఁపురంబు.
(దుఃఖించును.)

వర—నాయనా! నీ విట్లు దుఃఖించుట నిరర్థకంబు.

ఉ. శ్రీలకు వాసమై తనరు ♦ సీమలు భూతపిశాచసంఘముల్
వాలిచరించు ఘోరవన♦వాటికలౌ, శవముల్ దహింపఁగాఁ

జాలెడు. చోట్లు రమ్యమణి♦సౌధముల న్వెలసిల్లెడుం గదా?
కాలము చేయరాని దొక♦కార్యములేదు ధరాస్థలంబునన్.

ఫుల్ల—గురువుగారూ! మీ రిరువును నిట్లు చూచినచోట్లే మరలఁ జూచుచుఁ, జెప్పుకొన్న మాటలే మరలఁ జెప్పుకొనుచు, నెంతసే పుందురు? నా కడుపులో దహించుకొని పోవుచున్నది. నే నిఁక బ్రతుకను. నన్ను వృథాగాఁ జంపి బ్రహ్మహత్యా పాపముఁ గట్టుకొనకుఁడు.

నర—ఓరి మూర్ఖుఁడా! సమయాసమయము లెఱుఁగకుండ మమ్ముఁ దొందర పెట్టెదవేలరా? నిరంతరముఁ దిండి గొడవయే? బాబూ! మన మింక మరలి పోవుదము రమ్ము. ఇచ్చోటు క్రమ్మఱ నీ వలననే సిరుల కాటపట్టగును. నేను యోగదృష్టిని గ్రహించితిని. ప్రాప్తికాలము సమీపించినది. పద.

(అందఱు నిష్క్రమింతురు.)



# శీలవతి.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

రంగము:—నరసన్న పొలము.

ప్రవేశము:—రేచిగాఁడు నేల దున్నుచుఁ బాడుచు.

రేచి—పంటవలఁతి, మా యమ్మ, మా - బాదఁ దీర్పవే!

1. పేద సాదలెల్ల బ్రతుకఁ - బెద్దపంటఁ గలుగఁజేసి
   నీ దయాగుణంబుఁ జూపు-నిన్నెనమ్మియుందుమమ్మ.

2. జాలిగుండె గలుగు సామి-నేలి సిరులనెల్ల నిమ్మ
   చాలకాల మతఁడు బ్రతికి-చక్కనైనపనులు సేయ.

అను—(ప్రవేశించి) రేచయ్యా! ఆనందముతోఁ బాటపాడు
చుంటివే?

రేచి—బాబూ! ఏదో యొకలాగున సంతోసము కల్గించు
కొని యిట్లు పాడుకొనుచుందును. ఇంటికిఁ బోయిన, నా
కంతయు నొగులే కదా? దానికేమి గాని, బాబూ!

నన్ను మీ రంపటి లాగున, 'రేచిగా' అని పిలువక, 'రేచయ్యా' అని మన్ననతో పిలుతు రేల? గొప్ప పెబువులే!

అను—ఓయీ! మమ్ము నీవు తప్పక మన్నింపవలయునా? నిన్ను మేము మన్నింపరాదా? ఇ దెక్కడి న్యాయము? గౌరవ మిచ్చిగదా, గౌరవముఁ బుచ్చుకొనవలయును?

రేచి—బాబూ! ఇట్టి యుద్దేశము అందఱకు ఉండదు. తమ వంటి కొంగల పెబువులకు మాత్రమే ఉంటును. మీరు మళ్ల అయ్యగారి రాజ్యము సంపాదింపఁ గలిగెద రేని, మా పెద్దకొలమును పైకి లేవఁదీయుదురు కాఁబోలు?

అను—అట్టి యదృష్టమే నాకుఁ బట్టినయెడ, హేళనమునకుఁ బెద్దకులమని పిలువఁబడు మీ కులమును నిజమైన పెద్ద కొలముగా మార్చివైతును. మీకు విద్యాశాలలు, సంరక్షణశాలలు మున్నగునవి కట్టించి, యస్పృశ్యతను బాపెదను.

రేచి—మారాజా! మీ ఉద్దేశాలు గల్గిన పెబువులు పది మంది యీ దేశములో ఉన్న, మా మాలకొలమే గాదు, అన్ని తెక్కువ జాతులును పైకెత్తఁబడును. పజ కెంతో సుక మేర్పడును. (నేల దున్నుచుండును.)

అను—ఒకొక్కకనరుని మహారాజుగాఁ జేసి బహుప్రజపై నధికార మొసంగుటలో భగవంతుని యభిప్రాయ మట్టిదే కదా? ఆ యాప్రభువుల యేలుబడిలో నుండు ప్రజలు

సర్వసుఖములం గాంచి మనుటకును, దదాశ్రిప్త్రిములోని కళలన్నియుఁ బోషింపం బడుటకును గాదా యతఁడా యధికార మొసంగియుంట ?

చ. అరుదగు మాంసమున్ మధుఁగు♦టన్నము నేయియుఁ బంచదారయు
నరము రుచించు భక్ష్యములుఁ ♦ గమ్మని పండ్లు, భుజించుచున్ నిరం
తర మధు పానలోలురయి♦తామరతంపరయా సుఖంబులన్
బరఁగుట కీశ్వరుండు నర♦పాలుర సృష్టి యొనర్ప లేదుగా?

రాజు తలపైఁ గలభారము దుర్భరము. అతని కుండు బాధలు సామాన్య మానవుల కుండవు.

ఉ. కొందఱు మాత్రమే సుతులఁ ♦ గూఁతుల లోకములోని మానవుం
డొందు; నృపాలుఁ డెల్ల ప్రజ♦యున్ దన సంతతిగాఁగఁ గాంచుఁ; దా
నెందును వారిసౌఖ్యమున♦కే పనియుంబలుకున్ దలంపులున్
జెందఁగఁ జేయుఁ; గాన స్థిర♦చిత్తుఁడు గాఁడు మహీశుఁ డెన్నఁడున్.

రేచి—బాబూ! ఇట్టి గొప్పతలంపులు మీ కున్నవి గనుకనే, మీరు చాల బాగెము సేసి పుట్టినారని, అయ్యగారి కన్నను గొప్ప మారాజు లగుదురని, లచ్చి మీ యింటనే యెప్పుడును కాఁపురముండునని, మాతో నరసన్నగారు పలు

సారులు చెప్పియున్నారు. ఆయనమాటలు బమ్మదేవర మాటలే. (దున్నుచుండ నాఁగటికి గోలెము తగిలి ఖణిల్లని మ్రోఁతపెట్టును.)

అను — రేచయ్యా! ఆ ధ్వనియేమి?

రేచి — బాబూ! ఏదో నాఁగటికి తగిలినది. ఒక యినుపపట్టా అయి యుండును.

అను — మన్ను పెల్లగించి బాగుగాఁ జూడుము.

రేచి — (మన్నుతీయును) బాబూ! ఏదో ఒక గోలెము లాగున కనఁబడుచున్నది.

అను — ఓయీ! గునపముతోఁద్రవ్వి దానిని పైకిఁదీయుము.

రేచి — (త్రవ్వి చూచును. అది కదలకుండఁగా) సామీ! ఇది కదలకున్నది. నా ఒడలంతయు చెమ్మటలు పోసినవి. మిక్కిలి అలసిపోయితిని. నే నిప్పుడు దీనిని తీయఁజాలను. బాబూ! యింత గంజితాగి, ఒకటి రెండు గడియలలో మరలివత్తును. నాకు సెలవు దయచేయుఁడు.

అను — సరే. నీవు పోయిరమ్ము. నే నీలోపున నించుక తడవా పాకలోని మంచెపైఁ బవ్వళించి విశ్రాంతిఁ గైకొందును. (ఆవులించుచు) కొంచెము నిద్దుర బద్దకము కల్గుచున్నది.

(రేచిగాఁడు నాఁగటిని విడిచి యింటికిఁ బోవును. అను వోత్తుఁడు మంచె నెక్కును.)

అను—(తనలో) భువనగిరి దుర్గసమీక్షణము గావించిన నాఁటినుండియు నాతలంపులు పలువోకలు పోవుచున్నవి గదా! మది కూరటలేకున్నది. మా తాతదండ్రుల యుచ్చస్థితియేమి, నా యిప్పటి పేదస్థితియేమి! కాని, వారికంటె నేనే యెక్కువ సుఖజీవనము చేయుచున్నాను. వారి కుండెడు తాపత్రయములు నాకు లేవు. శత్రురక్తముతోఁ దమకుఁ దిలోదకము లిచ్చినఁగాని యాత్మశాంతి గలుగదని యవసానసమయమున నా జనకుఁడు నుడివెనఁట. అది యెన్నఁటి కేని నెఱవేర్పఁగలనా? నెఱవేర్చుటకుఁ దగిన ధనసాహాయ్యము, జనసాహాయ్యము గలుగవలయుఁ గదా! ధనమున్న, జనమున కేమి, కొదవ? రెండునుం గల్గినను, జాలదు. పరమేశ్వరానుకూల్యము కూడ నుండవలయుఁగా! పరమేశ్వరా! నీ చెయిదములు విపరీతములు గదా!

మ. జనకుల్ కాంచనసింహపీఠముల రాజ్యశ్రీలతోఁ గ్రాలఁగాఁ
దనయుం డీగతి నొక్కబాపనుని కేదారంబులోనుండు ప
త్త్రినికాయ్యంబున గడ్డిమంచెపయి నిద్రింబోవ యత్నించెమున్;
అనుభోగంబునఁ బ్రాజ్ఞు లెవ్వరికి వారైయుందురిగా ధాత్రిలో!

ఏమో! ఎవ్వ రెఱుఁగుదురు? ఈ రీతిగా సామాన్య వ్యవసాయదారునివలెఁ జరించు నేనే యదృష్టవంతుఁడనై, తాత

గారి జ్యోతిషమే నిజమై, మరల మా తండ్రిలరాజ్యమును బడయఁ గూడదా? అఘటితఘటనాసమర్థుఁడగు భగవంతుఁడే సంకల్పించు నెడల, నది యెంతకార్యము! మాధవవర్మ నశించి తదీయ రాజ్యప్రజలు క్రిమ్మఱ మా రాజ్యము మాకే యియ్యఁగూడదా? దేశకాలముల గతి మాఱఁ గూడదా? నేను హఠంబున మహాధనవంతుఁడను గాఁగూడదా? అంత నసంఖ్యాసేనానీకము నావశమై శత్రు నిర్మూలనమున నాకుఁ దోడ్పడఁ గూడదా? (ఇంచుక యోజించి, చిఱునవ్వుతో) ఏమి నా వెఱ్ఱి! ఊహాప్రపంచముపై నాధారపడి గొంతెమకోరికలు కోరవచ్చునా?

తే. గీ. దైవమే యనుకూలింపఁ ♦ దలఁచునేని
ఘల్లు ఘల్లురనుచు మ్రోయు ♦ గజ్జె లొప్పఁ
గామఁ గన్నమ్మ నలమేని ♦ సామి కొమ్మ
లక్కిమమ్మ మా యింటికి ♦ రాకయున్నె?

(మరల నావులించి) అవ్వలితటాకంబుపై నుండి వచ్చు చల్లని పిల్లగాలులు నా మేనికి సోఁక, వింతహాయి గలిగి తలఁపులన్నియు మఱపునకు వచ్చి నిద్రగూరుచున్నదే! ఇంచుక తడవు నిద్రింతుఁ గాక! (పండుకొనును.)

(రేచిగాఁడు ప్రవేశించును.)

రేచి—(తనలో) ఛీ! ఈ మొండిప్రాణాలు పోకున్నవి. ఓ దేవుఁడా! నా మీఁద నీ కింతకోపమేమి? ఏ రోజున

కారోజు నా కొడుకులచేత కోడండ్రిచేత నన్నెందులకు చావఁగొట్టింతువు? ఆ దెబ్బలలో ఒకటి నా ఆయువు పట్లు ఏల తగులరాదు? అంత వెంటనే నా జీవాలు ఏల పోరాదు? చెడఁదార్రిగి వచ్చి ఊరకే నన్ను మోఁదు నా కొడుకులపై నాకు పగయేల పుట్టింపవు? అంతగా వారు మోఁదుచున్నను, వారియందు పెరిమయే కుదురనేల? తండ్రి! నా కీమసుకారమైన పోఁగొట్టుం. లేదా, నాప్రాణా లైన తీసివేయుము. లోకములో అందఱకు ఒక్కచావే ఉండును. నాకు దినదినము చావే పెట్టితివేల? నేనేమి పాపము చేసియున్నాను? పోనీ, తెగించి యేఊరైన పోవుదమన్న, ఈ నరసన్న బాబుగారిని విడువ లేకున్నాను. ఈయనవంటి మంచి మారాజు మఱొకఁడు దొరకఁడు. ఓ శివుఁడా! ఓ పార్వతీదేవి! ఓ నూకాలతల్లీ! ఓ నాగే శ్వరుఁడా! మీా రందఱు నన్నేల కాపాడరు? (అమ్మేడ నొకతాఁచు జలజల పాఁకుచు వాని ప్రక్కనే పోవుటఁ గాంచి) అబ్బ! ఎంతతాఁచు! అది తిన్నఁగా మాపాక లోనికే వెళ్లుచున్నదే! అన్నట్లు, అక్కడ మా అను వోతయ్య పరున్నాఁడు కాఁబోలు! అతనిని కఱవదు గదా? పోయి చూతును. (ఆశ్చర్యముతో) ఇదేఁటి వింత? మా అనువోతయ్యకు ఎండ తగులకుండ తలాపిదెస గొడుగుగా తన పడగ విప్పి నిలుచున్నదే! ఇట్టివి జరగినట్లు నరసన్న

గారు కతలలో చెప్పినారు. కాని అది నేఁడు నా కండ్ల యెదుటనే చూచినాను. ఇతఁడు తప్పక మా రాజగును. సందియము లేదు. అతనిని లేపుదునా ? అతఁడు ఒత్తగిలిన, అతనిచేయి దానికి తగులునేమో ! అంత అది ఒక కాటు వేయునేమో! లేపకున్న, ఏమిచేయునో ? (లెస్సఁగాఁ బరికించుచుండును.) ఓ ! ఏంత ! అది పాఱిపోయినదే! మా అనుమోతునికి ఏ కీడును చేయలేదే ! నూకాలతల్లి దయవలన, అతఁడు బ్రతికినాఁడు.

అను—(నిద్రలోఁ గలవరించుచు) తల్లీ ! నరబలియే ?

రేచి—ఇదేఁటి? నరబలి యనుచున్నాఁడు ! ఆ తల్లి యెవరు ?

అను—నరబలి యీయకున్న, గోలెములోని ధనమీయవా? (ఆఁగి) పోనిమ్ము.

రేచి—ఓహో ! తెలిసినది. ఇందాఁక నానాఁగటికి తగిలిన గోలెములో ధనమున్నదికాఁబోలు. లచ్చి యీతని కలలోఁ గనఁబడి నరబలి అడుగుచున్నది. బలే ! అయినను, లేపి తెలిసికొందును. (బిగ్గఱగా) అనుమోతయ్యగారూ ! బాబూ ! లెండు, లెండు. !

అను—(కడలు విఱుచుకొనుచు లేచి) రేచయ్యా ! తిండిఁ దిని వచ్చితివా ?

రేచి—బాబూ ! వచ్చినాను. కాని మీరిప్పుడు నిద్రలో కలవరించినారు. కల యేదైనా వచ్చినదా ?

అను:—నిజముగా నాకొక కలయే వచ్చినదోయి !

రేచి—ఏమని ఆకల ?

అను—ఒక యందమైనకొలను. అందొక తెల్లని తామరపువ్వు. దాని నడుమ నొకయందగత్తె కూర్చుండి యున్నది. ఆమె కిరువంకల, నేనుఁగులు నిలిచి తొండములనిండ నీరు పూరించి యామెపై నభిషేక మొనరించుచున్నవి. ఆయింతి చిఱునవ్వుతో నా వంకఁ జూచినది. నేను నమస్కరించుచు నామె దగ్గఱ కేఁగితిని. "నాయనా! ఇందాఁక రేచిగాని హాలమునకుఁ దగిలిన గోలెము నిండ బంగారు మొహరులు గలవు. వానిని నీ వంశములోని వాఁడగు నొక ఘనుఁడు చిరకాలము క్రిందఁ బాఁతిపెట్టెను. ఆ ధనమును బొందుటకు నీవే యర్హుఁడవు. కాని, యది నీ కూరక చేకూఱదు. ఒక నరబలి కావలయును." అని యామె నాతోఁ బల్కినది. నేను సంతోషాశ్చర్యములతో నివ్వెఱ పడి కొంతవడి నిలిచియుంటిని. అంత—

రేచి—అటు పిమ్మటనే కాఁబోలు మీరు, "తల్లీ! నర బలియే ?" అంటిరి.

అను—అవును. ఆ మాటలు నాకిఁ గలవరించితిని కాఁబోలు. ఆమె నరబలియే కావలయు ననెను. దాని నీయకున్న, గోలెము లభింపదని స్పష్టముగాఁ జెప్పెను. 'రాకున్నఁబో నిక్షేపము. నేను నరబలి నేఁజాల"నంటిని. అంతలో నీవు వన్ను మేల్కొల్పితివి.

రేచి—అయ్యా ! ఆమె నిజముగా లచ్చిమియే. ఆగోలెములో తప్పక బంగారముండఁబోలు. దానిని మీ పూర్వులే పాతిపెట్టిరి. కావున, దాని హక్కు మీదే. అది మీకే దక్కును. హానలువలదు. గోలెముత్రవ్వి తీయఁ జూతును. (త్రవ్వును. బంగారముతో నిండియున్నట్లు సంశయము కలుగును.) బాబూ! ఇది నిజముగా బంగారు నాణెములతో నిండి యున్నది.

అను—గట్టిగాద్రవ్వి గోలెమును పైకిఁ దీయుము.

రేచి—(శ్రమపడి త్రవ్వును. అది కదలదు) బాబూ ! ఇది కదలకున్నది. లచ్చిమహిమయే అని నానమ్మకము.

అను—అలాగైన అది మనకు ఎట్లు దక్కును ? నేను నరబలి యీయఁగల్గినప్పుడు గదా యది లభించుట ?

రేచి—అవునండి. మీరు నరబలియు ఇయ్యవచ్చును. మీరు కొద్ది కాలములో మహారాజులై తీఱుదురు. ఇందాఁక మీరు నిదురపోవుచుండఁగా నాగుఁబా మొకటి పడగ విప్పి మీకు గొడుగు పట్టినది. అది గొప్ప పెంపులు కాఁగలరని సూచించుచున్నది.

అను—ఓయి వెఱ్ఱివాఁడా! ఈ శకునములు నమ్మియా, మనము భావికార్య చింత సేయుట ?

రేచి—కొన్ని శకునాలు నమ్మక తప్పదండి. పడుచుఁ దనముమీఁద మీ రిప్పుడు నమ్మకున్నను, ముందుముందు

పిల్లలు గల్గిన తర్వాత అన్నియు నమ్మి తీతెదరండి. అది ఆలాగున ఉండనిండు. నరబలిని గూర్చి నాకొక ఉద్దేశము తోఁచుచున్నది.

అను—ఏ దా యుద్దేశము ?

రేచి—చెప్పెదను, వినుండి. కాని, మీరు దానిని తోసి పుచ్చక పని జరగింపవలె నండి ?

అను—ముం దాయుద్దేశ మేదో చెప్పుము. ఆవలఁ బనిమాట చూతము.

రేచి—నా ఉపదేశము ననుసరింతురేని, మీకు పుణ్యముండును. లాభము గల్గును.

అను—ఆ యుపదేశమేదో తెలిసినఁగదా, నేను గార్య నిర్ణయము చేయఁగలుగుట?

రేచి—ఆలాగైన వినుండు. నా కేడుగురు కొడుకులని మీ రెఱుంగుదురు గదా ?

అను—అవును. ఎఱుఁగుదును. వారిలో నొకని బలిగాఁ గొనుమందువా ?

రేచి—ఎంత మాటాడినారు ! నా ప్రాణాలన్నియు నా కొడుకుల మీఁదనే ఉండును గదా ? వారిలో నొకనినైనఁ బోఁగొట్టుకొనఁ గలనా ? అది గాదు, నాతలఁపు. వినుండు. నా కొడుకులు, కోడండ్రు, రోజురోజు చెడఁ

దాఁగివచ్చి నా యెముకలు విఱుగునట్లు నన్ను మోఁదుదు రనియు మీకు తెలియును గదా ?

అను—అవును. తెలియును. తెలిసిన నేమి ?

రేచి—వారి బాద నేను పడలే కున్నాను. వారిని విడిచి యెక్కడకును పోలే కున్నాను.

అను—కనుక నిన్నే బలిగా నర్పింపుమందువా ?

రేచి—అవునండి. పానలు వలదండి.

అను—హారి హారీ ! ఎంతమాటాడితివి !

మ. చిరకాలంబున నుండి, నమ్మకముతో ♦ సేవింతుభట్టారకున్ మరియాదం గనిపట్టి వర్తిలుదు, వె♦న్నన్ దుర్గుణంబొందు నీ చరితంబందుఁగనంగరా, దెటులు ని♦ష్ఠంపంగఁ జేయాడు, నీ దురింతం బేగతి మూటగట్టుకొననే♦ర్తున్ జ్ఞానహీనుండనై.

రేచి—అయ్యా ! మీ వంటి మెత్తనిమనస్సు గలవారి కిది కష్టమైన పని లాగుననే కనఁబడును. కాని బాగుగా ఆలోచింపుఁడు. నా బాద తప్పించిన పుణ్యము, అంత బంగారము ఒక్కసారిగా పొందిన లాభము— ఈ రెండును వచ్చును. నేను గాకున్న, నరబలి మీకు మఱియొకఁడు దొరకఁడు. బలిలేకున్న, బంగారము దక్కదు.

అను—బంగారము దక్కకున్నను సరియే. నేను మాత్రము నిన్ను బలి యిచ్చి దానిని సంపాదింపఁబూనను.

రేచి—బాబూ! నామాట వినుండి. మీరు నన్ను బలిమిని బట్టుకొని బలిగా అప్పనము చేసినయెడల, అది తప్పగును. కాని, నా యంత నేనే మిమ్ము కోరుచుండఁగా, మీ తప్పే మున్నది? వెనుకఁ దీయకుఁడు.

అన—ఓయీ! నీ పలుకులు మిగుల నాశ్చర్యమును గొలుపుచున్నవి. ప్రాణములమీఁద రోఁతపుట్టి, వానిని ద్యజించుటకు నీవు తెగింపవచ్చును. కాని, నీ మంచితన మెఱిఁగియు, సర్వమానవ సౌభ్రాత్రము వహింపవలయునని తలఁపు గలవాఁడనై యుండియు, నేను ని న్నెట్లు వధింపఁగలను? వధించియున్న, నాయకృత్యమును గూర్చి తాతగారు విన్న నేమందురు? నన్ను వట్టి కిరాతునిగా నెంచరా?

రేచి—తాతగారి దగ్గఱకు మీరు వెళ్లి, "రేచిగాని బలి యీయనా" యని యడిగెదరేని, వారు ఒప్పుకొనకుండ వచ్చును. బాపన మారాజు లగుటచేత, ఒకపట్టున ప్రాణాలు తీయుటకు ఇష్టపడరు. కాని, పని అంతయు జరగిపోయిన తర్వాత, "తాతగారూ! విధిలేక - రేచిగాని బలి యీయ వలసివచ్చినది." అని మీరు చెప్పినను, వారు మిమ్మేమియు నిందింపరు.

అన—తాతగారేమియు నిందింప రనుకొందము. నా మన స్సాక్షి నా యావజ్జీవము నన్నుఁ గుట్టదా? నన్నేగాక,

యీ ధనము ననుభవించు నా సంతతివారి హృదయము లెల్ల విదారింపదా ?

శేచి—అలాగైన, నేనింకొక ఉపాయము చెప్పెదను. వినుండు. నా చావువలన, ఇప్పుడు నా కున్న బాదలు తప్పించుటయే గాక, మా మాలకులమునకు సూర్యచంద్రు లున్నంత కాలము నిలుచు కీర్తి, గొప్పతనము, మీరు కలిగింపుడు. అట్టి కీర్తి నిచ్చి నన్ను బలిగా మీరు తీసికొన్నను, తప్పు లేదు గదా ?

అను—శేచయ్యా! నీ నుడులు నా కర్ణములు కాకున్నవి. మీ మాలకులమునకు నే నెట్లు శాశ్వతయశస్సు చేకూర్పఁ గలను ?

శేచి—ఎటులా ? చెప్పెద, వినుండీ. మీ దేగోత్రము ?

అను—మాది వాసిష్ఠసగోత్రము. గోత్రము మాట యెందులకు ?

శేచి—నన్ను బలిగా నిచ్చిన నిముసమునుండి, నా పేరు మీఁదుగా మీ గోత్రమును మార్చుకొనుఁడు. అంత నా పేరు స్థిరముగా మీ రావుకులమున్నన్నినాళ్లు భూమిపై నిలుచును. ఒకని పేరు నేలపై ఎన్నాళ్లు నిలుచునో, అన్నాళ్లు వాఁడు స్వర్గలోకములో ఉండునని పెద్దలు చెప్పుదురు గదా ?

అను—సరే. నీ పేరిమీఁదుగా మా గోత్రము మార్చుకొందుమనియే తలఁపుము. దాన, నీపేరు చాలకాలము నిలువ వచ్చును. కాని, మీ పంచమకులకీర్తి యెటుల స్థిరముగా నుండఁగలదు ?

రేచి—మా కొలములో ఒకఁడు తనప్రాణాలు రావువారికొఱకు అప్పనము చేసినాఁడని దేశచరిత్రలో శాశ్వతముగా నిలిచిపోదా? అది మా కులమునకు కీర్తికాదా? మఱొక్కమాట. మీ యిండ్ల నెవ్వరికి వివాహములు జరగినను, ముందుగా మా మాలవాని కొకనికి ఒక మాల పిల్ల నిచ్చి పెండ్లిచేసి, ఆ దంపతుల ఒప్పందలమీఁద వారి తలఁబ్రాలే మీరు చేయు పెండ్లియందు తలఁబ్రాలుగా ఉపయోగించి, మీ వివాహములు చేసికొనుఁడు. అది మా వంగసమునకు చిరకాలము నిలుచు పేరు తెచ్చును. ఈ రెండు పద్ధతులకును మీ రొప్పుకొని నన్ను దేవతకు బలియిండు. అప్పుడు మీ దోసముండదు. పానలువలదు. నే నిదే అవ్వాలి కొలఁకులో తానమాడి వచ్చెదను. (వెళ్లిపోవును.)

అను—(తనలో) ఇదేమి చిత్రము! ఈతఁ డింత సాహసించుచున్నాఁడేల ? తెగించి నే నీతని బలిగా నర్పింపవలసిన దే! బలియిచ్చినఁ గాని, యా ధనమురాదా? సకల ప్రాణి

సంరక్షణము గావింపఁ జూచెడు దేవత, యొక్కనిని భక్షింపఁగోరునా? అజ్ఞానులవలె నేనుగూడ మూఢ విశ్వాసమునకు లోను గావలసినదే? అన్యాయముగా నీ చిరకాల సేవకునిఁ దెగటార్పవలసినదే?

శా. దేవీ! ప్రాణుల కీవు తల్లివి, ధరిత్రిన్ వాని శ్రేయస్సె నీ
భావంబందుఁ దలంతువంచుగురువుల్ వాక్రుత్తు, రేకైవడిన్
జావుంగూర్చితత్కుమారతతులన్ బాధింపఁగాఁజూతు, వీ
వేవానిం గృపఁ గాంచకున్న మతి వే, ఱేదిక్కు? లోకేశ్వరీ!

రేచయ్య యెంతశ్రమపడినను, ఆ నిధి యించుకేనియుఁ గదల కుండెనే! అది నిజముగా దేవీమాహాత్మ్యమా, వాని శక్తి లోపమా? శక్తిలోపము గాదని వాఁడు వెలార్చిన స్వేదప్రవాహములే చెప్పుచున్నవి. లక్ష్మీప్రభావమే యని విశ్వసింత మన్న, మన స్వప్నకున్నది. (ఇంచుకసేపు యోజించి) ఏమో! కించిజ్జ్ఞుఁడనగు నేను భగవల్లీలల నెట్లు గణింపఁగలను? ఒక ప్రాణి సమస్త సుఖసంపదల నందుచు నానందించుచుండ, వేఱొకప్రాణి దుఃఖార్ణవములో మునిఁగి యుంటలేదా? ఒకఁడు మిగుల నారోగ్యవంతుఁడై యుండ, నింకొకఁ డనా రోగ్యము గలవాఁడై మరణావస్థలో నుండుట లేదా? అటులే, నే నియంధనసంపాదన ముదితుండనై యుండ, రేచయ్య తదర్థార్పితప్రాణి కావలసిన విధి యేర్పడియున్నదేమో! కర్మయోగ సిద్ధాంతమునే విశ్వసింతునేని, యిది వింతగాఁ గనఁబడదు.

(రేచిగాఁడు స్నానమొనర్చి, తిలకము దిద్ది, ప్రవేశించును.)

రేచి—సామీ! ఇం కాలసింపకుఁడు. నరసన్నగారు వచ్చిన, మీ కార్యము అడ్డిపోవును. ఇదిగో కత్తి. దానిని నేనే నూఱి తెచ్చితిని.

అను—రేచయ్యా! నాకు విత్తము చేకూర్చుటకై, యూరక నీవు ప్రాణము లర్పింతునందు వేమోయి?

రేచి—అయ్యా! ఒక జీవానకు బాదగలిగించినఁ గాని, యిం కొక జీవానకు సుకము గలుగదు. చీమలను దిని బల్లులు, బల్లులను దిని పిట్టలు, పిట్టలను గొట్టి మనుజులు బ్రతుకు చుంటుట లేదా? అలాగుననే, మనుజులలో ఒక రింకొక రికి నష్టము కలిగించినఁ గాని జయము, లాభము, పొంద లేరు. అది గాక, చావేఁటి, బ్రతుకేఁటి? చావు బ్రతుకు లీబొందికిఁ గాని లోపలి ఆత్మకు లేవుగదా? నా బొంది చాల బాదలలో నున్నది. ఆ బాద తప్పింపుఁ డంటినిగాని, వేఱొకటి గాదే! నా ఆత్మ యెప్పటికిని చావదు. పైగా అది మీ వంశ మున్నంతకాలము తిరముగా జీవించియే ఉండునే!

అను—(తనలో) ఇతఁడు గొప్ప వేదాంతి. (ఒడలు జల్లుమన బలబరించి) ఇదేమి? నా యొడలు నాకుఁ దెలియకున్నదే! నాయం దేదో యద్భుతశక్తి యావహించి యున్నట్లు

తోఁచుచున్నదే! (ఏదో యొకవాణి శ్రవణశ్రుతము కాఁగా) ఆఁ! ఏమనుచున్నావు? ఆలసింపక వానిం దెగ వేయు మనుచున్నావా? ఎవరవు నీవు? నీ శరీరము కన బడదేమి? మేఘములలో నుండి యింత గంభీరముగాఁ బలుకు నీవు స్త్రీవా, పురుషుఁడవా?

శేచి—బాబూ! అది ఆకాశవాణి. మిమ్ము తొందర పెట్టు చున్నది. తప్పక నన్ను తుద ముట్టింపు మనుచున్నది. దేవునికిఁ గూడ నాచావు ఇష్టమే. ఇంక జాగేల?

అను—(కత్తి చేతఁబూని) ఓ యశరీరవాణీ! బలవంతముగా నా చేతిలో నీ ఖడ్గము నేలయుంతువు? అలనాఁడు కాన నములోఁ గ్రూరసత్త్వములం దప్ప నే నే ప్రాణిని హింసించి యెఱుఁగను. అదియు గుర్వాజ్ఞపై నొనర్చితిని. ఇప్పుడు నా చేతులు కంపించుచున్నవి. నే నీఘోరకార్యము చేయఁ జాలను. (శ్రుతి నభినయించి) ఏమీ! ఏమనుచున్నావు? చేయక తప్పదనియా? నా కిష్టములేని కార్యము నెట్లు చేయింపఁగలవు! నీవే నాకరముం బట్టి వాని శిరఃఖండన మొనరింతు నందువా? అదేఁటి న్యాయము? ఆక్రూర కార్యము నాచేతఁ జేయింపనేల? నీ కంత యభిలాష మున్న, నీవే చేయరాదా? నడుమ నాచేయి యెందులకు?

శేచి—అయ్యా! దేవతయే అంతగా తొందర పెట్టుచుండఁగా, ఊరకుండుట మంచిది గాదు. (అనువోతుని కరముం బట్టి)

రము. ఆ మొగలి డొంకచాటునకు. అక్కడ మనచేనిని కాచు అమ్మవా రున్నది. ఆమె యెదుట నన్ను లచ్చికి బలి యిమ్ము. (తీసికొని పోవుచుండును.)

అను—(ఇంకను ఆవేశములోనే యుండి) ఎవరు నీవు, న న్నీగతిఁ దివియుచున్నావు? నన్నులాగకుము. నే నాయమ లాత్ముని౯ జంపలేను. దీనికే వెఱచిన, ముందు ముందు శత్రువుల నేగతిఁ జంపుదువందువా? అదివేఱు. దుష్టులను నఱకుటకు నా చేయి సంకోచింపక పోవచ్చును. అయ్యో! నీవే కరముం బట్టితివేల? వానిని ఖండించుటకే? (నేపథ్యమున కేఁగి రేచిగాని ఖండించి యీవలికి వచ్చి) అయ్యో! అయ్యో! ఎంత పనిఁ జేయించివే నాచేత నో క్రూరశక్తీ! నాకెంత దురితముం గూర్చితివే! ఇప్పుడు నీ వాక్కు మరల వినఁబడదేమే? నామేన నిండాఁకటి బలము మాయమయ్యెనేమి? ఇదేమి యింద్రజాలము? భగవంతుఁడా! నీ వెన్నిరూపములం దాల్చి యీ జగన్నాటకరంగమున నాట్యమాడుచున్నావు! ప్రాణులచే నాటకమాడించు సూత్రధారుఁడ వనుకొంటిని. కాని నీవే నటకుఁడవైతివే!

చ. పరమపవిత్రభావు, నతిభక్తి మెయిన్ గురుసేవఁజేసి ధా న్యరమ నొసంగునట్టి సుకృతాత్ము, నిరంతర విష్ణుపాదతా

మరసయుగార్చనాపరు,న♦మాయకు, రేచయ నేవధించితిన్;
దురితము నేగతింగడకు♦ద్రోతు?గురూత్తము నెట్లుచూతునో

(నరసన్న భట్టు—ప్రవేశించును.)

నర—నాయనా! యేల యిట్టు లుంటివి?

అను—(కంటఁ దడిపెట్టుచు)

ఉ. భూతమొ, దయ్యమో, మఱియ ♦ పూర్వపు శక్తియొ, యావహించి, నా
చేతఁ గటారి యుంచి,మన♦సేవకు రేచుశిరంబుఁద్రుంచి,భూ
పాతము నొందఁజేసె; బహు ♦ పాపముఁ జేసితి, నో గురూత్తమా!
పూతయశంబుమాపి,పరి♦భూతమొనర్చితిమీ ప్రబోధమున్

చ. హృదయముభగ్నభగ్నమని♦యేర్చెడు రేచునివర్తనంబు నా
మదిని దలంప; భూరి ధన♦మండలిఁ గూఱిచి మందునిన్ననున్
మదిమదిమండలేశ్వరుఁగ♦మార్పఁద్యజించెనతండుప్రాణమే;
వదలదు తన్మహా దురిత♦భారము నన్ను; మనంగనేర్తునే?
(ఏడ్చును.)

నర—బాబూ! ఏమిది? ధనమేమి? రేచిగాఁడు నీకుఁ గూర్ప యత్నించుటేమి? ప్రాణము త్యజించుటేమి? అంతయు సవిస్తరముగాఁ జెప్పుము.

అను—(గాద్గద్యముతో) తాతగారూ! రేచయ్య నేల దున్నచుండ నొకగోలెము హాలంపు మొనకుఁ దగిలినది. దానిం

దీయ నతం డెంత ప్రియాసపడినను, నది రాదయ్యె. అతఁ డింటి కేఁగి మరలి వత్తునని పోయెను. అంతలో నాకు నిద్దుర పట్టి యొక కలవచ్చినది. అందు లక్ష్మి కనఁబడి నరబలి యడిగినది. ఆ స్వప్నోదంతము రేచయ్యతోఁ జెప్పితిని. తన్నే బలిగా నర్పింపుమని యతఁడు నన్నుఁగోరి బలవంత పెట్టియున్నాఁడు. నే నెంతకును సమ్మతింపకుంటిని. అంత నొకయద్భుతశక్తి నన్నావహించి, నాచేతిలోఁ గత్తియుంచి, వానిని నఱకుమని నన్నుఁ దొందరపెట్టినది. దానికిని నేను లొంగకుంటిని. అప్పు డాశక్తియే నాకరము బట్టి వానిం దెగవ్రేయించె. అదిగో! వాని కళేబర మా పొదచాటునఁ బడియున్నది. ఇట్టి ఘోరకలుష మొనరించితిని. మహా పాతక మాచరించితిని.

మ. నను దండింపుఁడు మీకుఁ దోఁచిన క్రియ,న్నాత్మేన్ బ్రియస్నేహితా
లిని దక్కుంగల బంధువర్గముల నేలీలం గనంజాల; మ
జ్జనక క్రోధముఁదీర్చు వాఁడనని ప్రజ్ఞల్ వల్కితిన్నాఁడు;వా
నిని దీర్పంగనశక్తుఁడన్;గురువరా!నిర్వీర్యత న్సైఁపుమీ!

నర.—నాయనా! ఇది యంతయు దైవనిర్మాణము. ఇందు నీ తప్పేమున్నది? రేచిగాఁ డారీతిగాఁ జచ్చి శాశ్వతయశంబు భూమిపై నిలుపవలసినదన్నియు, నీవు శీఘ్రముగా జనక

హానసక్రోధముఁ దీర్చుకొను నవకాశ మొందవలసిన దనియు, నీశ్వరుఁ డాదేశించి యుండెను. ఒక యంత్యజుని సాహాయ్యమున నీకపారధనము లభించునని నీ జాతక చక్రమును జూచిననాఁడే నేను గ్రహించి మీా యమ్మఁ తోఁ జెప్పియుంటిని; నా లెక్కను బట్టి నీ కీనాఁడే ధన యోగము గలదు. నీకట్టి యోగము గలిగియుండ, నీ వ్యన్యథా యెట్లు చరింపఁగలవు? వగపుడిగి యీనిధిం గైకొందువు గాని, రమ్ము. (అనువోతుని హస్తముం బట్టి గోలెము కడకేఁగును. దానిని బెల్లగించి పైకిఁ దీయఁగా నది తేలికగా లభించును.) వత్సా! చూచితివా? ఆ లక్ష్మి తనచేతులతోనే యం దిచ్చినదేమో యన్నట్టు లీ గోలె మెంత సులువుగా మనకు లభించినదో! (దానిని దెఱచి) ఆహా? ఇదియంతయు స్వర్ణమయము! అన్నియు మేలిమి బంగారు మొహరులు!

మ. ఇదె పృథ్వ్యాది సమస్త భూతతతిని♦స్స్నిక్షించప నీ పూర్వికుల్
ముదమొందన్, గనకాభిషేకరచనన్♦ముంగోలుపట్టంపుసం
పదఁజేకూర్చెద; శౌర్య ధైర్య ముఖ సంప♦చ్ఛ్రేష్ఠులం
బెక్కురన్
గదనక్షోణినిఁ జేర్పుమీాధనముచేఁ♦ గళ్యాణమా బాలకా!

(కొన్ని మొహరులు తీసి యనువోనిపైఁ జల్లును.)

అను—(నమస్కరించుచు) ధన్యోస్మి ! ధన్యోస్మి !

నర—బాబూ ! నీ విక రేచిగానికై కుందరాదు. వాఁడు మహాత్యాగరాజు స్వర్గముఁ జూఱకొన్నాఁడు. వానికి యథావిధి దహనసంస్కారముం జేయింపుము.

అను—చిత్తము. తాతగారూ ! రేచయ్య నన్ను రెండువరములఁ గోరినాఁడు సుఁడీ !

నర—ఆ వరము లెట్టివి ?

అను—తన పేరిమీఁదుగా మా గోత్రము మార్చుకొనుట యొకటి, మా యింట నే పెండ్లియైనను జరగునప్పుడు ముందుగా నాతని పేరితో నొక మాలదంపతులకుఁ బెండ్లి చేసి వారి యనుమతిపై యా యుద్వాహము జరపుట యొకటి. యతఁడు కోరిన వరములు.

నర—ఇటుపైని మీది రేచర్లగోత్రమై మీ వంశజు లెల్లరుఁ బంచమకులోద్ధరణంబునకై పాటుపడెదరు గాక. మా కృష్ణయ్య ప్రోత్సాహముచే నీ కింతకుఁ బూర్వమే పంచములపట్ల ననుకంప గల్గినదిగదా? ఇఁకఁ గొలఁదికాలములో జరగు నీ పరిణయమునకు ముందు మాలలకుఁ బెండ్లి సేయుదము లెమ్ము. ఈ ధనలక్ష్మితో నింటికిఁబోయి మీ యమ్మను దక్కుంగల బంధుమిత్రులను నలరింతువు గాక. రమ్ము.

(నిష్క్రమింతురు.)



## ద్వితీయరంగము.

---

రంగము :—రాజవీధి.

ప్రవేశము :—పొట్టి రామన్న, సుబ్బయ్య.

రామ—సుబ్బయ్యా! మా నరసన్నభట్టునకుఁ బట్టిన యదృష్ట ముం గూర్చి వింటివా?

సుబ్బ—మా రాణిగారు నన్ను రమ్మని యాజ్ఞాపత్త్రిమంపఁగా, దేవీనవరాత్త్రిములకు నేను గమలాపురము పోయితిని. అక్కడనుండి వారి జ్ఞాతులయింట జరగు వివాహములో యాజ్ఞికమునకు నీతో వచ్చితిఁగదా? ఆ కారణముచేతఁ బదేనుదినములనుండి నే నీయూర లేను. నరసన్న కేమి యదృష్టము పట్టినది? నే నెఱుఁగని దేదేని కల్గినఁ జెప్పుము.

రామ—నరసన్న పొలములో నొక్కనిక్షేపము మిగుల నమూల్యమైనది కనఁబడిన దని యెఱుఁగుదువు గదా?

సుబ్బ—ఆ సంగతి యెఱుఁగుదును. ఆ ధన మాతఁడు తన వెలమ మనుమని కే యిచ్చినాఁడఁట కాదా?

రామ—ఇచ్చినాఁడు.

సుబ్బ—అది యెట్లు వినియోగింపఁబడెనో నే నెఱుఁగను.

రామ—అతఁ డాసొమ్ముతోఁ గొంతసేనను సమకూర్చికొని, తాతగారితోఁ గూడి మాధవవర్మ రాజ్యములోనికి మాఱు వేసములఁ బ్రవేశించినాఁడు.

సుబ్బ—తాతగారు కూడ నెందులకు ?

రామ—ఎందులకా ? ఎందులకో ముందు ముందు నీకే విశద మగును.

సుబ్బ—ప్రవేశించి యేమి చేసెను ?

రామ—ముందుగా మిత్రభేదముఁ గావించి, వర్మస్నేహితుల నందఱను వశపఱుచుకొనిరి. అవల రాజ్యమంతయుఁ బర్యటనము గావించి యసంఖ్య సేనానీకముఁ గూర్చికొని నాఁడు.

సుబ్బ—ఆ సేనతో యుద్ధము చేయఁగల్గెనా ? లేదా ?

రామ—మహాశౌర్యముఁ బ్రకటించి యుద్ధము చేసెను. మొదట మొగులూరి దుర్గమందున్న మాధవవర్మపైకి దాడి వెడలినాఁడు. ఇరువాఁగులవారికిని జెంజెర్ల దగ్గఱ సమరము జరగెనఁట. మాధవవర్మ పూర్తిగా నోడింపఁ బడెనఁట.

సుబ్బ—ఆ రణరంగమున మనుమనితో నరసన్న కూడ నుండెనా ?

రామ—ఉండకమానునా ? సపుత్త్రబాంధవముగఁ బోయి త్రోసుపడినాఁడు.

సుబ్బ—సహజభీరుత్వముగల్గు బ్రాహ్మణులుగదా యెట్టు లాశత్రావిపీని నిలువఁగలిగిరో ?

రామ—మా నరసన్న పైకిఁ బిఱికివానివలెఁ గన్పట్టును. కాని విలువిద్యలో ద్రోణాచార్యు నంతటివాఁడు. కృష్ణసూరి యశ్వత్థామను, గృష్ణయ్య కృపాచార్యుని బోలుదురు.

సుబ్బ—అంతటి విలువిద్దియ వారికడఁ గలదని యెఱుఁగను. కాని మున్నొకపరి మ్లేచ్ఛుల గుంపొకటి మన గ్రామమును దోపిడిపెట్టఁ జూడఁగా, నరసన్నయు నతని కొడుకులును వారి నెదుర్కొని యవలీలఁ దఱిమివేయఁ గల్గిరి. అది నేను జూచితిని. నీ వప్పటికిఁ జిన్నవాఁడవు.

రామ—అవును. అతఁ డట్టి సమర్థుఁడే.

సుబ్బ—నాఁడు మనమందఱముఁ గూడి వారిని వెలిఁజేసి నప్పఁ డీ సామర్థ్యములం గూర్చి యేమియుఁ జెప్పవైతివే!

రామ—అప్పుడు మా వెంకన్నబావ జట్టులోఁ జేరవలసి వచ్చినది.

సుబ్బ—ఇప్పుడు మరల నెదురు తిరిగి 'మా'నరసన్నయని వెనుక వైచికొని వచ్చుచుంటివా ?

రామ—అప్పుడు మతముం గూర్చి పట్టుదలలు వచ్చినవి. కావున, నించుక విరోధించితిమి. జ్ఞాతులమగుటచే నొకొక్కకప్పుడు విరోధపడినను, నింకొక్కతఱిని గలసికొందుము. అది సహజమే కద ?

సుబ్బ—అది సహజమే. కాని యిప్పుడు మీరు పెట్టిన త్రింపి యింతలోఁ జల్లాఱఁగలదని నేను దలఁపలేదు. అప్పుడు

నరసన్న బీదవాఁడు. ఇప్పుడు ధనవంతుఁడై యొక్క రాజ్యాధిపతిని జేపట్టియుంటచే, శత్రువు లందఱు మిత్రులై రనుము.

రామ—అటులే యనుము. నీవు మాత్రము మున్ను మా నరసన్నయింటఁ బౌరోహిత్యము వదలుకొని, యెప్పు డే శుభకార్యమునకుఁ బిలిచినను నేదో యొక నెపముఁ గల్పించుకొని పోవ మానుచుంటివే! "నీ కొడుకుఁగూడ మ్లేచ్ఛభాష నేర్చి, మ్లేచ్ఛులతో సావాసముఁ జేయుచు, వారి పంక్తిని ఫలాహారాదులు చేయుటలేదా?" యని కృష్ణసూరి నిన్నడిగినప్పుడేమియు మాఱువల్కక కోపించి, వారికి వ్యతిరేకముగాఁ జరించినవాఁడవు, మరలఁ బురోహితత్వము సంపాదించుటకేల యత్నించుచుంటివి? ఏవో నాల్గుడబ్బులు దొరకుననియే కదా? ధనమన్న నెల్లర కాశయే.

సుబ్బ—సరియే కాని, యిప్పుడు నీ ప్రాణమిత్రులగు వెంకన్న, దీక్షితులు, మున్నగు వా రెల్లరుఁ దోఁకలు ముడిచి రనుకొందును.

రామ—ముదువ కేమి చేయుదురు? ముఖ్యబంధువులెల్ల వెంకన్న పక్షమును విడిచిరి. ఎక్కువగాఁ దోడుపడెడు నతని వియ్యకుండు పరమపదమున కేఁగినాఁడు. మఱి యేకాకియై యేమి చేయఁగలఁడు?

సుబ్బ—పోనిమ్ము. వాని మాట కేమిగాని, యింతి యేయగునా నరసన్న యదృష్ట మింకనుం గలదా ?

రామ—అనుపోతుఁడు తండ్రి రాజ్యమంతయు సంపాదించి నాఁడని విందును. కావున, నదృష్టమంతయు మా నరసన్న దే. అతనితోఁ ఖాటు మాదియు నగును.

సుబ్బ—నరసన్న వెఱ్ఱివాఁడే కాని, గడుసరి కాఁడు సుమీ! ఏలయన, నాఁడు ధననిక్షేపము తనపొలములోనే కదా దొరకినది? అది తానే పుచ్చుకొని యుపయోగించుకొన్నఁ, దానే యొక సంస్థానాధీశుఁడు కావచ్చునే! తన కిరువురు సుతులుండ, వారి కాధనమీయక, యొక వెలమవాని కేల యీయవలె ?

రామ—ఓయి గబ్బి సుబ్బయ్యా! నీకున్న గడుసుఁదనము మా నరసన్నకు లేకపోయిన దనుకొంటివా ? బ్రాహ్మణులకు రాజ్యభాగ్యములేల యనియు, నొకవేళ వానిని సంపాదించినను నవి నిలువవనియు, క్షత్రియులే పాలకులుగా నుండఁ దగ్గవారనియు, ననుపోతుఁడు కూడ నొక క్షత్రబాలుఁడే యనియు, మా నరసన్న లెస్సఁగా గ్రహించి యా ధన మిచ్చినాఁడు. అది యట్లుండ, నిక్షేప మల యనుపోతునికే దొరకినది. అతని పూర్వులాతనికొఱకే దానిని బాఁతి యుంచిరఁట. రేచెగానిం బలియిచ్చి పాఁతుం గొని తెచ్చినవాఁ డనుపోతుఁడే. కావున నతనికే దాని హక్కు చెల్లును.

సుబ్బ—సరే. నీతో నాకు వాదమెందులకు? నీ విప్పుడెందుఁ బోవుచున్నావు ?

రామ—మా కృష్ణసూరి నేఁడు యుద్ధరంగమునుండి యిక్కడకు వచ్చినాఁడఁట. అతనిని గలసికొని విజయోదంతములఁ బూ_ర్తిగాఁ దెలిసికొందమని పోవుచున్నాను. (నారాయణ శాస్త్రితోఁ గృష్ణసూరి ప్రవేశించును.) అదే, మాట లోనే మా కృష్ణసూరియు వచ్చినాఁడు. కృష్ణా! నీకు నూఱేండ్లాయువు. విజయవా_ర్త లెల్లఁ దెల్పుము. వినుటకు మిగులఁ గుతూహల పడుచున్నాము.

కృష్ణ—మన యనువోత మహారాజునకుఁ బరిపూర్ణ జయము గల్గినది.

రామ—అటుగాదు నిన్ను నుడువమన్నది. ఒక్కొక్క విషయమే వివరించి చెప్పుము.

కృష్ణ— మొదట మొగులూరిదుర్గము మాకు వశమైనది.

రామ—ఆ వా_ర్తవింటిమి. తర్వాత నేమి జరగినది ?

కృష్ణ—తరువాత, "ఇనుకు_ర్తి" కోటను ముట్టడించితిమి. అందే 121 జ్ఞాతుల చంద్రవంశపురాజులు గలరు. వారి నెల్లరను మహారాజు మహాపరాక్రమవంతుఁడై సంహరించుటం జేసి యతనికి, "సోమకుల పరశురాముఁ"డను బిరుద మేర్పడినది.

నారా—ఆ బిరుదమిచ్చు సభలోనే కాంబోలు, మహారాజు గారిచే గురువుగారు, "అయ్యనవోలు" గ్రామమును శ్రోత్రియుల కగ్రహారముగా నిప్పించిరి?

కృష్ణ—అవు నప్పుడే. పిమ్మట భువనగిరి, ఓరుగల్లు, పానగల్లు, మెతుకు, గోలకొండ, రాజగిరి, మున్నగు చోటులం గల కోటలన్నియు మన ప్రభునివశమైనవి. భువనగిరిదుర్గములో సేనానాయకు లెల్లరు గొప్పసభఁజేసి యనువోతునకు, "ఆంధ్ర దేశాధీశ్వరుం"డని బిరుద మిచ్చిరి.

రామ—మన కండ్లయెదుటఁ బుట్టి యొక పేదబాలునివలె మన యూరి వీధులలోఁ దిరుగుచు, నరసన్నబాబయ్యయొద్దఁ గావ్యపాఠముల నేర్చుకొనుచుండెడు ననవోతుఁ డెంతవాఁ డయ్యెను! అందఱితోఁ బోర ధైర్యమెట్లు కలిగినదో?

కృష్ణ—అనువోతుని ధైర్యము మేరుసమాన మన్నఁజాలదు. అతనికున్న శౌర్య మాపాండవమధ్యమునికైన నుండదు. ఆంధ్రదేశము నిక్షత్రియముఁ జేయు తలంపుతో నతఁడు సల్పిన సమరక్రీడ వర్ణింపఁదరము కానిది.

నారా—క్షత్రియులకుఁ దోడ్పడిన రెడ్లలో నాయకులనెల్ల నా ప్రభూత్తముఁడే స్వయముగాఁ జంపియుండెనఁట. మాధవవర్మను గూడఁ దానే శిరఃఖండన మొనరించి తదుధిరధారలతోఁ దంత్రులకుఁ దిలోదకము లిచ్చెనఁట.

కృష్ణ—అంతయు నిజమే. దిగ్విజయయాత్ర ముగిసెను.

రామ—కృష్ణా ! బాబయ్య యెక్కడ నున్నాఁడు ?

కృష్ణ—నాన్నగారా ? ఆయన మహారాజుతోఁ దత్పరిజనుల తోను రాజగిరి దుర్గమం దున్నారు.

సుబ్బ—అక్కడ నేవేని శుభకార్యములు జరగునా ?

రామ—సుబ్బయ్యా ! నీ వృత్తి కనుగుణమగు ప్రశ్న యే వైచితివి. ఎక్క డెక్కడ శుభకార్యములు జరగుచుండునో తెలిసికొందువు. అవ్విషయమున నీకుఁ గడు శ్రద్ధగలదు.

కృష్ణ—అట్టి శ్రద్ధ యందఱ కుండఁదగినదే. రాఁగల మాఘ మాసమునఁ బ్రభువునకు వివాహము ముందుగా జరుగును. పిమ్మట సంవత్సరాదినాఁడు రాచకొండకోటలోనే యాతనికిఁ బట్టాభిషేకమహోత్సవము నిర్ణయింపఁబడినది.

సుబ్బ—అమ్మహోత్సవములకు మమ్ముఁ బిలుతువా ?

కృష్ణ—పిలుచుటకు నా యిష్టమా ? ప్రభుని సెల వెట్లుండిన నట్లు గదా మేము వర్తింపవలయును ?

సుబ్బ—ప్రభువు మీ చేతిలోనివాఁడే. కార్యభారమంతయు మీదేకదా ? ఇఁక నాతని సెలవేల ?

రామ—అట్లన వీలులేదు. "అడ్డాలలో నున్నప్పుడు బిడ్డలు గాని, గడ్డాలు వచ్చిన తర్వాత బిడ్డలా" యన్నట్లు ప్రభువు పెద్దవాఁడైన తర్వాత నితరులకు స్వాతంత్ర్యముండునా ? కృష్ణా! అనువోతునికిఁ బెండ్లియంటివి గదా, అది జరగుటకు

ముందు రేచిగాని కిచ్చిన వాగ్దానప్రకారము మాల దంపతులకుఁ బెండ్లి సేయుదురా ?

కృష్ణ—తప్పక చేయుదుము. రేచిగాని మనుమలలో నొక నికిఁ బెండ్లి నిశ్చయించితిమి. మొదట వారి యుపయామ మగును. వారి తలఁబ్రాలు కొనిపోయి యనుమోతు నుద్వాహము నుపయోగింతుము.

సుబ్బ—మాలవాండ్రు ముట్టుకొన్న వే ?

కృష్ణ—అవును. వారు ముట్టిన మాత్రమున దత్తండులములు పుచ్చి పోవునా ? ఎల్లకాల మట్టి ఛాందసపుటాచారములం బెట్టుకొని లేని పోని వైషమ్యములం బెంచికొనకుఁడు.

సుబ్బ—ఓయీ ! మాయాచారము లిప్పుడు మారవు. ఏదో యిట్లు కాలము జరగనిమ్ము.

కృష్ణ—మతాచారముల పట్లఁ బ్రభువులే జోక్యము కలుగఁ జేసికొని మూఢాచారములను మానుఁడని మిమ్ము నిర్బంధించినఁగాని మానరు కాఁబోలు.

రామ—కృష్ణా ! ఆచారముల మాటకేమి గాని, యనుమోత మహారాజున కెవ్వరి పిల్లనిచ్చి పెండ్లిచేయుదురు? ఇంత శీఘ్రకాలములోఁ దత్సంబంధ మెట్లు కుదిరినది ?

కృష్ణ—ఆ కథయంతయుఁ జెప్పెద, వినుఁడు. చెలికానివా రను నొక వెలమకుటుంబమువారు రాజగిరికి సమీపమున నొక పల్లియలోఁ గాఁపురమున్నారు. వారిలో మాధవరావుగా

రను నొకఘనుఁడు గలఁడు. అతఁడు చిన్నజమీందారుఁడు. ఆయన తురుష్కులతోఁ బోరి పోరి విసిగి క్షాత్రవృత్తిచే నిఁక నొరుల ప్రాణములఁ దీయరాదను మనోనిశ్చయము గల్గిన వాఁడై, భార్యను బోఁగొట్టుకొన్న దాది, యాపల్లియలో నొక యారామమధ్యమున నొక మనోహరగృహము నిర్మించికొని, మునివృత్తితో జీవనము గడుపుచున్నాఁడు. ఆతని కొక్కతయే కూఁతురు. చక్కనిచుక్క, మంచి గొనముల కిక్క. శతురింజయ పరిపూర్తియైన పిమ్మట, మనయనువోతుఁడు వేడుకచెలికాండ్రతోఁ గూడి రాజగిరి దుర్గము వెల్వడి వేఁటకై చెలికానివారి పల్లెవంకకుఁ బోయెను. ఆ ప్రాంతమునసుండు చిట్టడివిలోఁ జెలికాండ్రు త్రోవ తప్పిరి. అనఃవోతుఁడు పిపాసాపరిపీడితుఁడై యా యారామగృహముం జేరెను. అయ్యెడ మాధవరావుగా రింట లేరు. తత్సుత సీతమాంబయే యతిథికి సత్కారము లొనరించినది. అప్పుడే యా యుభయులకు శకుంతలా దుష్యంతులకుం బలె మోహాంకూరములు జనించినవి. అవి నానాఁటఁ బెరిఁగినవి. అనువోతుఁడు మృగయావ్యాజమునఁ బలుసారు లానిలయప్రాంతముల కేఁగుచుండు వాఁడు.

తే. గీ. ఒక్కదాని నొక్కటిచేర • నురవడిఁ జను
స్వచ్ఛవాహినీ యుగళంబు • భాతి వారి

హృదయగత మోహావాహినల్ పొదలుచుండె
సంగమ శుభసమయ సమీక్షణ మొనర్చి.

సుబ్బ—నీవు మహాకవివి గావున, లెస్సఁగా వర్ణించి చెప్పితివి.

రామ—కృష్ణా! అనువోత మహారాజునకు ముఖ్యమంత్రిగా నెవ రేర్పడిరి ?

కృష్ణ—అతని కెవనియందు విశ్వాసము కుదురునో, వాని నతఁడే యెన్నుకొనును. ఆ ప్రసక్తి మన కేల ?

రామ—ఇంత కష్టపడి పెంచి, పెద్దవానిఁగఁ జేసి, చదువుఁ జెప్పి, తనపాలములో దొరకిన సొమ్మంతయు నిచ్చి, నిరుప మానజయముఁ గల్గించి, భూరిసామ్రాజ్యముఁ జేకూర్చిన మీ నాన్నగారికిఁ దక్కఁగల మన జ్ఞాతివర్గమునకు నేవేని పారితోషికము లిత్తురా ?

కృష్ణ—సోదరా! ప్రత్యుపకారము నపేక్షించి మన ముప కారము చేయఁగూడదు. ఎన్నఁటికి మా నాన్నగా రట్టి పారితోషికములు కోరరు. అనువోతుఁడు సురక్షితముగా రాజ్యలక్ష్మిం జేపట్టఁగల్గిన తర్వాత, వలయు కట్టుదిట్ట ములఁ జేసి, తాము సకుటుంబముగా నీ యూరికి వచ్చి, మరల నెప్పటికై వడి శిష్యులకుఁ బాఠములఁ జెప్పుకొనుచు, వ్యవసాయవృత్తితో జీవింప నిశ్చయించుకొని యున్నారు. నాఁడు చాణక్యుఁ డశేషలయూనించి-చంద్రగుప్తుని సింహాసన

నాధిష్ఠుం గావించెనో, మొన్న మొన్న మాధవవిద్యా రణ్యు లేలాభము గాంక్షించి రాయలవారిని విద్యానగర ప్రభువుగాఁ జేసిరో, యట్టి ప్రయోజనమే నా తండ్రియు నభిలషించును. ఇంక మన జ్ఞాతులందఱు నేదో యొకటి యాసపడుట తప్పు. అనువోతుఁడు జన్మింపక పూర్వము మీ రందఱు శీలవతిపట్ల నెట్లు వర్తించిరో, జ్ఞప్తియం దున్నదా? ఆ వర్తనమునకుఁ దగిన ఫలమే పొందుట యర్హముగాని, విశేష మాసపడరాదు.

సుబ్బ—రామన్నా! నీ శరీరమువలెనే నీ బుద్ధియుఁ బొట్టిగా నున్నదే! నరసన్నకు ధనాపేక్షయేయున్న, నిధిలోని విత్త మంతయుఁ దానే గ్రహింపఁడా?

రామ—నిజమే. కాని యనువోతుఁడు మా వింజమూరివారికిఁ బురోహితత్వమేని యియ్యఁడాయని య ట్లడుగుచుంటిని.

కృష్ణ—అతని పురోహితముకోరు మనమెల్లరము-వింజమూరి వారమే యననేల? సమస్త కుటుంబములవారమును— నతనికిఁ బురోహితులమే.

సుబ్బ—మంచిమాటఁ జెప్పితివి. ఒక వింజమూరివారే యనుట యేమి? మేమందఱము మాత్రముగామా?

రామ—కాకేమి? నాఁడు నీవుకూడ వెంకన్నతోఁ గూడి నరసన్నభట్టారకునిపై దాడి నడుపలేదా? వానియింటఁ

బురోహితత్వము మానుకొనలేదా? నీకుఁ బ్రాపకము గల యింగ్లీషువారి నాతనిం గూర్చి నిందావాక్యములు పలుకలేదా? ఇప్పుడు శ్రీరంగనీతులు చెప్పుచు మా వాని మాటలకుఁ దాళము వైచుచు భళాభళీ యనుచున్నావు. నీ వొకసంస్థానాధీశ్వరికిఁ బురోహితుఁడవు కావా? ఆ రాణివలన నాల్గుడబ్బు లాసించుటలేదా? మొన్న దేవీ నవరాత్రములకేమి మునిఁగినదని కమలాపురము వెళ్లితివి? నీ యట్టియాశయే యెల్లరకు నుండునని యెఱుఁగుము.

కృష్ణ—మీలో మీరేల తగవులాడెదరు? అనుపోతుఁ డర్థులకెల్ల భూరిదానములు చేయును. ఆతని ధనము ప్రజల సంరక్షణమునకే వినియోగింపఁబడును గాని, స్వీయ భోగములకుఁ గాదు. ఆవైభవము లన్నియుఁ జూతురు గాక! శుభసమయమును నిరీక్షింపుఁడు. మా వెంకన్న బాబూతో నీకనైన మచ్చరము మానుమనియు, వేఁడు కలఁ జూడ రాజగిరికి రాఁ గోరితిమనియుఁ జెప్పుము. నా కికఁ సెలవిండు.

(కృష్ణసూరి నారాయణశాస్త్రితోఁ నేఁగును.)

సుబ్బ—మనలో మనము వాదులాడరాదు. ఈ సమయము పోఁగొట్టుకొనక మనము నరసన్న ననుసరించి నాల్గుడబ్బు లేరికొందము రమ్ము.

రామ—అదే గదా నేను గాంక్షించునది? ఏ తంటాలు పడియో ప్రధాన పురోహితత్వము సంపాదింపవలెనని నాకుఁ గోరికగలదు.

సుబ్బ—అయ్యోడ నన్ను మఱచిపోకుమీ !

రామ—ఎంతమాట ! మఱతునా ? పద. మనవాండ్రి నెల్లఁ ఋరికొల్పెదము గాక.

(నిష్క్రమింతురు.)



## తృతీయరంగము.



రంగము:—రాజగిరికోటలోని యుద్యానవనము.

ప్రవేశము:—సీతా శీలవతులతో ననువోతమహారాజు. వారు సోఫాలపైఁ గూర్చుండి యుందురు.

శీల—శ్రీనరసన్నభట్టారకుని యవ్యాజకరుణచే మనకోర్కులెల్ల సిద్ధించినవి. నే నేయాశయముతో నింత దనుక జీవించి యుంటినో, యది నెఱవేఱినది. ఇఁక నానందముతోఁ జిరకాల వియోగసంతప్తులై నాకొఱ కెదురుచూచు మీనాయనగారి కడ కేఁగెదను.

అను—అమ్మా ! అదేటిమాట ? " మొలకవృక్షంబు గావలయు, శాఖోపశాఖలయి యది ప్రవృద్ధిఁ గాంచవలయును."

అని గదా మా నాన్నగారు నిన్నాదేశించిరని నాతో నుడివితివి? ఆయనయాజ్ఞ పూర్తిగాఁ జెల్లింపవలదా? ఇంత కాలము నీ వియోగభరంబు సహించిన నా జనకుఁడు మఱి కొంతకాలము సైఁపలేకుండునా? నేనొక సామాన్య పద్మనాయక కులజుఁడనని మాత్రమే నమ్మియుఁ గేవల దైవప్రేరణముచే నాయందు గాఢంపువలపు నిలిపి, నా చెట్టఁబట్టిన యీ నీకోడలికి నీ వన్నిట మార్గదర్శినివై యుండి నీతులం గఱపవలదా?

శీల—నాయనా! మీ రిరువురును సీతారాములవలె నన్యోన్య ప్రేమ వహించి చిరకాలము మనుఁడు.

అను—అమ్మా! జనకుఁడు నాకముంబట్టి చనినను కుమారుని విడువకయుండు కౌసల్యవై నీ వున్నప్పుడు గదా, మేము సీతారాములమై యుండఁగలుగుట?

శీల—(బుజ్జగించుచు) వెఱ్ఱితండ్రీ! అటులే యుందును లెమ్ము. అమ్మా! సీతా! మా యదృష్టవశమున నీవు మా కోడలవైతివి. నీ జనకుఁడు జనకరాజర్షితుల్యుఁడై కేవల సాత్వికుఁడై యుంటచే నీకు హితోపదేశములు చేసియే యుండును, అయినను, నేను గూడఁ గొన్ని మాటలను జెప్పెదను. వినుము.

మ. పతియేదైవము, తండ్రియున్, గురుఁడు, సద్బంధు ప్రకాండుండునా
మతి నూహింపుము; తద్ధితైకశుభకర్మంబుల్ సదాసల్పుచే

యతికర్తవ్యమటంచు నెంచుము; సమ♦స్తైశ్వర్యముల్ గాంచి గ
ర్వితవై యుండకు; దాసినై నసమతన్♦వీక్షించిమన్నింపుమా.

ఉ. గౌరవమిచ్చి కప్రిమ్మఱఁగ ♦ గౌరవమందుము; సృష్టికర్త వి
స్తారకృపాపరుం డగు చొ♦సంగిన విత్తము దీనరక్షణో
దారయశఃప్రతిష్ఠలు స♦ధర్మముగా సలుపంగ మాత్ర, మ
వ్వారిగభోగభాగ్యముల♦వర్తిలఁగాదని యెంచుమెల్లడన్!

సీత—(వంగి నమస్కరించి) అత్తా! మీ రిచ్చిన మహితోప
దేశములనెల్ల శిరసావహించి యాచరింపఁ బ్రియత్నింతును.
తదాచరణమునందు భగవంతుఁడు కూడ నాకుఁ దోడ్పడి
మీ మెప్పును బడయఁజేయును గాక.

శీల—కుమారా! నీ పట్టాభిషేక మహోత్సవమునకు
జరుపఁబోయెడు వినోదము లెవ్వి?

అను—అమ్మా! వానినెల్లఁ దాతగారికినిఁ, గృష్ణసూరి మామ
గారికిఁ, గృష్ణయ్యబాబుగారికి విడిచిపెట్టితిని. వారే యథో
చిత వినోదము లేర్పరింతురు గాక.

శీల—నాయనా! మంచిపనిఁ జేసితివి. మన బాగుఁగోరి యిట్టి
యుచ్చస్థితికి మనలఁ దెచ్చిన యీ మహానుభావులకే
సమస్తరాజ్యభారమును విడిచి నీవు సుఖముండుము.

(నరసన్నభట్టు ప్రవేశించును.)

ఇదే, బాబయ్యగారును కూడ సమయమునకే వచ్చిరి.

అను.—ఆర్యా ! సన్నాహాములన్నియుఁ బూర్తియైనవా.?

నర.—చాలవఱకుఁ బూర్తియైనవి. నవాబులయొద్దఁ జిరకాల సేవ లొనర్చి మెప్పుగన్న రాజకార్యనిర్వాహణదక్షులను బెక్కండ్రను సంపాదింపఁగల్గితిని. వారి కర్హపదవు లొసఁగి మన కొలువులో నుంచితిని. వారే గాక, నీ పూర్వుల కొలువులో వర్తించినవారు, మహితవిశ్వాసపాత్రులు, కొందఱు కూడ లభించిరి. వారలను వివిధశాఖలయం దధికారులనుగా నియోగించితిని. మాధవవర్మకొలువులో విధిలేక నిలిచియుండియు, హృదయముల మీ శ్రేయంబే కాంక్షించు ఘనులను గొందఱం ద్రోసిపుచ్చక చేపట్టితిని. ఒక్క ప్రధానమంత్రిని మాత్రమే నియమింపవలసి యున్నది.

అను.—ఆ పదవికి నామాతులుండగు కృష్ణసూరియే సర్వవిధముల నర్హుఁడు. అతనికే దాని నొసంగఁ బ్రార్థించుచున్నాను. కృష్ణయ్యబాబుగారు సర్వకార్యదర్శిగా నుండవచ్చును. నారాయణశాస్త్రిగారు, సోమేశముబావయు నాస్థానకవులై యుందురు గాక.

నర.—ఆస్థానకవులైతే వారుండవచ్చును. వారిలో దేవులపల్లి నారాయణశాస్త్రి యష్టావధాన శతావధాన [redacted] విధాన చాతురిగల్గిన పండితకవి. "సీతాకల్యాణ [redacted]

ద్వ్యర్థికావ్యమొకటి నీ పెండ్లికథయే యాధారముగాం గైకొని రచించియున్నాఁడు. తత్కృతికి నిన్నే భర్తగా నుండఁ గోరుచున్నాఁడు. మన సోమేశము "యాదవ రాఘవీయ" మను ద్వ్యర్థికావ్యమొండు రచియించినాఁడు. అదియు నీ పట్టభద్రోత్సవవేళ నీ కొకల్పింపఁ దలఁచు కొన్నాఁడు. నీ కోరికను బట్టి కృష్ణయ్యను గార్యదర్శిగా నియమించుటకును నా కిష్టమే. కాని కృష్ణుఁడు ప్రధాన మంత్రిగా నుండుట కర్హుఁడు కాఁడేమో యని సంకోచించు చున్నాను.

అను—సంకోచము వలదు. సద్విద్యగలవాఁడు, సహృదయుఁడు. అతఁడు తగకున్న, మఱి యెవ్వరు తగుదురు? అది గాక నా కింకొక్క కోర్కిగలదు. దానిని మీరు తీర్పక తప్పదు.

నర—ఏ దాకోరిక?

అను—ఈ రాజ్యసంపాదనమునకు మీ యవ్యాజకరుణయు, నమోఘాశీర్వాదమును—ఈ రెండే మూలకారణములు. మా వంశోద్ధరణముపట్ల మీరు పడిన శ్రమకు మేము ప్రత్యుపకార మెట్లు చేయఁగలము? ఒకవేళ చేయఁ బూనినను, అది లోటుగలదియే యగును. ఇప్పుడు మనము సంపాదించిన రాజ్యములోఁ గొంత మా పూర్వులది, మఱికొంత మాతనముగా నార్జింపఁబడినది. మా తండ్రి

గారి రాజ్యము మాత్రము నాకు వదలి, తక్కినది మీరే స్వీకరించి, దానికి మీ కుమారుని బ్రభువుగా నొనర్పుఁడు. ఇదియ నా కోరిక.

సర—నాయనా! నీ కోరికలోఁ దప్పేమియు లేదు. కాని బ్రాహ్మణులకు రాజ్యమేల? వారు కేవల సత్త్వగుణ ప్రధానులై వర్తింపవలయుఁ గదా? అలవాటులేని రాజత్వము వారికెట్లు పనికివచ్చును? అది యట్లుండ, నీకై మేము పడిన యల్పశ్రమ ప్రతిఫల మపేక్షించి చేసినది కాదు.

సీ. కవి సూరిజన గాయ♦క ముఖ విహంగముల్
వసతు లొంది సుఖజీ♦వనము గనఁగ
దారిద్ర్య దుర్భరా♦తపతాపమున కోడు
పాంథ దీనతతికి ♦ స్వాగత మిడ
అన్యశరణ్య శూ♦న్య లతాలతాంగులు
సాచు కేల్దివల ♦ శాంతి యడఁప
ఆశ్రిత భూతచ♦యమునకుఁ బ్రతిఫలా
పేక్ష రహిత ఫల♦బృందమీయ
గీ. రావువంశ కల్పక వృక్ష♦రాజ మొండు
బ్రహ్మదేవుఁడే సృజియించెఁ ♦ బరమకరుణ;
దాని ధర్మంబు సామాన్య ♦ దర్భదశము
దాల్ప శక్యంబె? హాస్యాస్ప♦దంబు గాదె?

కావున, బాబూ ! మాకు రాజ్యంబువలదు. తప్పక నీవే తద్భారము వహింపవలయును.

అను—తమరు రాజ్యభాగమును స్వీకరింపకున్న, నే నింక నే మార్గమున నా ఋణముఁ దీర్చికొనఁగలను ?

నర—మమ్ము గౌరవించుట గదా, నీవు కోరునది ?

అను—కేవలము గౌరవించుట మాత్రమే గాదు; ఋణవిముక్తి నీఁగఁ గల్గుటకును గోరికగలదు.

నర—అటులైన, మీ రాజకుటుంబమునకు మేము శాశ్వతముగాఁ బురోహితులమై ప్రధాన గురుస్థాన మలంకరించి, మీ సపర్యలం గొనుచుందుము లెమ్ము.

అను—అంత మాత్రమున నాకుఁ దృప్తికలుగదు.

నర—తృప్తికలుగకున్న, మా వింజమూరివారిలో నర్హులకున్నతోద్యోగము లిమ్ము.

అను—ప్రధాన ప్రధానిపదవి మీ వంశములోనివారే సదా పొందుచు మమ్ము ఋజుమార్గమునఁ బెట్టుదురు గాక యని కోరుచున్నాను.

నర—మీ రాజత్వముతోఁ బాటు మా మంత్రిత్వమును వంశపారంపర్యముగనే వచ్చుఁగాక. అటులే కావింపవచ్చును. నీ యభీష్టానుసారముగాఁ గృష్ణుఁడే నీకు సచివాగ్రేసరుఁడై యుండును లెమ్ము.

అను—ధన్యుఁడనైతిని. మఱేయే యేర్పాటులు గావించితిరి?

నర—నీ పట్టాభిషేకమునకు మనకు హితులగు రాజులఁ బెక్కండ్రి నాహ్వానించితిమి. వారి వారి గౌరవస్థానము లకుఁ దగిన విడుదులను గూడ నేర్పాటు చేసియుంటిమి. అన్ని వర్ణములవారికిని, బంచములకు సైతమవిచ్ఛిన్నాన్న దానములు సలుపుటకుఁ దగిన సన్నాహములఁ గావించితిమి. నీ పూర్వుల గద్దియ యలంకరింపఁబడినది. అంతఃపుర జనమునకు సుచితవసతు లేర్పఱుపఁబడెను. వారికి శ్రీ సీతా దేవియే స్వాగత మొసంగవలయును.

శీల—బాబయ్యగారూ! మా నాయన యథావిధిఁ దన ధర్మ ముల నెఱపఁగల్గుటకుఁ దగిన యుపదేశము లీయ వేఁడెదను.

నర—అమ్మా! నేను జీవించియుండు నంతకాలము మీ సేవ లోనే యుందును గదా? ఎప్పు డేయుపదేశ మగత్యమో యడి యిచ్చుచునే యుందును. అయినను సమయమునకు స్ఫురించిన యొకటి రెండు విషయములు మాత్రము వచింతును. నాయనా! వినుము.

చ. కనుఁగొను మల్లనీరజని♦కాయ మరంద ధనంబు నెల్ల మె
ల్లనమధుపాళి యేక్రియవి♦లాసగతిం గ్రహియించునో, చిరం
తన సహకారులై వెలయు♦తక్కలహంస లొకించు కేని త
ద్ధనమనుభుక్తిఁ గాంచ కెటు♦దవ్వుగఁ బోవునొ నిస్పృహాత్ములై!

చ. అల సహాకార భూజ మెటు♦లంచిత సత్ఫల శోభితంబుగా
వెలసియు, గర్వసంకలిత♦వేషముఁదాల్పక,నమ్రిభావముఁ
దెలిపెడు వైఖరింగనునొ♦దిమ్మరి యొక్కఁడు రాలురువ్వని
శ్చలమతినుండి యెట్లు ఫల♦సంఘ మొసంగునొ, చూచి
యుంటివే ?

కుమారా ! యింగితజ్ఞుఁడవగు నీవు వీని భావమెఱింగి వర్తిం
పుము. సీతాదేవీ ! నీకుఁ గూడఁ గొన్నిమాటలు చెప్ప
వలతును. వినుము.

సీ. లతికవీ వతఁ డవ♦లంబదండ మగును
ద దనుసరణమె నీ ♦ ధర్మమగును
తమ్మివీ వతఁడు త♦త్సఖుఁడు సదా వికా
సము వహించుటె నీకు ♦ సౌఖ్యమగును
నీడ వీ వతఁడు ని♦జైందు దీపంబు త
దనుగమనంబె నీ ♦ న్యాయమగును
అలచకోరమ వీవు ♦ నెల యతం డెపుడు తత్
ప్రేమసుధలఁ గ్రోలఁ ♦ బ్రీతియగును
గీ. వీని సార మెఱిఁగి సర్వ♦విధముల నను
కూలవరు ననువోతేందుఁ ♦ గూడి యిలను
సకల సౌఖ్యసంపద్విశే♦షములఁ గనుమ !
శ్రేష్ఠగుణ నికురంబ ! శ్రీ♦సీతమాంబ !

అమ్మా! శీలవతీ! కొడుకును గోడలిని నీవే దిద్దికొనుము. ఐశ్వర్య దారిద్ర్యములయందు మోదఖేదము లందితివి గాన, నీకుఁ దెలియని యంశములే యుండవు. నే నిఁకఁ బోయెద.

(నిష్క్రమించును.)

శీల—బిడ్డా! ఈ మహానీయుఁ డొసంగిన సదుపదేశములను బాటింపుము. ఇన్నాళ్లకు నీవు నీ తండ్రిగారి యుచ్చస్థితి యందుండఁగా నా కన్నులలరఁ గాంచఁ గల్గితిని. నీకు సర్వ విధముల ననుకూలయగు నిల్లాలు పరమేశ్వ రానుగ్రహ మునఁ జేకూఱె. రతీమన్మథులవలె, నుషానిరుద్ధుల పోల్కిఁ, బ్రభావతీప్రద్యుమ్ను లట్టు లన్యోన్యప్రేమ రసంబున మీ దంపతు లోలలాడుదురు గాక యని సదా భగవంతునిం బ్రార్థించుచుందును. తల్లీ! నీవు నీ హృదయేశునితో నీ మనోహర సాయంకాలసమయమునఁ బ్రకృతి సౌందర్య మును గొంతతడవు తిలకించి లోనికి రమ్ము. (వెడలును.)

(సీతానువోతులు సానురాగ దృష్టులం బరపికొందురు.)

అను— తే. గీ. భామ! యలజక్కవలజంట ♦ నీ మనోహ
రావయవ సుందరత్వంబు ♦ నందలేక
లజ్జచే శిరమ్ములు వంచి ♦ ప్రక్క చూపు
లెట్లు నీ వంకఁ జూచునో ♦ యెఱిఁగియుంటె?

సీత—(ముసిముసి నవ్వులు నగుచు) ప్రాణేశ్వరా! దాని కేమి గాని,

తే. గీ. శైవల మృణాళ ముఖ పరి♦ష్కారధారి
యగుచుఁ బద్మపత్త్రింబె స్వీ♦యాతపత్త్రి
మై వెలయ రాజశీవిమై ♦ నడుగు లిడుచు
నంచతేఁ డరిగెడుఁ బట్ట ♦ మందఁబోలు !

అను—ప్రియా ! హంసరా జటులుండఁ దద్రాజ్ఞి యెటు లున్నదో చూచితివా ?

తే. గీ. ఆత్మనాథుండు సభఁదీర్ప ♦ నరిగియుంట
స్వీయ పరిచారికా పరి♦వేష్టితయయి
యొక్క కమలాసనం బందు ♦ నొప్పు లోలుక
నంచరాణి యె ట్లుపవిష్ట ♦ యగునొ కంటె ?

సీత—తే. గీ. పద్మపత్త్ర శయ్యాస్థలిం ♦ బవ్వళించి
కపటనిద్ర నటించు ని♦జపతి నెట్లు
లమ్మరాళ భామిని ప్రబో♦ధమ్ము సల్పి
వెనుక కేఁగునో విఫలమై♦కను మహీశ !

అను—నిద్రించువారిని మేల్కొల్పవచ్చుఁ గాని, నిద్దుర నటించు వారి నెవ్వరు ప్రబోధింపఁగలరు ? ఆవంకఁ జూడుము.

తే. గీ. తన్ను వెంబడించి, తఱిమి ♦ తఱిమి వచ్చు
పోతుబాతును గికురించి, ♦ లోఁతునీళ్ల
మునిఁగి, పెంటి యేగతి గెంటి ♦ చనునొ, కనుము
కాంత కిష్టంబు లేకున్నఁ ♦ గార్యమగునె ?

సీత—పురుషు లట్లు లేనిపోని గౌరవము కాంతల కాపాదిం
తురు. కాని పురుషకారము చెల్లకుండుట యెన్నఁడేని
గలదా?

తే. గీ. మందమలయానిలకుమార ♦ మాంత్రికుండు
మంతిరించుటఁ గాఁబోలు ♦ మైక మంది
కొమ్మలవె మిమ్ముఁ గరపల్ల♦వమ్ము లలర
రమ్మనుచు పిలుచుచున్నవి ♦ రాకుమార!

అను—అట్లైనచోఁ గరము కరమునఁ గీలించి మనమొండొ
రులము విలాసగతి నాకొమ్మల డెందమ్ముల నలరింప నేఁగు
దమ్ము. రమ్ము.

(నిష్క్రమింతురు)

---

చతుర్థరంగము.

---

రంగము:—రాజగిరిదుర్గములోని సభాగారము. అది సింహాస
నాదులచే నలంకరింపఁబడి యుండును.

ప్రవేశము :—కృష్ణసూరి, కృష్ణయ్య, నారాయణశాస్త్రి,
పుల్లయ్యశాస్త్రి, భటులు, సామంతరాజులు, మున్నగువారు
వారివారికిఁ దగిన యాసనముల నున్నవారై.

కృష్ణ—సభ్యులారా! మీ రందఱు సుఖాసీనులరుగండు.
శ్రీయనుపోతమహారాజ పట్టభద్రుఁడై సింహాసనాధిష్ఠుఁ

డయ్యెడు శుభముహూర్త మాసన్నమైనది. అవె మంగళ వాద్యములు మ్రోగుచున్నవి. మహారాజు సపరివారుఁడై, యేతెంచుచున్నాఁడు

(తెరలో వందిమాగధులు)

"శ్రీ రేచర్లవంశ విక్రమాదిత్య! రేచర్లవార్ధి చంద్రోదయా! గోన మల్లారెడ్డి రణభూత బలిహరణా! మంగళపూడి యిమ్మడిరెడ్డి రణరంగమర్దనా! రావువరపు మల్లారెడ్డి భుజాఘట్టనా! పాలూరు పోలారెడ్డి రణనిర్ధూమధామ! బండి కోటారెడ్డి రణభుక్తి ఖడ్గభేతాళ! వినుకొండ మారారెడ్డి ప్రాణవాయుహరణ కరవాల క్రూరసర్ప! కుంట్లూరు మారారెడ్డి కంఠవిదళన ఖడ్గభైరవ కరవాలదంష్ట్రా! అరవపల్లి గౌరిరెడ్డి బలాటవీదావాగ్నికీలా! కొత్తపల్లి కొండారెడ్డి ప్రాణాపహారా! మహారాజ రాజా! మార్తాండ తేజా! ఆశ్రితకల్పభూజా! శ్రీ యనుపోత భూపాల బిడౌజ! జయము, జయము, దిగ్విజయము."

(సభ్యులందఱు లేచి నిలుతురు. మహారాజు నరసన్నభట్టు కరముం బట్టుకొని సభాగారముం జేరును.)

నర——(అనుపోతుని సింహాసనము చెంతకుఁ గొనిపోయి) సభ్యులారా! నేఁడు మిగులఁ బుణ్యదినము.

సీ. అకలంక పద్మనాయక వంశ శుచిర ము
క్తావళీ తరళంబు ♦ రావుకులము

బాహోగ్రజాగ్రత్కృపాణధారా హత
ప్రబల వైరి బలంబు రావుకులము
భానుసూను సమానదాన సంతోషిత
ప్రకటార్థిపటలంబు రావుకులము
విమలకీర్తి ప్రభావిజిత సితాంభోజ
రాజహంస కులంబు రావుకులము
గీ. పరమ భక్తి ప్రపూజిత హరిగిరీశ
రమ్యచరణాబ్జ యుగళంబు రావుకులము
సకల సంశ్రిత పండిత సత్కవీంద్ర
రచిత సుకృతాయత ఫలంబు రావుకులము.

అట్టి రావు కులవార్ధిచంద్రుని, ననుహిత భూతలేంద్రుని, మీ యందఱ సమక్షమున సింహాసనారూఢుం గావించుచున్నాను. (కూర్చుండఁ బెట్టి కిరీట మాతని శిరముపై నుంచును. సభ్యులు కరతాళ ధ్వనులొనర్తురు.) కుమారా!

ఉ. ఆరవి చంద్రతారక మనంత మహీతల మేలు మేలుగా
భూరమణా! భవత్కుల సముద్ర మపార యశఃప్రవాహ వి
స్ఫారితమై, మహీవలయ పాలనభాసురమై, సమస్త వి
ద్యారస శోభితం బగుచు ధారుణిపై విలసిల్లుఁ గావుతన్.

(సభ్యులు పుష్పవర్షముం గురియింతురు.)

ఇప్పుడు సోమేశ్వరకవి తాను సంస్కృతమున రచించిన యాదవ రాఘవీయమను ద్వ్యర్థికావ్యములోని రెండు శ్లోకములం

జదివి గ్రంథము మహారాజేంద్రుల హస్తపద్మముల నుంచును. సావధానచిత్తులరై వినుఁడు.

సోమే—శ్లో. త్వం రామభూపాలక రాఘవశ్చేత్
త్వం కృష్ణగోపాలక యాదవశ్చేత్
కథం ప్రసిద్ధమ్ బహుకాలముర్వ్యామ్
నప్రాప్నుయా ద్రాఘవ యాదవీయమ్.

శ్లో. స్వానాం బుధానాం సుహృదాంచ పిత్రోః
గురోః కృపాంప్రాప్య కృతానతిస్సన్
శ్లేషైర శ్లేషైస్సహితం విధాతు
ముపక్రమే రాఘవ యాదవీయమ్.

కథలో నొక్క శ్లోకము మాత్రము చదివెదను.

శ్లో. సాకేతనామా స్సహితార్యసంఘా
నానా మహాభూరి వితాన శాలా
పురీవరా ద్వారివభా త్యయోధ్యా
భిఖ్యాంతరామా మధురాధరాయామ్.

ఇతి శ్రీ వింజమూరి కృష్ణసూరిసూనో రామకృష్ణ భక్తస్య గౌతమసగోత్రస్య సోమేశస్యకృతౌ రాఘవయాదవీమ్ శ్రీపద లక్ష్మణే వృత్తలక్షణ సూచకే శ్లేషమహాకావ్యే పంచదశా ధ్యాయమ్ సర్వం సంపూర్ణమ్.

నర—శ్రీ యనువోత భూతలేంద్రు వివాహకథయు, శ్రీసీతా రాముల వివాహకథయుఁ బ్రతిపద్యమున నిమిడ్చి నారా యణకవియొక ద్వ్యర్థి కావ్యమును నిర్దుష్టాంధ్రమున రచి

యుంచి యుండెను. మన ప్రభూత్తములకే తత్కృతి యంకితముగా సమర్పింప నతఁడు గోరుచున్నాఁడు. అతఁడును రెండు మూఁడు పద్యములను మాత్రమే చదివి కృతి సమర్పణ మొనర్చి ధన్యుఁడగును గాక.

నారా—

మ. అనయంబుఙ్ దన విష్ణుధర్మమును జేయంజాల కాత్మాంశముల్
గొని రాజప్రకరంబులఙ్ బనిచి శ్రీలోలాక్షితో నిత్య నూ
తన సంతోషవినోదము ల్గనెడు దైత్యధ్వంసి నారాయణుం
డనువోతప్రభుచంద్రుఁబ్రోచుతసమస్తైశ్వర్యసంధాతయై.

షష్ఠ్యంతములలో నొకపద్యము మాత్రము చదివెదను.

కం. సకల విరోధి శిరః కం
దుక కేళీ విరచిత పరితోషునకుఙ్, బూ
ర్ణకళాంచిత వేషునకుఙ్,
నికర గుణయు తానువోత నృపభూషునకుఙ్.

అభ్యుదయ పరంప రాభివృద్ధిగా నా యొనర్పం బూనిన సీతా కళ్యాణంబను ద్వ్యర్థికావ్యమునందలి కథాక్రమం బెట్టి దనిన— (కృతి నందీయఁబోవును.)

సభ్యుఁడు—కవీంద్రా! రెం డర్థము లిచ్చు మీ కావ్యపద్య మొకటియుం జదువఁ గోరుచున్నాము.

నారా—అట్లు చదువుట సంప్రదాయ విరుద్ధము. అయినను మీ కోర్కి తోసిపుచ్చక చదివెదను వినుఁడు.

చ. జనకుని సమ్మతిఁ గా సకల ♦ సద్గుణ రత్నకదంబ సీతమాం
బ నిఖిల దుర్జన ప్రకర♦భంజనుఁ దాపస రంజనుఁ గా రఘాం
బు నిధి విలాస సంచరణ♦పోతము భూమిప సింహపోతముఁ గా
అనుపమలీల గాంచెలనుప♦యామవిధింగయితమ్ము వట్టెడిఁ గా.

(అనువాదకుఁడు కవీంద్రుల కృతులంది వారికి దుశ్శాలువలు వేయినూటపదార్లు బంగారు పళ్లెరముల నిచ్చును. సామంతులు గానుకలియఁ గై కొనును.)

అను—(నమస్కరించుచు లేచి) గురువర్యా! సభ్యవర్యులారా! మీరు నా కొనర్చిన సాయమునకు నా కృతజ్ఞతా నమస్కారము లర్పింతు. నే నిప్పుడ నేమి పలుకవలయునో యెఱుఁగకుంటిని. నా హృదయము ఖేద మోద పూరితమై నానోట మాట రాకున్నది. నా యీయుచ్ఛ స్థితి కెల్లఁ గారకులు.

చ. అలఘు తపోధనుండు, నిఖి♦లాగమ ధర్మ చయానువర్తి, ని
ర్మలతరకీర్తి, సద్గుణ స♦మగ్రుఁ, డుదగ్రకుటుంబ వైభవా
కలితుఁడువింజమూరికుల♦కంధిసుధాంశుఁడు,సత్కృపాకరుం
డల నరసన్నభట్టను ధ♦రామర శేఖరుఁ డొప్పు మెప్పుగాఁ గా.

ఆ మహామహుని యవ్యాజకరుణా ప్రసారముచేతనే నేను బుట్టుట, పెరుఁగుట, విద్యనేర్చుట, యింతవాఁడనై నాపితృదేవతల మెప్పుగనుట-యివి యెల్లఁ దటస్థించినవి. ఆతని పాద పద్మములకు నా యష్టాంగనమస్కారము లర్పించి, నేను నా సంతతియు నిరంతర కృతజ్ఞతాపూరితులమై వారియొక్కయు, వారి పుత్త్రపౌత్త్రాదులయొక్కయు నమూాల్యోపదేశములం

గైకొనుచు [illegible]రింతుమని మీ యందఱసమక్షమున వాగ్దానము చేయుచు [illegible] యాసనముం గైకొందుఁ గాక. (సాగిలపడి నరసన్నకు [illegible] యతఁడు లేవఁదీయఁ లేచి కూర్చుండును.)

నర[illegible]భూ[illegible]రా! శ్రీ యనుపోతమహారాజు నన్నుఁగూర్చి [illegible]నమాటలకు నేనేమియు మాఱుపల్కఁజాలను. అతఁడు దీర్ఘాయుష్మంతుఁడై, పుత్త్రపౌత్త్రాభివృద్ధిమై మనెడుఁ గాత మని యాశీర్వదించుటకన్న నేఁ జేయునది లేదు. లోకములో సమస్తకార్యములను జేయువాఁడు భగవంతుఁడు. కేవలోపకరణమాత్రుఁడై మనుష్యుం డుండును. కావున ననుపోతునిపట్లఁ గాని మఱి యెవ్వరిపట్లఁ గాని నేను జేసిన దేదియు లేదనియు నంతయుఁ బరమేశ్వరకృతమే యనియు మనవిఁ జేయుచున్నాను. మన కింకేమి గావలయు? ఇట్లగునుగాక.

కవిరాజ విరాజితము.

అవనిని మానవకోటుల కెంతయు♦స్వస్తియొసంగెడుఁగావుత,భూ
ధవతతి భూపరిపాలన సల్పుత♦ధర్మపథంబును దప్పకయే,
ప్రవిమలజీవనముం దెడ్తునాలకు♦ బాపలకుం శుభమానతముం,
భువనము[illegible]సుఖంబులబొందుతఁబోల్పెసలారునటుల్